# మట్టెలరవళి

రచన

"ఆంధ్రా వర్డ్సువర్తు"

శ్రీ కవికొండల వేంకటరావు, B. A., B. L.

ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి.

# ముట్టె లరవళి

తొలకరి వానలకు తగిలిన కొత్త
కొత్త నీటితో గోదావరితల్లి చెంది
రించి ఉబ్బుబ్బొగుతూవుంది. ఆయమకు కుంకుమర్పిస్తూవుందా
యన్నట్టు ఎఱ్ఱగా తురాయిమొక్క పూసి వొడ్డునే కనిపిస్తూ
వుంది. ఆయమ కరళ్ళ నా దానికి హంగుగా తాళంవేస్తూ ఉందా
యన్నట్టు పసరాకులతో రావిచెట్టు రేవుచెంత ధ్వనిస్తూ యుంది.
" ఓ గంగమ్మతల్లీ! ఇవిగో! నీకు రవికలగుడ్డలు, ఇవిగో!
నీకు రంగురంగుల చీరలు యన్నట్టు సాయంకాల సంధ్యాదేవి
వన్నెచిన్నెల మయమై తొలకాడుతూ సౌభాగ్యవతులగు ద్విజాం
గనలో యన దోచుపక్షుల వరుసల్ని వెనుదరుముతూ యుంది.

కొత్తగా తగిలిన నీరు శబరి నీరా లేకపోతే పరిసరాల్ని
యున్న ఎఱ్ఱరాళ్ళ దిబ్బమీదుగా ప్రవహించి రంగుసుద్ద కలిసిన
రాజమహేంద్రవరపు నీరా యనే సంశయం గట్టునుండి విత
ర్కించే మనుష్య మానసాన్ని ఇంకా గుంజిస్తూనే యుంది. శబరి
నీరైతే యంత ఎఱ్ఱగా యుండదంటున్నారు కొందఱు. శబరి
నీరు కాకపోతే ఆపాఱుదల యుండదంటున్నారు కొందఱు.

ఇలా కొందఱు, అలా కొందఱు, యనుకునే వాళ్లు
యనుకుంటూనే యున్నారు. ఆ రాత్రి కడచిపోయింది. మఱు
నాడు తెల్లారి ఎనిమిది తొమ్మిది గంటలవుతుంది. పట్టపగలు.
పుష్కరరేవులో పల్లెజవ్వని నావలోంచి చేపలగంప నిండుది
వొడ్డుకు దించుకుని, పయట సవరించుకుంటూ ఉంది. పదిమంది

కొనుగోలుగాళ్లూ మూగేరు. పెద్దచేప, చిన్నచేప, ఎత్తిచూచి ఎంతకిస్తావు ? ఎంతకిస్తావు ? యని అంటున్నారు.

దూరాన్నే నడేట్లో లంక — లంకమీద జనం — ఆ జనం వేసికొన్న తాత్కాలిక కుటీరాలు—కుటీరాలనుబట్టి ఆరగట్టిన వలలు—యన్నీ కూడా ఒక్కక్షణంలో యల్లకల్లోలము అయిపోతూ మహాదృశ్యం వొకటి ప్రదర్శింపునకొచ్చింది. ఏమిటది ? పెద్ద ప్రవాహం. నీటివంక చూస్తే ఏనుగునడక, నురువువంక చూస్తే లేడిపరుగు. లంక, లంకమీది జనం, జనం వేసికొన్న కుటీరాలు, కుటీరాలను ఆరుతూయున్న వలలు యన్నీ మునిగిపోయినాయి. ఒక్క వంతెన, వంతెన మీదుగా వస్తూయున్న మెయిలు బండీ ఆ రెండే శాశ్వత మన్నట్టు తోచినాయి.

పల్లె జవ్వని వెనక్కి తిరిగి చూచింది. ప్రవాహం వచ్చేసిందని తెలిసికాదు. మెయిలుబండి యప్పుడే వస్తూవుంది. దాని చప్పుడుకు వెనక్కిచూసి, బేరగాండ్రతో "నన్ను పోనీయండ్రా ! బండికూడా వచ్చేసింది. నాకు దారియ్యండ్రా! చూడండి....మీతో బేరాలు ఎప్పటికీ తెగవు. బజారుకుపోతాను" యని యనాలనీ, బేరగాండ్రను తప్పించుకు బజారుకు పోదామనీ దాని వూహ. ఆ వూహతో వెనక్కితిరిగి చూచింది.

కాని పాపం! మెయిలువేగంకంటె, మెయిలుచప్పుడు కంటె, గోదారి గంగ యెక్కువగా మెరిసింది, ఎక్కువగా ఉరిమింది దాని కనుల్లోనూ, దాని వీనుల్లోనూ. యంతేకాదు దాని హృదయకుహరంలోనికి స్తంభాలు కూలి వంతెన ప్రీలి పడ్డట్టు యయిపోయింది. దాని కడుపు తరుక్కుపోయింది.

తెచ్చిన చేప లన్నింటినీ వచ్చిన మనుష్యులే యెత్తుకు పోయినారో గాని గద్దలే యెగరేసుకు పోయినాయోకూడా కాన

కుండా ఆ స్త్రీ గట్టమ్మటే వాలు పడవలా నడుస్తూ యుంది. మధ్యాహ్నం 12 గంటలయింది. యపరాహ్ణం మూడైంది. సాయంకాలం ఆరైంది. ఆమె ఆలా నీటికేసి చూపెట్టుకునే నడుస్తూయుంది. ఆమె కెదో దృష్టిపథాన్ని కనబడుతూయుంది. ఆమె పెనిమిటిలా కనిపిస్తూయుంటా డెవడో మనిషి నీటితో పెనుగులాడుతూ ఎదరీతను గట్టుకు వస్తూ యున్నట్టు ఉంటాడు. మళ్ళీ జారిపోతుంటాడు. దృష్టినుంచే జారిపోతూయుంటాడు. ఎలా రక్షించేది యతణ్ణి? ఎవరు రక్షించేది యతణ్ణి?

బహుళపక్షమి. చీకటి పడిపోతూయుంది. పైపెచ్చు ఝుంఝూ మేఘం కమ్ముతూయుంది. చిటపట చినుకు ఇదిగో యదిగో యంటూవుంది. రాత్రి ఎనిమిది తొమ్మిది కూడా అయింది. ఎలుగెత్తి పిలుస్తుందా? వెలుగేమైనా చూపిస్తుందా? చేయి విసురుతుందా? ఆమె ఏమి చేయడానికినీ అశక్తురాలను కోంది. ఆ యబలకు మతో ఆలోచనే తట్ట లేదనుకోంది. ఏలాగయితే ఉదయం తొమ్మిదినుంచీ గట్టమ్మట నడుస్తూ ఆ దృష్టి పథాన్ని పడేవాడు తన భర్తేమో యని ఆసాస యనుకుంటూ యుందో ఆలాగే యనుకుంటూ ఆలాగే నడుస్తూ ఉంది రాత్రి తొమ్మిది గంటలప్పుడున్నూ!

ఆమె దృష్టిపథాన్ని యప్పుడప్పుడూ పడుతూ అవునా, కాదా యనిపించేవాడు నిజంగా ఆమె పెనిమిటే వాడు. వాని పేరు నాగడు. వాడు ఆ హఠాత్తు వరద కేమన్నా చటక్కన కొట్టుకు పోయినాడు. ఈదగలడు. కాని ఎందాకా యని ఈత్తాడు. ఆధార మేమైనా యుంటే కొద్దిగా నిలదొక్కుకొని ఒడ్డున పడ గలడు. కాని తొలి వరదలో మనిషికి యసలే ఆధారం సున్న.

జంతువుకేదో స్వతస్సిద్ధమైన శక్తిసామర్థ్యం యనంతమైంది ఉండవచ్చును. కాని మనిషికి అలాంటిది ఉన్నట్టగపించదు. మనిషి శరీరనిర్మాణంలో కొమ్ములు లేవు. తోక లేదు. నాలుగు కాళ్లు లేవు. పోనీ—పడగ లేదు. కొండెం లేదు. ముడుచుకు పొయ్యే గోళ్లు లేవు. ముందుకు వచ్చే కోరలు లేవు. ముళ్లు లేవు పొలుసుల్లేవు. వేళ్ళ వేళ్ళమధ్యనూ చర్మం లేదు. ఏదీ లేదు. మనిషి కేదీ లేదని చెప్పొచ్చు.

మఱిన్నీ మనిషి అయినవాడికి తొలి వరదలో ఏదైనా పోనీ ఓ ఆధారం చూచుకుంటాడా యంటే వాడి కగ్గనబడేవన్నీ అడ్లేకాని ఒక్కటీ సజావైంది దొరకదు. నురుగు యడ్డు. నురుగులో కంపడ్డు. ఇంతెందుకు ?నగుడ్డే తనకడ్డు. పోనీ కొట్టుకు వచ్చే కల్పనాధారంగా చేసుకుంటాడా యంటే ఆ కలపలో వోచిక్కుంది. షాహుకార్లు కలపను కూనారం మీదుగా తెప్పలు గట్టి తోచుకువస్తూ ఉంటారు. అలాంటి తెప్పలు కొంత దూరం వచ్చేసరికి వాటి కంటె ముందంజ యయిన వరద ఆ తెప్పల్ని విడగొట్టి చెల్లాచెదరుచేసి ఆ కలపనూ అసలుసద్యః ఆ వరదకు విఱిగిపడ్డ చెట్లనూ ఏకంగావించి దొర్లించేస్తూవుంటుంది. ఈదే మనిషి షాహుకార్ల కలపెక్కేడా ఆ కలప నిలవకలప యవడం వల్ల పాకుడుకట్టియుండి జర్రునజారి తిరిగి గోదాట్లోపడిపోతాడు ఆ కలప దిగుచాయకుపోతుంది. ఇల్లాగామోసపోతాడు. యడివి చెట్టు దైన కొమ్మేదో దొరికిందా బ్రతుకు జీవుడా యనుకొంటూ కాస్తంత సేదతేరతాడు. కాని దాని తొఱ్ఱలోనో దాన్ని చుట్ట బెట్టుకునో మహాసర్పం కనుపించి పైప్రాణాలు పైనున్నపాళంగా ఎగరగొట్టేస్తుంది. తొత్తు నాగడి కెంతనేపూ షాహుకార్ల కలప

తెప్పలయొక్క విడిపోయిన తుండ్లే దొరుకుతూవచ్చేవి. వచ్చి వచ్చి జాఱిపోయేవి. ఆలా జాఱిపోవడంలో ఆనకట్టుదరిదాపునకే జారిపోయినాడు పాపం! ఏం చెప్పగలం? మఱి అక్కడ గడ్డి పరక పట్టుకున్నాడు. ఇంకో క్షణాన్ని పాముతోక పట్టుకుని దాన్ని వెనక్కులాగి అది కాటు వెయ్యబోతే బుడుంగున మునిగి పోయి నీట్లోనే 'అమ్మో' అన్నాడు. ఇంకోజాముకో ఎద్దు మూపురం సందెటగదించి కొంతదూరం ఈది, అది పట్టివ్వక పోతే, వదిలేసి ఆ వెనకాతలే కొట్టుకొస్తూవున్న ఇలారం ఎక్కి కూర్చున్నాడు. ఆలాకూర్చున్న నాగడిమీద కాకివాలింది. అదేదో బ్రహ్మరాక్షసి అని అనుకొని పిల్లిమంతరంవేసి ఆ కాకిని తప్పించుకుని, ఏటిలో కురికి అలసిపోయినాడు.

యోజిస్తే వాడి బతుకు ఆ సమయంలో ఎలాంటిబతుకు అయిపోయిందంటే—బుడగలో ఊపిరే వాడి ఊపిరి అన్నట్టయి పోయింది.

కనుచీకటి పడేవేళక్కామోసు నాగడికో పచ్చికొమ్మ కొట్టుకొస్తూ వున్నది చేతికిదొరికింది. కాని చీకట్లోదాని రంగా నిందికాదు. అదే వొడ్డనుకొని రక్కాడు. ఆకులు తగిలాయి చేతికి. ఏదోగడ్డం అనుకొన్నాడు. ఆ ఆకుల్ని ఇలా అలా వూపి "ఎవరు నీవు మనిషివా?" అని అడిగాడు. ఎవరూపలకలేదు. అయినా ఆలాగ్గానే గడ్డంపట్టుకొని వ్రేలాడుతూవున్న అభి ప్రాయంతోనే దాన్ని వెంటాడించాడు. అదో సుడిగుండంలో గిర్రున తిరిగి, అవతల దూరంగా వున్నదల్లా, ఈ తట్టుకు నాగడి సమేతంగా వచ్చిపడింది. ఏలాగైతేం రాత్రి 9 గంటలకు నాగడు గోదావరీప్రాన్తీరానికి చేరుకున్నాడు.

చేరుకున్నాడు ! కాని చేరుకున్న లాభమేమిటి ? చీకటి అయో మయం. మనిషీ మాకూ ఒకటే అన్నట్టుంది అంతాను.

మేఘాలు మెఱిస్తే కద్దు వెల్తురు. మేఘాలు ఉఱిమితే కద్దు చప్పుడు. కాని పిడుగు పడితే ! వడగ తగిల్తే ? నాగడు ! నాగడు ! మృత్యుదేవతయొక్క కఠోరదంష్ట్రాకరాళాల్లోంచి యివల బడ్డ నాగడు ! చచ్చిపోతాడే ! వాడి బుజ్జి చిల్లడి నెత్తురు వఱ్ఱయి పోతుందే !

ఆ చిక్కు సమయంలో నాగడికెలా తోచిందో ! "ఒలేవ్" అని కేకేశాడు. వాడి కాళ్ళదగ్గిరసానే వుంది ఆదాకా నడిచినడిచి ఉన్న వాడిపెళ్ళాం. ఆ ఆడమనిషి ఏమన్నా "నివ్వేనంట్రా !" అంది. "అవును నేనే" అన్నాడు నాగన్న.

ఇద్దరూ కూడా ఒక్కమాటు పైచీకు ఆకాశంకేసి చూచారు. "నిన్న సాయంకాలం లంకమీద మనం ఉన్నప్పటి ఆకాశానికీ ఇప్పటి ఆకాశానికీ ఎంతతేడా ఉందో చూశావంట్రా ?" అంది పిల్ల. నాగడు "దీని ముండామోసిన వరద !" అన్నాడు.

"ఇంకిప్పుడీ చీకట్లో ఎక్కడికి పోతాం ?" అంది పిల్ల. నాగడు "ఎక్కడికి పోతాం ?" అన్నాడు.

ఇద్దరూ అలా కూలబడ్డారు గట్టుమీద. నాగడు అడిగేడు "ఒలేవ్ ! నీవు ఇన్నాళ్ళనుంచీ చేపలమ్మిన రూపాయలు లంక మీద ఏదరిని కప్పెట్టావే ?" అని. పిల్ల అంది "ఆ దరినే గుడిసెలో ఉత్తరదెస. కనిపించలే ?" అని. కనిపించడానికేం లే. అవి మోగించిన పెద్దరాయే కొట్టుకుపోయినప్పుడు అవి ఉంటాయే వెఱ్ఱిదానా !" అన్నాడు నాగడు. అంటూ ప్రేమకొద్దీ పెళ్ళాం శరీరాన్ని తడుముతూ—

" నీ కాలివేళ్ళను మట్టెలున్నాయా ? " అన్నాడు.

" ఆ " అంది పిల్ల.

" అయితే నడిచి పోదాం ! లే ! మనవూరు ! నీ మట్టెల చప్పుడుకి పురుగు పుట్రా ఉంటే తప్పుకు పోతాయి. భయం లేదు. " అన్నాడు నాగడు. ఇద్దరూ లేచి నడుస్తూయున్నారు. పిల్లవి, మట్టెలు చప్పుడు అవుతూయుంటే నాగడింతా అంటాడు " ఇల్లాంటి చప్పుడేనే పొడుగూతా నే నీ పొద్దు గోదారి మీద వచ్చీ ప్రాణం పోయీ ప్రాణంగా ఊత్తూవున్నంతసేపూ నేను విన్నాది. ఇలాంటి చప్పుడేనే నేను విన్నాది ! ఈ మట్టెల చప్పుడేనే నీ మట్టెలుచప్పుడేనే ! " అన్నాడు నాగడు. అలా అంటున్న నాగడికి ముందు నడుస్తూ పైయూసుకు జవాబుగా పిల్ల అంది. " మఱీ పొద్దల్లా నీ కోసమై ఈ గట్టుమీద నడిచిం దెవరనుకుంటున్నావు ? నేనే ఈ మట్టెల్తో, మట్టెల్తో నే నే ! నే నే ! " అంది.

# ప్యారీ పారవరౌంటు

హిందూ ముస్లిమ్ ఐకమత్యం రాజకీయంగా ఎంత కుదర కుండా పోతూవున్నా, సాంఘికంగా విజయవంతం గావడం తఱుచు చూస్తూవుంటాం, వింటూవుంటాం ; ఒక్కొక్కప్పు డనుభవంలోకే వస్తూయుంటుంది. అటువంటి అనుభవం కలిగి నప్పు డనుకోకతప్పదు. " హిందువులేమిటి ? మహామ్మదీయు లేమిటి ? సమస్తసృష్టి సర్వేశ్వరమయం, సర్వేశ్వర మాయ " అని అనుకోక తప్పదు. మఱో చిత్రం ! మనుష్యులెంత తప్పురు

తప్పుకు తిరుగుతూవున్నా, కాలమనేది వొకటి తప్పనిసరిగా కొందరి కొందర్ని కలిపి చూపించడానిగ్గాను ఒకానొక అవకాశం కలిపిస్తుంది.

చూడండీ! అప్పటప్పట బక్రీద్ పండగ, దసరా సరదా, ఒకేవారం కలిసిరావడం తటస్థిస్తుంది. ఏకాదశీ, రంజాన్ ఒకే రోజున సమేలంగా వస్తూయుంటాయి. ఎందుకు రావాలి ఆలా కూడిగ్గా ఆయా వినోదాలు, వేడుకలు? ఐకమత్యప్రభావం ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా ప్రపంచాని కెరుకపఱచడానికే. ఈ కాలప్రభావాన్ని పుచ్చుకుని కొన్ని కొన్ని యితర ఐకమత్యాలు కూడా చిల్లరమల్లరగా వికసించక మానవు. హిందూ యువకుడు గళ్ళలుంగీ వెయ్యడం, మౌలవీ ఎడంనుంచి కుడికి చూడ్డం, ఆ వెంకటేశ్వరప్రచారం పీర్లబాజాతో జరగడం, బీబీనాంచారీసాహెబా బురకాలోంచి కాకుండా బోడిస్‌లోంచే సిగ్గూ ప్రేమా వెలిగక్కడం, మొహరమ్ వేషాలు, పగటి వేషాలు కలిసి మెలసి "వూయింగు" చేసికోవడం—ఈ తుది సంఘటనమే మన యీ కథకు మూలకందం, రసకంథ, కందాయఫలమూను.

పగటివేషాలన్నవాటికి యీ వుత్సవపురోజులవీ, ఆ వుత్సవపురోజులనీ లేవు. పాతశాలల్లో కుఱ్ఱవాళ్లు వేసే ఫాన్సీడ్రెస్సు వేషాలకైనా సంవత్సరోత్సవాలనీ, జయంతులనీ కద్దుగాని యీ పగటివేషాల తంతుకు వోవారం, వర్జం, తిథి, నక్షత్రం, ఘటిక, గ్రహచారం అక్కర్లేదు; ఎప్పుడు ఆకలివేస్తే అప్పుడే ఎదో వోవేషం వేసుకుని నాలుగువేళ్ళూ లోపలకు పోజూచుకోవడమే వాటి పరమావధి, పరిపాకమూను. మొహరమ్

ండక్కి వేషాలువేయడం కూడా ఆకలితీర్చుకోవడానికాను
సే వేషాలే. పెద్దపులి వేషం వేసినా, బండీ పెద్దపులివేషం
సినా, ఎఱ్ఱచిందుగువేషం వేసినా, పచ్చచిందుగువేషం వేసినా,
ంగాడివేషం వేసినా. దొరగారివేషం వేసినా,—చిట్టచివర తేలి
తుంది నిజభావం "అయ్యా! సెలవు! రూపాయకు తక్కువ
కుండా దయచేయించాలి!" అన్నప్పుడు.

ఆదాకా అవి పగటివేషాలు, ఇవి మొహరమ్ వేషాలు,
వి వేదసాంప్రదాయపువి, ఇవి ఖురాన్ సాంప్రదాయపువి అనే
దబుద్ధితో తిలకించే చూపర్లందటికీ "ఆకలి! ఆకలి!" అనే
క్రోశంతో ఆ వేషగాండ్రు ప్రార్థించేటప్పుడు సర్వసామాన్య
ర్వేశ్వర తేజోవిగ్రహం ప్రతిబింబితం కాకపోతుందా? అయి
రుతుంది. మత వైషమ్యం అన్నది మఱచిపోయి ఆ వేషాల
సి తేరిపార చూచేరు. చెవులు దోరెట్టుకు వినేరు.

"టమ్కు టమా—టమ్కు టమా"
"లగాలగీ—చకాబికీ"
(ఈల—ఈలమీద ఈల)
(కఱ్ఱల చప్పుడు డబ్బాల చప్పుడు)
"సిద్ధికి బచ్చా—రమ్తుచెలో"
"టమ్కు టమా—టమ్కు టమా"

అని పోతట్టు మొహరమ్ వేషాల నృత్యగీతాలు బహు
ారం వినిపిస్తూ కనిపిస్తూ వుంటే ఇంకోతట్టు రాస్త అనుకుంటూ
గటివేషాల ధోరణి, మునిపళ్లు నొక్కుకుంటూ మగవేషం,
దాన్ని సాహేబువేషం, నడుస్తూవుంది.—ఇలా—సోమయాజి:...
ఒసేవ్ సోమీ! ఎక్కడున్నావు?"

సోమిదేవి : "సోమీ సోమీ అనే పిలుపుకు విసుగూ విరామం లేదు గదా ! పీడినోరడ ! ఇదేంతంతు సాహేబుగారూ !

సాహేబు : "నీకీ నీ మొగుడ్కీ పడఖాపోతే తళక్ ప్రయోగించు."

సోమిదేవి : "అనేకసార్లు తడికప్రయోగించి చూశాను."

సాహేబు : తడిక్కాదు. తళక్."

సోమిదేవి :—

"నా తళుకు బెళుకులే చూడండయ్యా !
నా మెళుకువ చూపులె కానండయ్యా !
నన్నంటగబోకు సాహేబయ్యా !
నా మగని క్కోపం మిక్కుటమయ్యా !
తధిగిణతోం దధిగిణతోం,
సెంట్లూ పెట్టి అంట్లూ తోం !"—

పైగుంపూ క్రిందిగుంపూ వాళ్లవాళ్ల పెగ్గ పోకిళ్లు చూపించడంలో అంతకంత కన్యోన్యం దగ్గఱపడతారు.

—"మీదకు రాకు హూణమ్లేచ్చా ! అహం సోమయాజిన్ !"

—"'ఐ యామ్' అల్లందొర్ని."

—"అది ?"

—"బెల్లంసాని."

—"సోమీ ! వీళ్ళను చూశావు ? అల్లందొరనీ బెల్లంసాన్నీ ?"

—"ఇప్పుడు నేను అల్లంపచ్చడి చేయలేను !"

—"మఱేం పచ్చడి చేస్తావు ?"

—"సాహేబ్ పచ్చడి"

—"క్యా సాహేబ్ పచ్చడి?" అని సాహేబు సోమి దేవమ్మయొక్క రెక్కపట్టుకొని మొదట బలవంతంగా లాక్కుపోయినట్టు అభినయించి అనతిదూరంలో చెట్టాపట్టా తగిలించి ఇద్దరూ కలిసి ఆడతారు.

"మా తళుకు బెళుకులే చూడండయ్యా
మా మెళుకువచూపులె కానండయ్యా"
అంటూ.

సోమయాజివేషం బెల్లంసాని వేషంతో కలిసి మెలిసి "టమ్కుటమా!" అంటూ గెంతుతాడు.

బెల్లందొర తన నెత్తిమీద దొరటోపీ అలా ప్రేక్షక జనానికి చూపిస్తూ అందులోనుంచి ఓ రంగురంగుల జేబురుమాలు పైకితీసి, ఆ రుమా లూపుతూ "ఆవ్! జల్దీ రా! కమెలాంగ్! ప్యారీపారమౌంట్!" అని అరుస్తాడు. ప్రేక్షకజనాన్ని వొత్తిగించుకుంటూ ఓ బీబీ బిబ్బోకవతివేషం తక్కుతూ తారుతూ తన కక్కర్లేనట్టు బెల్లందొరవేషగాణ్ణి ఆకర్షిస్తూ చేర తీసుకుంటుంది. వీళ్ళిద్దఱూ అక్కణ్ణుంచి,

"టక్కర్‌కా చక్కర్"
"చక్కర్‌కా టక్కర్"
"షెక్కర్‌కా ముక్కెర్"
"ముక్కెర్‌కా షెక్కర్"

అని తాండవించి పోతారు.

ప్రేక్షకజనం, హిందువులు తురుష్కులు, పాశ్చాత్యులు అందఱూ ఆ ఆరువేషాల గమ్మత్తు పూయింగూ గంటూ తమలో తాము ముఖముఖాలు చూచుకుంటారు. దివ్యజ్యోతి? ఎక్కడ?

# ఆం ధ్ర శు ద్ధి

" తెనుగుతల్లీ !—తేరేచరణో సమర్పయామి నాగులావి
అబ్ సమర్పయామి క్రౌంబడ్ తెనుగుతల్లీ జేజే ! జేజే ! "

బుచ్చిరామయ్య కృష్ణామండలంలో పుట్టి, తూర్పుగోదావరిమండలంలో చదివి, పశ్చిమ గోదావరీ మండలంలో ఉద్యోగకాలం అంతా వెళ్ళబుచ్చి, యిప్పుడు రిటైరై పింఛనుతీసుకుంటూ, " అరవై యేళ్లై చదువుకోక మన్నుగొట్టినా " అన్నసామెత అక్కఱ కొచ్చేటట్టు,—పునః బారసాలై అనగా తిరిగి పేరుంచబడ్డ—రాజమహేంద్రంలో, హిందీచదువు క్రొత్తగా ప్రారంభించాడు. ఎందుకయ్యా ఇప్పుడీవిద్య అంటే అతని సమాధానం పైవాళ్ల ఎన్నిసార్లు అడిగినా వొక్కటే సమాధానం. " చూడండీ! వచ్చింది అఖిలభారత జాతీయప్రభుత్వం. పుచ్చుకునేది వారినుండి ఫింఛను. ఏ యెండకు ఆ గొడుగు పట్టమన్నాడు: ఫింఛను తీసికొన్నప్పుడు సంతకం కనక హిందీ అక్షరాల్లోచేస్తే మఱిపదికాలాలపాటు పింఛను వస్తుందని నా ధీమా. " ఇదీ అతని సమాధానం పైవాళ్ళతో. కాని అవకాశం చిక్కినప్పుడు వదలిపెట్టక పెళ్ళాంతో యింట్లో సరాగాలాడ్డానిక్కూడా దాన్నే ప్రయోగించడానికి వెనుదీశేవాడుకాడు.

పెళ్ళాంకో యేబై యేళ్లుంటాయి. ఆమె ఎప్పుడూ మొగానికి పెదకాసంత కుంకుంబొట్టెట్టుకు కాఫీ దగ్గర్నుంచీ మడిగా కాచి గవిరిదేవికి నైవేద్యం పెడితేనేగాని తాగననే మహాయిల్లాలు. మగని క్రొత్తబాససరాగం విన్నప్పుడల్లా ఆమె తన అడ్డబాస దిద్దుకుంటూ " నా కెందుకండీ ఆకాసావాళ్ళబాస,

ఆ గుఱ్ఱాల్ని తోలేవాళ్ళబాస హైహహా !" అనేది. అప్పుడు బుచ్చిరామయ్య ఇంట్లో ఆడవాళ్ళకు సమాధానం చెప్పేమాదిరిగా చెప్పేవాడు. "మనం మాట్లాడుకుంటూవుంటే యీ కొత్తభాష, ఇదివఱకు వాళ్ళకు అబ్బకపోయినా యీపైని మనకు పుట్ట బొయ్యే పిల్లలకైనా అలవడుతుంది. అప్పుడు భావిభారతఖండ మంతా ఏకమై వొకత్రాటిమీద నడుస్తుంది." అని నమ్మకంరాగా బోధించేవాడు.

ఆర్గుమెంట్సప్పుడు ఏలాచెప్పినా వొప్పుతుంది కాని ప్రాక్టికల్ సైడున పడేపాట్లు గమనించాలి.

ఫైవ్ ఎ. ఎమ్. కు అల్లా వోనాడు బుచ్చిరామయ్య హిందీపుస్తకం వొకటి చేతబట్టి పడక్కుర్చీలో కూర్చుని "కా" గుణితంకాణ్ణుంచి "హా" గుణితందాకా మొదటిపాఠంగా వర్ణ క్రమం చూచుకు పోతున్నాడు పడక్కుర్చీలో. అతగాడు కూర్చుంటే వీధి కనబడుతుంది.

వీధిలో అప్పటికప్పుడే పాలమ్ముకునేవాళ్లు పచ్చడికాయ లమ్ముకునేవాళ్లు తిరిగి తిరిగి అమ్ముకుంటూవున్నారు. అయితే అమ్ముకునేవాళ్లు అందఱూ ఆకర్షింపుగా వుంటారా ? ఉండరు. ఎవళ్లో కొందఱే వుంటారు. అప్పలమ్మ అనే గొల్లపిల్ల "ఎదుగు లోను పొదుగులోను నిరిటికీ యీ యేటికీ ఎంత తేడావుంది దానిలో" అని అంతా అనుకునేమాదిరిగా మట్టైనుంచి మేలిం పూస దాకా వయస్సొచ్చిందై, ఆకారం ఆచ్ఛాదనం మారిందై సుబ్బన్న అనే వో తోడివర్ణపు యువకుణ్ణి మాఱుబేరగాణ్ణి అడుగుతోంది.

"బలేవాడివి ! ముందుడబ్బో ? ఆఁ ఆఁ" అని. దానికీ వాడికీ అసలు సంభాషణ ఎక్కడ ప్రారంభమైందో మనకు

తెలియదు. వాడు ఆ సుబ్బన్న చెయ్యెత్తి చొరవగా దానిగంప లోంచి—అదివ్వనంటూన్నట్టు తొలగిపోతూవున్నా — పాలముంత వొకటి పైకి తీశేడు. వాని వెనకాతలే వుందికమోను అప్పలమ్మ తల్లి—అదేమన్నా సుబ్బన్నకండువా పట్టుకు "వెళ్లు ఈసారి. ఆ పాలట్టు కెందాకా వెడతావో చూస్తాను. ఈ వఱకు పుచ్చుకున్న పాలకు డబ్బులివ్వవైతివి. మళ్లీ పిల్లను ఇబ్బంది పెట్టి పట్టుకుపోతుంటివి. ఏం. ఊరికే వస్తున్నాయనుకుంటున్నావా పాలు మాకు ?" అని నిల్దీసి అడిగింది. సుబ్బన్న "మీవీ పాలే ? నీళ్ళేకదంటే. నీళ్ళక్కూడా డబ్బులేనా ?" అన్నాడు.—అల్లా మాటకు మాటకు పెరిగి పోనాది ఓలమ్మా—ఎందాకైనా వెళ్ళిపోయింది నాటి ధాకుడు పాలమ్ముకునేవాళ్ళల్లో ఆ వుదయం ౨ రోడ్డుమీద. ఒకతిట్టుకాదు ఒకతిమ్మకాదు. రిగ్యులర్ హ్యాసెన్సు అయిపోయింది బ్రాహ్మణవీధిఅంతా వాళ్ళ అవాచ్యపు కలహంతో. ఎవడికి శక్యం ? పాటకపుజనం విడివడి గోల చేస్తున్నారు అంటే ఆప నెవరికి శక్యం ? ఎలా ఆగిపోయిందో ఆగిపోయింది అంత శబ్దమూను హఠాత్తుగా.

బయటికి వెళ్ళి చూచాడు తన కుడిచేతితర్జని కితాబ్ మేఁ సబక్కా కా గజ్పర్ ఆనవాలుగా వుంచుకొని బుచ్చిరామయ్య. బుచ్చిరామయ్యకు కనబడ్డ దృశ్యమిది. ఆ గొల్లవాళ్ళ గుంపులో జొరబడి మునిసిపల్ హెల్తు ఆఫీసరు పిడత పిడత లేక్టోమీట రెట్టి చూస్తున్నాడు. "పదండి మేజెస్ట్రేటు కోర్టుకు; ఇవ్వండి పేర్లు" అని అంటూ అన్నాడు. బుచ్చిరామయ్యను పిల్చి ఆఫీసరు "అయ్యా మీరు సాక్ష్యముండాలి ఈ కేసులో" అన్నాడు. "ఎందుకు" అన్నాడు బుచ్చిరామయ్య. "అల్లాకాదు

వుండాలి. దేశక్షేమం కోసం, పురజనుల సౌఖ్యంకోసం, మీపిల్లల ఆరోగ్యం కోసం మీరు తప్పక యీ కేసులో సాక్ష్యం ఇవ్వాలి. ఇవ్వకతప్పదు. " అన్నాడు మాటవొ_త్తి.

గొల్లవాళ్ళంతా అంతవఱకు తమలో తాముపడ్డ లడాయి అంతా మఱచిపోయి ఏకమయి అందఱూ వొక్కకంటితెప్పకిందకు చేరుకున్న వాళ్ళకుమల్లే చూస్తూ నిలబడిపోయినారు బుచ్చి రామయ్య చుట్టూ ఆఫీసరుచుట్టూ. బుచ్చిరామయ్య అన్నాడు "ఎందుకుసాక్ష్యం? ఏమనిచెప్పాలి నేను" అని. ఆఫీసరు ఓపాల ముంతలో పాలు చూపి " దీనిలో ఎన్నినీళ్లు వున్నాయో మీరు ఈ మీటరులో గమనించి చెప్పాలి " అన్నాడు. బుచ్చిరామయ్య " అందులో నాకు నీళ్లూకనబడ్డం లేదు. పాలూ కనబడ్డంలేదు. బూతులాట తుంపర్లు కనబడుతున్నాయి. వాళ్ళమీద అధికారిగా మిమ్మల్నివేసేకన్న వోపోలీసును వే_స్తేమెరుగు. ఇందాకట్నుంచీ వొక్కటే రణగొణధ్వని. అశ్లీలధోరణి. " అని ఇంకా ఏకరువు పెట్టి ఏదో చెప్పబోతున్నాడు. బుచ్చిరామయ్య.... అంతలో బుచ్చిరామయ్య యింట్లోంచి వోకేక. అతని భార్య తనచేతిలో కాఫీకప్పెట్టుకు ఇంట్లోంచి సంబోధిస్తూంది. " ఏమండోయి : కాఫీ చల్లారిపోతూవుంది " అని. అది విన్నాడు కన్నాడు బుచ్చి రామయ్య. " ప్యారీకీ హాథ్‌మేఁ కాఫీ హై. మై జాతా హూఁ " అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయినాడు. హె_ల్తుఆఫీసరు, బుచ్చి రామయ్య అలా అంటూ పోతూవుంటే, మఱోసారి పాలకేసి చూస్తూ " ఈ పాలలో వెంట్రుకలుకూడా వున్నాయే నీళ్లేకాకుండా. ఇవి గొ_ర్రెనీళ్లు మేకనీళ్ళూ కూడనా? దానికి వేరేసాక్ష్యమే అక్కర్లేదు. నడవండి " అంటూ వాళ్ళందర్నీ కొట్టుకుపోయినా డెక్కడికో.—మఱి ఆ సందర్భం మఱచిపోండి పాఠకులు.

బుచ్చిరామయ్య ఇంట్లోకి వెళ్ళి మైం—మైం—మైం—అంటూ మైం తరువాతను "వచ్చాను," "తాగాను," "మళ్ళీపోయేను," అనే క్రియాపదాలు చేష్టలవల్లనే సాగించి వెనక్కి తిరిగేడు. వెనక్కితిరిగిన పెనిమిటిన్ని తనగాజుల చప్పుడుచే ఆపిందై "మీకొచ్చిన యేళ్ళూ ఎవరికొచ్చాయండీ! పామరుల బండ బూతులా పొద్దున్నే వినవలసింది! పొద్దున్నే స్మరించవలసింది." అని మందలించింది. "తుంభీ?" అన్నాడు బుచ్చిరామయ్య "నే కాకపోతే ఎవరుమందలించేదింక మిమ్మల్ని?" అంది గవిరిదేవి పీఠం దగ్గఱ అప్పటికప్పుడే తాను స్నానంచేసుకు పువ్వులూ అక్షతలూ అమర్చుకొంటూ.

బుచ్చిరామయ్య "బూతన్నది భావానికిగాని భాషకు లేదు" అన్నాడు. "వెనకటికి నేను కాలేజీలో చదువుకునే టప్పుడు రోమకవీరుని పేరొకటొచ్చేది. దాన్ని "సలా" అని మాహిస్టరీ చెప్పిన దొరగారిచేత అనిపించడానికి కొన్ని వందల యేష్లు పట్టింది. మఱోఅప్పుడు వో అరవఅయ్యర్ ప్రొఫెసర్ "బాయీ ది ఫోర్టీన్తు" రాజుకు మైనారటీ వదిలింది అని తెనుగున చెప్పడానికి "లూయీ ది పద్నాలుగు పెద్దమనిషి అయింది" అని వూరుకున్నాడు.—"ఎక్కడండి అది" అని అడిగింది భార్య. బుచ్చిరామయ్య "ఆంధ్రావిమెన్సు కాలేజీలో" అన్నాడు. "మఱి మన ఆడపిల్లకాయలంతా నవ్వలే?" "నవ్వకేం? చచ్చేటట్టు నవ్వేరట" నవ్వి అన్నారట "ప్రొఫె సర్ గారూ! మగాడు పెద్దమనిషి అవడం ఏమిటి? అని అడిగారట పెద్దమనిషి. పెద్ద, బడా అన్నాట్ట ప్రొఫెసర్. అప్పటికే నవ్వారుట వాళ్ళు. అయ్యర్ "ఆడవాళ్ళు

పెద్దమనుష్యులు గారు. మగవాళ్ళే పెద్దమనుష్యులు." అని కోపంపడ్డాట్ట. ఇంకా పిల్లలు నవ్వుతూవుంటే డైరక్టర్ను కోరు కొని ఆ కళాశాలనుంచి ట్రాన్సుఫర్ చేయించుకున్నాట్ట."

"ఆఁ ఆఁ. పెద్దమనిషి అయింది అంటే అర్థంకాక నేనా ఊరునుంచి వూరుబదలాయించుకున్నది ఆ బడిపంతులు?" అని అడిగింది బుచ్చిరామయ్యను బుచ్చిరామయ్యభార్య. అడుగుతూ తన గౌరీదేవిపూజ ప్రారంభించి చేసుకుంటూవుంది. 'పసుపు కుంకుం సమర్పయామి. గౌరీమహాలక్ష్మీతల్లీ!' అని.

పూజాసమయాన్ని భార్య వాడిన తెనుగునకు పుబ్బిపోయి బుచ్చిరామయ్య హిందీపుస్తకం అవలపెట్టి మాతృభాషలో పడ్డానికి ఉద్యుక్తుడయినాడు. ప్రథమయత్నంగా

"తెనుగుతల్లీ!"
తేరేచరణోం సమర్పయామి.
నాగులాబి అబ్ సమర్పయామి క్రొంబడ్
తెనుగుతల్లీ జేజే! జేజే!

అని ఉద్రిక్తుడైనాడు. బృందగానం 'తెనుగుతల్లీ! జేజేజేజే! జేజేజేజే! జేజే!

.... .... .... .... ....

## జా తీ య త

"జాతీయత యనేది ఎక్కడుందీ
మనవాళ్ళల్లో? అంతటా చచ్చింది"

అంటే 'అంతటా చావలేదు. ఇంకా కొందఱి కొందఱి హృదయాల్లోవుంది' అన్నాడు మిత్రుడు వెంకటరత్నం.

వెంకటరత్నం రచ్చపక్షి. వాడి కన్నీ హ్యాత్కవసమే. కేసులు తనవి యయినవీ తనవి కానివీకూడా సివిల్, క్రిమినల్, రెవిన్యూ, అన్నిసైడ్లువీ తిలకించి పారేస్తూ వుంటాడు. 'వో గొడవ చెబుతాను వినూ' అన్నాడు. 'జాతీయతను పురి గొల్పేదవుతేనే కావాలి' అన్నాను నేను. 'అలాంటిది కాకపోతే చెప్పనే చెప్పను. నావాణీ పలకనే పలకదు' అన్నాడు. అని వోపెద్ద క్రిమినలు కేసు ఎత్తుకున్నాడు.

ఆ కేసు సంగతి ఏమిటంటే! చంద్రమండలంలోంచి కొత్తగా దిగివచ్చిన ఓ విజ్ఞాని భూమిమీద దున్నుకు బతికే ఓ రయితుమీద తెచ్చిన క్రిమినల్ సైడు యభియోగం. లాతి మనిషీ పుట్టివాడే! రయితూ పుట్టివాడే. అందులోనూ కోర్టు కెక్కింతరవాత చివరకంటా చూడని వెఱ్ఱిముండా వాళ్లెక్కడో కాని ఉండరు. లాతిమనిషికి చంద్రమాండలీకుల పెట్టుబడి. రయితుకి తనయొక్క జాతీయవాదుల పార్టీఫండు పెట్టుబడి. లాతిమనిషికి న్యూస్ పేపరు కరస్పాండెంట్సుయొక్క పెద్దక్ష రాల ఎడ్వర్టైజుమెంటు. రైతుకు వీధిలో మాసెస్సుయొక్క జయ జయ ధ్వానాలు!

అసలు కేసేమిటంటే:-అది మఱచి పోకూడదు మనం—

వెంకయ్య యనే ఓరయితు ఈ పుణ్యావంతమైన ఆర్యా వర్తమందు పుట్టిన మహావ్యక్తి. అతడో చోట ఓ సారవంత మైన సుక్షేత్ర ఖండికలో ఆనప్పాదు బీరపాదు చిక్కుడుపాదు ఇత్యాదుల పాదుల్ని పెట్టి, వాటికి పందిళ్ళేసి, పైకి లేవదీసి, దృష్టి తగలకుండా ఓమగాడి బొమ్మ దృష్టి బొమ్మ, పదిమందికీ కనబడేలాగు నిలబెట్టాడు. గడ్డి వెంటి చుట్టబెట్టినాడు. అయితే

యతడు చేసిందేమిటి ?—అందరూ సర్వసాధారణంగా తలపాగా పెట్టి యలాంటి బొమ్మల్ని యలంకరిస్తూవుంటే మన వెంకయ్య ఏం చేశాడూ ? ఓ గుబ్బటోపీ ఎక్కడిదో ఏపెంటమీద పారేసిందో తీసికొచ్చి దాన్ని ఆ బొమ్మ బుర్రకు తగిలించాడు. పదిమందీ చూచీ వారు యతి విడ్డూరంగా. తెలిసినవాళ్లు కొందఱను కునీ వారుకూడాను ' ఈ మాటు వెంకయ్య తన దృష్టి బొమ్మను చంద్రలోకంలోంచి దింపే ' డని. 'వాడిపని యవుతుంది' యని. అనుకుంటేం ? దృష్టి బొమ్మ దృష్టి బొమ్మే, యది వొకరికి కోపకారణం కానన్నాళ్ళూను.

ఓ రోజున 'కిలోలీ' యనే చంద్రమండలపు వ్యక్తి ఆలా ఆ దారమ్మట వెళ్ళడం తటస్థించింది. వెళ్ళడమే కాకుండా ఆ బొమ్మను నఖశిఖ పర్యంతం పరీక్షించడం తటస్థించింది. వెంటనే కేకేయించాడు, వెంకయ్య వచ్చాడు. ఆ జెంటిల్‌మాన్‌కు సలాము పెట్టాడు. చంద్రమండలపు టోపీ ఆలాంటి బొమ్మల కుంచకూడదన్నాడు కిలోలీ. వెంకయ్య ! ఏం ? అని అడిగాడు, మొదట్లో మిక్కిలి శాంతంగానే సత్యం తెలుసుకుందామనే సదుద్దేశ్యంతో.

కిలోలీ ఏం ? ఏమిటి ? అవి మేం పెట్టుకునేటోపీలు అవి అలాంటి వికృతపు బొమ్మలకు తగిలిస్తే మమ్మల్ని యవమానపరిచినట్టు యన్నాడు. వెంకయ్య ఆ లాతిమనిషికి నచ్చచెప్పాలని చూశాడు యిలాచెప్పి. ' అలా కాదండీ ! సార్ ! సార్ ! ఎవరితో మాట్లాడినా ఇంగ్లీషే దొర్లిపోతుంది, ఆంధ్రదేశంలో రయితునుండి రాజులదాకా. అది చూశారూ ! అలా కాదండీ ! ఇది నేను చంద్రమండలంలో వారినిగాని మరొకళ్ళను

గాని వికృతంగా చూపించే భావంతో నిలపలేదండి. నాపాదులు బాగా కాయాలనే స్వలాభపేక్షతో చేసికొన్నపనండి. అలా చిర కాలంనుంచీ యనుశ్రుతంగా వస్తూవున్న ప్రదర్శనమేనండి ఇది యన్నాడు వెంకయ్య. 'ఛెట్ ! తీసేస్తావా తీసెయ్యవా ?' అని యడిగాడు కిలోలీ. రెండో కాలంలో యడగ్గా నేను తీసి వెయ్యను. చెప్పుకో నీ దిక్కున్న చోట. ఇప్పుడు మావాళ్ళూ మా భూలోకవాసులూ, వాళ్లెంత చీకటి వాసులైనా పెట్టుకుంటూనే వున్నారు ఆలాంటి గుబ్బటోపీలు. మావాళ్లు పూర్వం తలపాగాలు పెట్టుకునే వాళ్లు. కాబట్టి యప్పట్లో మాదృష్టి బొమ్మలకు తల పాగాలు చుట్టేవాళ్లం. ఇప్పుడు వాళ్ళు ఇవి పెట్టుకుంటూవున్నారు. కాబట్టి ఈ టోపీలు పెడుతున్నాం. నిన్నూ నీవాళ్ళనూ ఆక్షేపించి నట్టుండడమేమిటి? పో ! నీదిక్కున్న చోట చెప్పుకో యన్నాడు వెంకయ్య తీవ్రంగా. కిలోలీ మూడవకాలంలో చిందులు తొక్కుతూ—ఒక్కతుపాకి పేల్చడం తరువాయిగా యంగారక పాదరక్షల్తో నేలదిమ్మిస చేసుకుంటూ 'ధామ్ ధూమ్' అని ఆ దృష్టి బొమ్మమీది ఆ గుబ్బటోపీ ఊడపెఱికి మట్టిలో ఊర త్రొక్కి తనదారే వెళ్ళిపోయినాడు. వెంకయ్య ఎఱ్ఱగా చింత నిప్పులా చూచాడు కిలోలీ వెనకాలే. వీడి పని ఇలావుందా వాడి పొగరణచాలి యనుకున్నాడు. అని యనుకొని మట్టి యయి పోయిన ఆ టోపీ పైకెత్తి దులిపి దృష్టి బొమ్మయొక్క వొంటి చిలక్కొయ్యకు తగిలించినాడు. తాను ఆ ప్రక్కనే పెద్ద ముల కాల కర్రతో నిలబడ్డాడు.

కిలోలీ ఆ దారినే తిరిగి రావడం తటస్థించింది. రెండో వేషం చూచాడు. మఱింత ఉగ్రుడై పోయాడు. కాని

ఆ పర్యాయం ఏమి అనలేదు. తన కోపం తనలోనే అణచు కున్నాడా అన్నట్టు అణచుకొని చల్లగా జారాడు. చంద్రలోకానికి తన పిక్కబలం చూపించేడు.

చంద్రలోకానికి వెళ్ళిపోయినాడన్న మాటేగాని కిలోలీకి ఆ రేత్రి ఏమి నిద్దరపట్టలేదు. తెల్లాటి పొద్దున్నే లేచి ఏడు గంటలకే తిన్నగా భూమ్మీదికి దిగి—నేరం భూమ్మీద జరిగింది. కాబట్టి భూమ్మీదేగా జ్యూరిస్ డిక్షను—నేరుగా ఓ బారిష్టరుగారి ఛాంబర్సుకు వెళ్ళాడు. జరిగిన సంగతి ఆయన్తో సవిస్తారంగా చెప్పాడు.

బారిష్టరుగారు సూర్యలోకపు మనిషి. ఆయనకు తెలుగు బాగా రాదు. కాని లా బాగా తెలుసు. ఆయనకు హిందువుల యొక్క ఆచారవ్యవహారాలు బాగా తెలియకపోయినా లోక సామాన్యంగా అనుకునే సభ్యాసభ్యతల గుర్తింపు కద్దు. అందు చేత కిలోలీ తన పితూరీ అంతా పూర్తిగా విప్పి చెప్పడంతోనే బారిష్టరుగారు అడిగేరు. ‘ ఆ బొమ్మ నోస్కెచ్చివేసి చూపించ ’ మని. కిలోలీవేసి, చూపించేడు హార్డు పెన్సిలుతో ఫ్రీహాండు డ్రాయింగు గీసినట్టుగా.

బారిష్టరుగారు బహూసునిశితంగా ముక్కద్దాల సమేతమైన చూపు చూచి, భాయిజీ ! మీరువేసిన బొమ్మయొక్క చిలక కొయ్య ప్రదేశం, మగవాని అస్థిపంజరంలో వుండే అశ్లీల ప్రదేశంగా కనిపిస్తుంది. దాన్ని వ్యక్తీకరించినాడూ అంటే అతడు శిక్షాస్మృత్యను సారంగా దండనార్హుడు. ఆ ప్రకారంగా చార్జీ వ్రాయమంటే వ్రాస్తాను ’ అన్నాడు. మఱిన్నీ బారిష్టరు గారు ఏమన్నారూ అంటే ‘గుబ్బటోపీలు ఒక్క చంద్రమండలం

వారి హక్కే కాదు. భూప్రదేశమాత్రుల హక్కు కూడాను. ఎంచేతా అంటే చంద్రమండలంలో నల్లరేగడి ఎక్కడిది? భూమిదే? మఱీన్నీ అవి మనుష్యుల హక్కే కాక, దృష్టి బొమ్మల హక్కు కూడాను. ఎంచేత అంటే ప్రతీగుబ్బాకారానికి వసారా దిగుతుంది. వసారా దిగింది అంటే ఆ పదార్థానికి అల్ ఎంబ్రేసింగు—సర్వంకౌగిలీ — స్వభావము కలదు అన్నమాట. మహదమహత్తిర్యక్ జడా జడ స్వరూపాలన్నింటికీ భోక్తవ్య మన్నమాట అన్నాడు.

కిలోలీ మంచి క్లయింజేమో బారిష్టరుగారితో వాగ్వాదం పెట్టుకోక 'చార్జీ ఎలా నిలుస్తుందో ఆ అంశములు గుదిగుచ్చి కంప్లైంటు వ్రాయమన్నాడు. కంప్లయింటు వ్రాసి బారిష్టరుగారు ఆనాడే 11 గంటలకు క్రిమినల్ కోర్టులో దాఖలు చేయించినారు.

ఇక ఆ దెబ్బతో వెంకయ్యపని అయిపోయిందంటే అయి పోయిందన్నారు పదిమందీని. పత్రికాధిపతులు ప్రధాన వ్యాసాల్లోకూడా అలాంటి దృష్టి బొమ్మల ప్రదర్శనం, కుంకుటి వేళ్ళల్లోకంటా తెంచాయ్యలని వ్రాశారు. కరెస్పాండెంట్లు ఇచ్చిన సంజాయిషీ పుచ్చుకుని, ఎక్కడ చెప్పుకున్నా వెంకయ్య కిలోలీగార్లగొడవే, ఆబాలగోపాలమున్నూ—

కేసు మరి ఇరవై రోజులికి విచారణకు వచ్చింది. విచారణకు వచ్చిన సందర్భంలో మఱి వాయిదా వేయకుండా, పైనుంచి దిగొచ్చిన వారి కేసని కామోసు మేజస్ట్రేటుగారు తీసి, అంతా చదివి సాక్ష్యం పుచ్చుకున్నారు. వెంకయ్య వకీల్ని పెట్టుకో నన్నాడు. తాను సొంతంగానే చంద్రలోక వాస్తవ్యుణ్ణి అడ్డసవాళ్ళేయదొడగేడు.

"ఏమండీ! సార్! సార్! మీరు మా హిందువుల దేవాలయాల్ని ఎప్పుడైనా చూచినారా?"

"చూడకేం. లోపలకు వెళ్ళలేదు. కాని పైనుంచి చూచాను."

"ఎక్కడి దేవాలయం చూచారు?"

"ఊరి బయటిది"

"కొట్టాలమ్మదా?"

"దాని మీది బొమ్మల్ని పరీక్షించారా?"

"చూచాను"

"అవి అశ్లీలాలు కావుటండీ"

"అశ్లీలాలే. అవుతేం. అవి మతవిషయకం. మేం కలగ జేసికోకూడదు మీ మతంతో."

"పోనీ చూడండీ! సుఖరోగాల్ని గురించిన పుస్తకా లెప్పుడన్నా చూచారా?"

"చూడకేం"

"అందులో బొమ్మలు చూచారా?"

"చూచినాను."

"అవి అశ్లీలాలు గావా?"

"అశ్లీలాలే. కాని అవి శాస్త్రగ్రంథాలు"

"పోనీ! సార్! సార్! చిన్న పిల్లలు దిగంబరులై తిరుగుతూ వుండడం ఎప్పుడైనా చూచినారా?"

"చూడకేం. చాలాసార్లు చూచినాను"

"ఆవాళ్ళ ప్రదర్శనం అశ్లీల ప్రదర్శనం కాదా?"

"శిశువులు దివ్యులు. శిశువులు గంధర్వులు!"

" మిస్టర్ ! పత్రికల్లో స్వేచ్ఛగా అచ్చు పడుతూవున్న నగ్నచిత్రాల్లోని యౌవనార్భాటాన్ని గుర్తించారా ?"

" గుర్తించకేం. అలా అందరంవుంటే ఆరోగ్యం అని నమ్మిన వాళ్ళల్లో నేనొకణ్ణి. "

" అయితే నాదృష్టి బొమ్మయొక్క అశ్లీల ప్రదర్శనం పై వేటిల్లోకీ రాలేదా ? మీరు బాగా వూహించి చెప్పండి గుండె మీద చెయివేసికొని. "

సాక్షి కిలోలికి జవాబు పెగల్లే.

మేజస్ట్రేటుగారు ' చెప్పాలి ! వేగం చెప్పాలి ' అన్నారు.

అంత చంద్రలోకపు మనిషీన్నీ ఏమీ మాట్లాడలేక పోయినాడు ఆ అడ్డు సవాలుకు.—

ఫిర్యాదీ కప్పుడు బారిష్టరుగాడు సాయపడి కోర్టువారితో ఇలా మనవిచేసినారు. ' మా తగువల్లా గుబ్బ టోపీ ఆ అశ్లీల ప్రదేశంలోని చిలకొక్కాయ్యకు తగల్చడమే ' అన్నాడు.

వెంకయ్య వెంటనే కోర్టువారి దిక్కు మొగంబై అన్నాడు. ' మహాప్రభో ! కుర్చీలమీదను, కుర్చీలక్రిందను, వరండాలోనూ, బల్లలమీదనూ, చూరులోనూ, పారేశికన్న చిలకకొయ్యకు తగిలిస్తే మంచిదని తగిలించాను ' అన్నాడు.

చూడవచ్చిన వాళ్ళంతా గొల్లున నవ్వారు.—

మేజస్ట్రేటుగారు మాత్రం ఫిర్యాది సాక్ష్యం ఎలావున్న ముద్దాయిని చార్జీ చేశానన్నారు. తిరిగి ఫర్దర్ క్రాసుచేసుకొంటావా అని ముద్దాయిని అడిగి చేసుకొంటానంటే మరో రోజుకు వాయిదా వేసినారు వాయిదా నాటికి మళ్ళీ అంతా హాజరయినారు.

తిరిగి క్రాసు చేయడంలో మూడు ముక్కలే అడిగాడు వెంకయ్య. ఒకటి—'మీరు చూచినప్పుడు టోపీ జూచినారా. అశ్లీల ప్రదేశం జూచినారా' అని. జవాబు 'టోపీయే' రెండు టోపీ నెత్తిమీదనుంచి తీసి వాళ్లో పెట్టుకోవడం రివాజు వుందా లేదా ?' జవాబు 'ఉంది' మూడు. 'ఒడి అన్నది అశ్లీల ప్రదేశమా ? శ్లీలప్రదేశమా ? జవాబు 'ఒడి ! ఒడి !' అని పిర్యాది తన ఒడి ఎగాదిగా జూచుకుంటూ 'శ్లీలప్రదేశమే ! శ్లీలప్రదేశమే' అన్నాడు.

'ఇక అశ్లీలానికి తావెక్కడ ?' అని మేజిస్ట్రేటుగారు మరి ఉత్తర సాక్ష్యంతో నిమిత్తం లేకుండా చంద్రమండల వాస్తవ్యుని ఆవ్యాజం కొట్టిపేసినారు.

ఆనాటినుంచీ వెంకయ్య గొప్ప జాతీయ నాయకుడై పోయాడు ! కావ్యాల్లో దక్షిణ నాయకుడిలాగు మోగేశాడు.

.... .... .... .... ....

# మతి లేదు

తల్లో పసుపు పచ్చని పెద్ద చేమంతి తురుముకొని, ఒక దొంకెన కర్రతో వఱదలో ఎండు పుల్ల, ఆ చితుకు ఆ చితుకు, ఆ యెమ్మెలాడి పట్టుకొంటూ వొడ్డుకు విసరుతూ వుంది. ఆమె పెట్టుకున్న చేమంతి పూలు గట్టునున్న కోడెకాండ్రు చూస్తూ వున్నారు.

కొంతసేపటికి పాపారావు అనే యువకుడు కనిపించాడు. వాడడిగాడు ఈ పడుచుని : "నీవు ఇక్కడకు ఎలా వచ్చావు?" అని. "గట్టంతా నాదే కదంట్రా యింక ! ఇల్లా గడ్డిమేటా ?

అన్నీ వరదమయమై పోయినాయి. ఇలారంపై కెక్కి, కూర్చుంది గంగమ్మ తల్లి. ఇక నేను గట్టే నడాడుతూ వుండవలసినదే. అయితే ఏదో పని చెయ్యవద్దూ ? అందుకోసం ఈ దొంకేన కఱ్ఱ చేతబుచ్చుకున్నాను." అంది. యువకుడు "ఆ పువ్వులు ?" అన్నాడు. "అవి చూచేవాళ్ళ కవి ! నీక్కనబడుతున్నాయిరా?" అంది ఆమె. "ఆ ! అవీ కనబడుతున్నాయి నీవూ కనబడుతూ వున్నావు" అన్నాడు వాడు. "రెండూ ఎలా కనబడతాయి ? నేనెదరకుంటాను. అవి వెనక కుంటాయి" అంది.

ఇలా సరాగంమీద సరాగం ఆడుకొనే సందులో వరదను బడిపోతూ ఏదో పుడకొకటి పొడుగాటి వలమైంది ఆ అమ్మి యొక్క దొంకెన కఱ్ఱకు తగిలి, అలా దక్షిణంగా వాలునే తప్పించుకు పోతూవుంది. పోతూవున్న కఱ్ఱకు అడ్డంగా దుమికి తానే వెళ్ళి పట్టుకొని, కఱ్ఱసమేతంగా ఆ చిన్నవాడు వస్తూ వున్నాడు. చిన్నది చూస్తూ తన దొంకెనతో అలా అన్నది.

ఎలా అన్నదో చెప్పేకన్న చూస్తే మెఱుగు అలా అన్నది ! తన ఒళ్లు అంతా జిగాల్‌మన్నట్టు, తన సిగముడి విదుపుకొన్నట్టు ఆలా అన్నది తన దొంకెనతో !

దొంకెనకు తన పువ్వులే తగిలాయి, అవి జారిపడి పోబోలు ప్రవాహంలో ఆ సమయాన !

మగువ ఊరికే లాక్కోడం ప్రారంభించింది, ఆ పూలు తన చేరికకు వస్తాయని. అవి దూర దూరంగా ఇంకా పోయి నాయి గాని ఆమె దగ్గరకు రాలే !

"పూలు కావాలా ? కఱ్ఱ కావాలా !" అని అడిగాడు ఆ యువకుడు.

ఒకమాటు పూలు చూస్తూను, ఒక మాటు కర్ర చూస్తూను ఆ యువతి ఏమని జవాబు చెప్పుచున్నది ? "అడివిని చెరిపిన చెట్టు, అడివిని పూచిన పువ్వు, అర్ణవమునకు పోయి అవి అంద వుగా నీకు ! వచ్చేసెయ్యి ! ఇంకో పువ్వు, ఇంకో చెట్టొపించేన్! వచ్చేయి ! వచ్చేయి !" ఆలా ఆమె అంటూనే వుంది. వాడు అక్కడ సుడిగుండంలో పడి మరణించాడు. ఆ పిల్ల తల్లో మఱి పువ్వు లేదు. ఆ పిల్ల మఱి దొంకెన పట్టలేదు.

.... .... .... .... ....

## సన్యాసి - పేదగేస్తుడు

ఆ దారిని షికారు పొయ్యేవాళ్ళు చూచే యుంటారు వాళ్ళనూ ఆ పాకనూ.

ఆ పాక వాళ్ళ హక్కు భుక్తంలోకి ఎలా వచ్చిందో ఆ సంగతి చారిత్రక పరిశోధకులకు విడిచిపెట్టవలసినదే. లేదా ! రైల్వేవారుగాని, డి. పి. డబ్ల్యు వారు గాని, మునిసిపాలిటీవారు గాని, దావాచేస్తే ఆ దావాలో వెల్లడికావలసిందే. అంతవఱకు అదివొక చిదంబర రహస్యంగా పరిగణింపవలసివుంటుంది. ఇంత మంది నెందుకు పేర్కోవలసివచ్చింది ? అడుగుతారేమో— ఆ పాకకు తూర్పు పక్కనుంచే రైలుపట్టాలమలుపు, పడమటి పక్కనుంచే ఏటిగట్టు కలుపు, మఱి మునిసిపాల్టీ సరిహద్దుల్లో దాని నిలుపు. వీళ్లల్లో ఎవరు తమ దిగాదాన్ని ఉత్తరోత్తరా దావాచేసి రాబట్టుకుంటారో ఊహాతీతం, బహుశా ఎవళ్లూ ఆ పాకజోలికి పోరనుకుంటాను. ఏమా-ఎవరికీ అది అడ్డున్న ట్టుగా తోచదు. కానైతే కోసుగా ఎత్తుగా లేచిన ఇలారపాక.

"ఈ పాక యిక్కడెవరు వేశార్రా ?" అని అందులో వున్న వాళ్ళను అడిగితే వాళ్లు తమకు తెలియదనే రకంగాళ్లు. నిజంగా తెలియకపోవచ్చును కూడాను. ఎంచేత అంటే ఆ పాక వాళ్ళు వేసికున్నది కాదంట. ఎవళ్లో వేసికున్నదంట. ఇక మరి వాళ్ళను అడిగి ప్రయోజనమేమిటి ? దాన్ని ఎవళ్లో మాత్రం వేసివుండాలి. కాకపోతే వెదురూ తాటాకూ పైనుంచి వర్షంగా కురవ్వుకదా !

అమావాస్య రాత్రి ఆ పాక ఆనవాలుగా తెలియదు. ఏ పెనుభూతంలాగో, పెద్ద కాటుకముద్దలాగో వుంటుంది. అందులో దీపంవుండదు. పాకలో వున్నవాళ్ళు మనుష్యులని కూడా మనం అనుకోము. వాళ్లకు ఒంటినిండా గుడ్డకు కరువు. కంటినిండా కూనుక్కుకు కరువు. కడుపునిండా తిండికి కరువు. మిక్కిలి బీదవాళ్లు. సంఘమనేది ఇకంతకంటె అధమాధమ పరిస్థితిలో వుంది అని నేను యనుకోను. కాని వాళ్ళదొక సంసారం, మొగుడూ పెళ్ళాం కొంతమంది పిల్లలూ—అంతా పేదరికమే మూర్తీభవించి కనబడుతుంది. ఆ సంసారాన్ని చూచినప్పుడు నా కొకటి తోస్తుంది. కొందఱు నెలకు వెయ్యో రెండువేలూ ఇలాగ్గా తెచ్చుకొంటూ వుంటారు. కొందరి కొందరికి సాలుకిరవై వేలు ఆదాయంవస్తుంది. ఆలాగ్గాకాకుండగా ఈ కుటుంబానికి నెలకు వంద, కాకపోతే పాతిక, ఆఖరుకు పదిఅన్నా వచ్చే కుటుంబం కాకపోవునేమో అని తలపోసి అప్పుడది మరలొచ్చు బ్రతికినెడ్డ కుటుంబం అయి అప్పుపడ్డ కుటుంబం అయిపోతుందే? అప్పుపడ్డ సోమార్లయిపోతారా, స్వతంత్రంగా గడించుకొని ఎంతోకొంత దానిగంజి త్రాగినా పరమాన్నమేమో ? ఇలాగ్గా

మళ్ళీ జిజ్ఞాసలోకి వస్తుందిగా మనస్సు. ఏదన్నా లోకంలోని ఆర్థికసమస్య పరిష్కరించడమనేది బహుప్రయాస. అదివొక ప్రాటిమీద నడచేది కాదు.

కాబట్టి ఎవడైనా ఒకడు తెలివైనవాడు ఆ కుటుంబం యొక్క సహజ ప్రతిభను గుర్తించి వాళ్ళ కనువైన జీవనోపాధి కల్పించి ఆ కుటుంబంయొక్క స్వయం వ్యక్తిత్వాన్ని ఆత్మ గౌరవాన్ని నిలబెట్టినవాడైతే వాడు బహూ పుణ్యాత్ముడు. అటువంటి పుణ్యాత్ముడెవడైనా వున్నాడా ?

లేకపోవడమేం ? దగ్గరగానే ఒకసన్యాసి వున్నాడు. వాని పని అస్తమానం ఆ బీద కుటుంబాన్ని గురించి ఆలోచించడమే.

సన్యాసులకు యోగశక్తి మిక్కుటం అంటారు. మరిన్ని మంత్ర సత్తాకూడా కద్దంటారు. మన సన్యాసి ఓరోజు రాత్రి యిక ఆ బీద కుటుంబాన్ని యమాంతంగా భాగ్యవంతం గావిద్దామని వూహించి, యట్టే ఆ బీదవాళ్ళకు తెలియకుండా ఒక పుల్లతో ఆ గుడిసెనంతనూ మంత్రించి వైచినాడు. ఆ మంత్ర ప్రభావం ఎటువంటిదీ యంటే—గుడిసె ఆలాగ్గానే యుండిపోయింది. కాని గుడిసెలో వాళ్లు తెక్కలొచ్చి ఎగిరిపోయినట్టు ఎగిరిపోయి, ఓపెద్ద మహాభవనంలో, పట్నానికి గుడిసె దక్షిణ దిక్కునుంటే పట్నాని కుత్తరపు దిక్కున వాలిపోయేరు. అంతా వాలేరు. మొగుడూ పెళ్ళాం, పిల్లలూ యావన్మందీని.

అటువంటి యోగశక్తి యీ కాలంలో యుంటుందా యని యనుకోకండి. ఉంటుంది ? అదో డెర్బీస్వీప్‌వంటి యోగశక్తి యని యనుకుంటే ప్రత్యక్ష ప్రమాణంగా కనిపిస్తుందికూడాను.

బీదగేస్తుడు తానో పట్టరాని కుబేరుడై పోయినాడు. వాని యిల్లాలో మహాలక్ష్మిలాగు వెలిసి పోయింది. పిల్లల మాట

మఱి చెప్పక్కర్లేదు. ఒకడు బంగారు గొలుసుల ఉయ్యాల్లో ఊగుతూవుంటే ఒకడు ముత్యాల జాలరు వోసిన పందిరిపట్టి మంచంమీద దొర్లుతూ యున్నాడు. అటువంటి వైభోగ మహా యోగం యోగించిన వానిచుట్టూ పరివార జనాని కేంలోటు? మాంచి ఇదిగా దాస దాసీజనం యమేషా రాత్రింబవళ్ళు వాళ్ళకు సేవ చేస్తూవుండేవారు. వాళ్ళూ వీళ్ళూ యండఋతూకూడా యస్త మానం షర్బత్తులు తాగుతూ బల్ కుషీగా ఉండేవారు.

సన్యాసి కేతత్సంపన్నుని ఒకమారు చూడాలని బుద్ధిపుట్టి సంపన్నుని గుమ్మం మెట్టు ఎక్కినాడు. సంపన్నుడును సన్యాసికి మొక్కి "ఏం కావా" లన్నాడు. "నీ సిరీ సంపత్తూ చూచి పోవచ్చాను" అన్నాడు సన్యాసి. "రాండి" అని ఆ సన్యాసికి తనయొక్క అష్టయిశ్వర్యములూ చూపించినవాడై తన మహా భవనంయొక్క ఏడో యంతస్థుమీది యుపరిభాగానికి తీసుకు వెళ్ళి, దిగంతాలు చూడమన్నాడు. కోటి సూర్యప్రభల్లా ఎటు చూచినా విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి!

సన్యాసి యడిగేడు "ఓయీ! నీకు మనస్సులో ఏ విధ మైన ఆలోచనా లేకుండా నిశ్చింతగా ఉన్నావుకదా!" అని. "నాకు చింతలులేవు గాని స్వామీ! ఇన్ని విద్యుత్కాంతులకూ ఆవల ఆ దూరంగా రోజూ వొకటి రెండు మంటలు కనిపిస్తూ ఉంటాయి. ఏదో బాజాల చప్పుడు విచారకరంగా వినబడుతూ ఉంటుంది. ఆ వెఱ్ఱి వెలుగు భూమ్మీద లేకుండా చేద్దురూ! ఆ బాజాలమీదనుంచి గాలి యీతట్టుకు రాకుండా చూద్దురూ మీకు చేతనైతే" అన్నాడు మహాభోగి.

"ఓయి పిచ్చివాడా!" అన్నాడు సన్యాసి—"మరచి పోయినట్టున్నావు" అన్నాడు. "నీవో చిన్న ఇలారపాకలో

ఊరిచివర ఉండే రోజులు జ్ఞప్తికి తెచ్చుకో " అన్నాడు సన్యాసి. మహాభోగికి హృదయం విదారితం గాజొచ్చింది. సన్యాసి ఇంకా చెబుతున్నాడు. " ఇలాఠప్పాకకు యనుకుంటూ యనతి దూరంలో శ్మశానం ఉండేది. ఆ శ్మశానంలో కాష్టం తగలడుతూ ఉంటే ఆ మంటనుండి తాటాకు యంటించుకుని నీ పాకలో పచనం కోసంగాను ఓరాత్రి యగ్నిహోత్రాన్ని ఉపయోగించుకున్నావు నీవు. జ్ఞాపకం వచ్చిందా ?" అని అడిగేడు సన్యాసి. " మరిన్ని శ్మశానంలో మోగే బాజాలకు నీ పిల్లల్ని తప్పెట్లు చఱవమంటూ నీవూ వాళ్ళూ కలిసి ఆనందించిన రోజులెన్ని వున్నాయో జ్ఞాపకం చేసుకో " అన్నాడు సన్యాసి.

సంపన్నునకు మతిపోయి నట్టయింది — " నిజమే స్వామీ " అన్నాడు, ఆ రాత్రి అగ్గి వుడక్కికూడా దిక్కులేక పోయినవాణ్ణయి మరెక్కడినుంచీ పొయ్యి రాజడానికి నిప్పు కనబడక ఆ నికృష్టపు కార్యాని కొడిగట్టాను. మరి యప్పట్లో నా పిల్లలకు ఆటవస్తువులా ! తోవుడుబళ్ళా ? బ్యాండు వాయిద్యాలా ! ఏమున్నయి చెప్పండి స్వామీ ! మీకేలా తెలిసింది యీ యుదంత మంతాను ?" అని ఆ సన్యాసి కాళ్ళమీద పడి వెక్కి వెక్కి ఏడ్చినాడు ఆ సంపన్నుడు.

" ఎందుకేడుస్తావు ? ఆ పాకకు యవతల ఉండేవాణ్ణి నేను. నేను నీ బీదతనం చూచి జాలిపడి నా మాయా ప్రభావం చేత నీకీ మహావైభవం కల్పించాను " అన్నాడు సన్యాసి.

" అయితే వెర్రి వెలుగు చూపించడ మెందుకు ? ఆ బాజాలు వినబడజేయడ మెందుకు ఇంకాను " అన్నాడు గేస్తుడు.

"అదీ పోంగొట్టు కోవాలి అని నిజంగా వుందా నీకు ?" అన్నాడు సన్యాసి.

"ఉంది" అన్నాడు గేస్తుడు. "ఇదిగో చూడు" అని సన్యాసి ఆ గేస్తుని కళ్ళు తన కమండలంలోని నీళ్ళతో తుడిచేడు గేస్తుడు అప్పుడు మరో వెలుగు చూస్తూ మరో రొద విన్నాడు.

ఏమిటది యని లోకం అడగొచ్చు. ఆ వెలుగు లోకాన్ని దహించే ఆకలిచిచ్చుది. ఆ రొద నిజమైన పేదవాళ్ళయొక్క "మదూకరమమ్మా !" అనే అర్పు.

తొల్లింటికంటె ఎక్కువగా చలించి పోయినాడు సంప న్నుడు. "ఈ మాయభోగం నాకు వద్దు. వాళ్ళకిచ్చివేయ" మన్నాడు. ఆ మాట అతని నోటివెంబడి వచ్చినట్టుగా సన్యాసి తిరోహితుడైనాడు. ఏతద్గృహస్థు యొక్క భాగ్యభోగాలను మాయ నశించింది.

.... .... .... .... ....

## సా ను భూ తి

"రిక్షా" అనగా రెండుచక్రాలబండి ; చక్రాలనగా వాటంతట అవి దొర్లవు, లాగాలి, లాగాలి అనగా ఎడ్లూ, గుర్రాలూ లాగవు, మనుష్యులే లాగుతారు. పూర్వం అది చెన్నపట్ణంలోనే తఱచు కనిపించేది; ఇప్పుడు రాజమహేంద్రవరం, కాకినాడ, ఇత్యాది నగరాల్లో కూడా పరిపాటిగా మనదృష్టిని పడుతూవుంది. చాలామంది యీపాటికి దాన్ని చూచేవుంటారు.

లాగేవాడు కటిక నేలను కాళ్ళ పరుగెత్తుతూవున్నా, కూర్చునేవాడు కాళ్లు సాచుకు. మెత్తమీద సుఖంగానే

కూర్చుంటాడు. సుఖపడే మానవునకూ కష్టపడే మానవునకూ గల, తారతమ్యం మనకు బాగా బోధపడాలీ అంటే, రిక్షా దృశ్యంకంటె మరోదృశ్యం మన మనస్సు కెక్కించేది దొఱక దనే నా అభిప్రాయం.

రిక్షా లాగేవాడు ఎప్పుడూ నాకంటికి వొకే అర్థిక దుర్గతి లోనూ, వొకే ఆకారదుస్థితిలోనూ అగపిస్తూ వుంటాడు. గొఱ్ఱె తోకలా ఎదుగూ బొదుగూ లేకుండా, గొఱ్ఱెమువ్వలా వొంటిది వాయించుకుంటూ నల్లచొక్కా, వాడూ - కాని అందులో కూర్చునే వాళ్లు రకరకాల రంగులతో రకరకాల హంగులతో ఏర్పాటుగా ప్రత్యక్షమయ్యేరు. ఓ నాడోస్వాములవారు, తనకేమీ అక్కర లేదన్న ఆయనకూడా, భూతదయాసర్వము ముప్పొద్దూ ప్రబోధ చేసే ఆయనకూడా, రిక్షాలో పూడ్చుడం చూచాను. మఱోనాడు ఓ పృథుశ్రోణి తన శ్రోణికంటె గొప్పగా కనిపించే వేణిలో ఇంతరొట్టా, అన్నిపువ్వులూ పెట్టుకొని ఓ 'బొకే'లా తయారయి రిక్షాలో కెక్కడం సందర్శించాను, ఇంకోనాడు 'ఇతగాడికి కేవలం బూరెలూ గారెలే ఆహారమా' అని అనుకునేటంత బొజ్జగలవాడు రిక్షాలో జేర్లబాటుగా కూర్చోవడం తిలకించాను. మఱోఅప్పుడు "ఒకనికి మాత్రమే చోటు" అని వ్రాయబడ్డ రిక్షాలో, ఓ కుటుంబం పిల్లాజెల్లా సమేతంగా వొకళ్ళమీ దొకళ్లు పడుతూ ఉండడం వీక్షించాను.

అలా పరికిస్తూ, తలపోసుకుంటూ రాగారాగా, నాహృదయ కోశంలో యీ సమస్య అనగా ఈ రిక్షా సమస్య అన్నది ఎంత పరిక్లిష్ట సమస్యగా పెరిగి పోవాలో అంత పరిక్లిష్టసమస్యగా పెరిగిపోయింది. తుదకు రిక్షాను, రిక్షావాలాను, రిక్షాలో ప్రయాణం చేసేవాళ్ళను చూడ్డమే మానేసేశాను.

నేను చూడ్డం మానేసేస్తే మాత్రం వారికీ వాటికీ ఏమైనా లోటా? రస్తా ఎప్పట్లాగే గింగురుమ్రోత సాగించుకుంటూ పొడుగైంది యింకా.—

ఊరి చివర "విరామమహల్" అనే ఒకభవనం ఎత్తైన కొండమీద కట్టబడింది వొక్కటి ఉంది. క్షయరోగంచే బాధపడే వాళ్లు ఆ కొండమీది గాలి పీల్చి సుఖపడతారు. అలా సుఖపడే వాళ్ళను చూడ్డానికి అప్పటప్పటి డాక్టర్లు, నర్సులు మాత్రమే కాకుండా, రోగులయొక్క బాంధవులూ మిత్రులూ కూడా అసంఖ్యాకంగా వెళ్లుతూ రావడం కద్దు. అయితే ఆ మహల్‌కు దారి చాలా ఎత్తువాటుగా ఉంది. మఱిన్నీ దారి కొత్తగా వేయ బడుతూవుంది.

సీలయ్య అనే రిక్షావాలా ఎక్కేస్తూ ఉన్నాడు, తన బలాన్ని అంతనూ ఉపయోగించి, తన బండీని ఆ దారమ్మట.— "విరామమహల్"కు, అయిదుగంటలు దాటితే రోగుల్ని చూడ్డానికి వచ్చే బంధుజనాన్ని రానివ్వరు. ఎవరు చూచినా సాయంకాలం నాలుగైదు ఘంటలనడాన్నే. రిక్షాలో కూర్చున్న వ్యక్తి తన మణికట్టు గడియారంకేసి చూస్తూ "ఒరే నీలిగా! నాలుగున్నర అయిపోయిందిరా!" అని అంటూవున్నాడు. నీలి గాడు "బాబూ! దారి కొత్తగా వేస్తూయున్నారు. అంతా కంకర పఱిచారు. ఇంకా సాపుచేసి ఉండలేదు. మఱిన్నీ ఎగువుకు ఎక్కించడం కదండీ బండి!" అని అంటూ ఎదో రాయి చక్రా నికి అడ్డపడితే బండీ ఆపి కాలితో అలా త్రోసివేసి కొన్నవాడై బండికి వొక్క తీవ్రమైన లాగుడిచ్చాడు. బండీ కదల్దు— కూర్చున్న వ్యక్తి దిగడు. బండీ కదల్దు — కూర్చున్నవ్యక్తి

దిగడు. ఓ పగిలిన బొమ్మరాయి నీలయ్య మడంలో గ్రుచ్చుకొని ఎఱ్ఱటి నెత్తురంటుకుని కాలివిదుపున ఊడిపడింది. కడనే కంకర తట్ట మోస్తూయున్న కూలీపెద్దమ్మి ముసిల్ది అరవై అయిదేళ్ళది "బాబా! అర్ని కాస్తంత దిగమని తేలిగ్గా లాక్కుపోరా! పేగులు తెగిపోతాయి. అసలీదార్ని బండెక్కెయ్యడం ఏంట్రా?" అని బండీ వెనక్కి లాగి పట్టింది.

కూర్చున్న ఆసామీ రిక్షాగూటిలోంచి తల యీవలకు తాంబేటి తలకాయలా చాపి "టైమైపోతూయుంది. పోనియ్యి! బండీ వదులు, అని ఆ ముసిల్దాన్ని వోమాటు పరిశీలించాడు. పరిశీలించాడేగాని దిగలే. నీలయ్య, ముసిల్ది యన్నమాటకంటె అయ్యగారు అన్న కాలమానం ముక్క మనస్సున నాటించుకుంటూ, ఆ గడియప్పుడు తనవిద్యుక్తధర్మం, ఎంత బరువైనా ఓపిగ్గా బండీ లాగడమే ప్రధానం యని యనుకొన్నట్టు తీవ్రతరంగా ముసిల్దాని చెయ్యి బండీనుండి విడివడేటంత తీవ్రతమంగా లాగాడు. ఏంచేస్తుంది ముసిల్ది? ఏనీలయ్యయొక్క కాలి విదుపున దూరంగా పోయి పడ్డ నెత్తురు చిమ్మ రాతిబెడ్డను గుర్తిస్తూ వొత్తిగిల్లింది.

అయిదింటికి అయిదు నిమిషాలుంది యనగా విరాము మహల్కు, లోపైనం వ్యక్తిని చేర్చి, నీలయ్య తన బాడుగ పావలా చేతిలో పడేసుకుని అలా నిలువునా చెమటూరుతూ అరు బయట కొండమీద "సిలూటీ" చాయను నిలబడ్డవాడై అవలి వంకను యస్తమిస్తూయున్న సూర్యుణ్ణి తిలకించేడు.

పెద్దమ్మి, దిగులోయను అగి ఆ "సిలూటీ" చాయను చూస్తూ, "నాయన, నాతండ్రి యిలా వస్తే ఒకమాటు నాచేతుల్తో

వాని జబ్బులు నిమరాలనివుంది. వాని కాలికి కట్టుకట్టి గాయం మాన్పాలని ఉంది. ఆయన ఎంత కష్టపడి ఉంటాడో ఆ బండిని పైకి లాక్కుపోవడంలో? ఆయన డొక్కలు ముక్కలై యుండాలి." అని ఆలోచించి, పర్యాలోచించి, ఎంతకూ నీలయ్య తిరిగి వచ్చే జాడా జవాబూ కనబడకపోతే నిరాశ హతయై, "అన్నిటికీ భగవంతుడే ఉన్నాడు. అందరికి ఆ శ్రీమన్నారాయణమూర్తే ఆధారము" అని అనుకుంటూ యింటికి వెళ్ళిపోయింది.

పెద్దమ్మిని యంత్రికితం నీలయ్య ఎఱగడు. నీలయ్యను పెద్దమ్మి ఎఱగదు. వాళ్లిద్దరకూ వయస్సులో మూడు నాలుగు దశలు వ్యత్యాసం. అయినప్పటికిన్నీ నీలయ్య కోసం నాడు పెద్దమ్మ పొందిన జాలి వెల్లి అతి ఆర్ద్రమైంది. ఎఱ్ఱెఱ్ఱగ అంబుధి నీట చొఱబడుతూ క్రుంకిపోయే సూర్యభగవానునికైనా అటు వంటి జాలి పుట్టివుండదు.

పెద్దమ్మి తన యింటికి నాటి సంజపొద్దు ఎప్పటివేళకు చేరుకున్నదన్నమాటే కాని యింటిపట్టున విశ్రాంతి ఏమిన్నీ అనుభవించలేక పోయింది. ఆమె ముదుకకళ్లల్లో కన్నకొడుకులా నీలయ్య తేలజొచ్చాడు, "ఆర్నెవర్నో అక్కడ దింపేసేసి వెనక్కు వెంటనే చక్కా రాక యింకా ఆ కొండమీదనే ఆలాగ్గా నిలబడిపోయి నాడేం చెప్మా! నాబాబు, నాబుడుత?" అని చెప్పి ఎదో ఎదో ఊహించదొడగింది. ఊహించినకొద్దీ నీలయ్య యొక్క "సిలూటీ" విగ్రహం సాంద్రతరమైన నల్లని రేఖలతో బొగ్గుపుల్లెట్టి గీసినట్టు ప్రత్యక్షమైంది. "ఈపాటికైనా దిగుతూ ఉండడూ ఆ కొండ నాబాబు! నేనీ పాళంగా ఎదూరుగా వెడితే

నాకు దొరకడూ! నాకు వాని జబ్బులు రాచి వానిని వెంటనే సేదదేర్చాలని ఉంది. వాని కాలికి నూని పూసి గాయం మాన్పాలనివుంది. ఎలాగు?" అని సంస్మరించింది.

"ఆ కొండమీద నీళ్లు దొరకవు అతనికి. ఆ కొండ మీద అన్నం దొరకదు అతనికి. ఓవేళ దొరికినా అక్కడ తిననివ్వరు. తినకూడదు. అక్కడ నీళ్లు తాగినా అక్కడ అన్నంతిన్నా ఇతరులకు క్షయ వస్తుంది అని అంటారు. నాయన అలసి అలసి కళ్లు త్రిపడతాడేమో? వెంటనే దిగివచ్చినాడు కాదేం?" అని మిక్కిలి వితర్కించింది. తాను వండుకున్న వణ్ణం తాను తిన కుండానే మూటకట్టి, ఆ అన్నం మూటకు వారముంతతో చల్లటి నీళ్లు జతచేసి, చీకటిలో రేత్రి 9 గంటలప్పుడు బయలుదేరింది పెద్దమ్మి—అదో వెఱ్ఱిగా—నీలయ్యను కలుసుకుని అతణ్ణి ఆదరిద్దామనే దివ్య సంకల్పంతో.

*  *  *  *  *

ప్రపంచం ఆ వేళను అంధకారంగా మాటివుంది. అసర సంజలో కనవచ్చే అయోమయపు దృష్టికూడా అనడంలేదు. రస్తామీదవున్న చెట్లల్లోంచి చుక్కలక్కడక్కడ తొంగి చూస్తూ వున్నాయి. ఎక్కడనుంచి నీలయ్యయొక్క సిలూటీ విగ్రహం ఇతఃపూర్వం కనుగొన్నాదో పెద్దమ్మి, అక్కణ్ణుంచికూడా రేత్రి ప్రయాణంలో ఎంత తేటిపాటి చూచినా ఎవరూ కనిపించడం లేదు. కొండమీద లేదేమో నీలయ్య అని యనుకోవడానికి దారిలో ఎక్కడా పెద్దమ్మికి అతడు ఎదురుకాలేదు. పెద్దమ్మి అలాగ్గేనే ముందు చూపుని—"నీలయ్య పాపం! కొండమీద కెక్కి అక్కడనుంచి దిగలేక ఆగిపోయివుంటాడు. అన్నం

తినివుండడు. నీళ్లు తాగివుండడు. పాపం!" అని మిక్కిలి దయామయురాలై పోతూవుంది. కొండెక్కుతూవుంది. కొండెక్కుతూవుందంటే ఏదార్ని? ఏదారినైతే నీలయ్య రిక్షాను ఆ పగలు లాక్కుపోయినాడో ఆ దారినే కొండెక్కుతూవుంది. ఎక్కింది కొండ!

రిక్షాకాడి నేలమీద మోపి కాడి ఆవరణ మధ్యను నీలయ్య పండుకుని లోలో ఆలోచిస్తూవున్నట్టు ఆకాశం కేసి చూస్తూయున్నాడు. పెద్దమ్మి అడుగుల చప్పుడు విన్నాడు. ప్రక్కకు తిరిగి "ఎవరువారు?" అన్నాడు. "ఏమిరా! బాబా! ఇంకా ఇక్కడే ఉన్నావు? నేను పెద్దమ్మిని." అంది ముసిల్ది తన పేరు ఈరేడు లోకాలకూ తేట తెల్లమన్నట్టు. నీలయ్య "పెద్దమ్మి అంటే మద్దాన్నం నన్నూ నా రిక్షానూ చూచి జాలి పడ్డదానివేనా? ఆ ముసిల్దానివేనా? ఇలా వచ్చావెందుకే చీకట్లో?" అన్నాడు. పెద్దమ్మి "నీ జబ్బ లొత్తి నిన్ను సేద దేరుద్దామని."—లేచి కూర్చున్నాడు నీలయ్య. "ఆఁ పెద్దమ్మీ! ఆఁ!—నా జబ్బ లొత్తి నన్ను సేదదేరుద్దామనే! ఆఁ. తల్లీ! పెద్దమ్మీ! నీవు రోజల్లా మోసినవి రాళ్ళా పువ్వులా? అని తర్కించుకుంటూ ఉండాను యిలా పండుకొని నక్షత్రాలవంక చూస్తూ, నక్షత్రా లుట్టకముందు ఆలా నిలబడి సూర్యాస్తమానం గంటూ——"

"నే మోసినవి రాళ్ళే. రేపు మోయబోయీవికూడా రాళ్లే. నా తండ్రి! వాటిజోలి నీ కెందుకు? ఇవిగో నీకోసం మంచినీళ్ళు తెచ్చాను. ఇదిగో నీకోసం అన్నం పట్టుకొచ్చాను. ఆలా దిగి నాతో రా! అక్కడ బావి వుంది. ఆ బావిదగ్గఱ

కూర్చోని భోంచేదుగాని. రా! నా తండ్రీ." అంది పెద్దమ్మి. "కావు నీవు మోసేవి రాళ్లు కావు. రోజాపువ్వులు. నమ్మ నామాట నమ్మ పెద్దమ్మి!" అంటూ పెద్దమ్మి తీసిన దార్నె దిగువాయి బావిదగ్గఱకు వెళ్ళాడు నీలయ్య.

నీలయ్య అన్నం తింటూయున్నాడు చుక్క వెలుగులో. నీలయ్య మంచినీళ్లు తాగుతున్నాడు చుక్కవెలుగులో. ముద్ద ముద్దకూ పెద్దమ్మి వాని ముఖం చూస్తూ "నాయనా! మఱో కవళం తిను. మొగమోట పడక. నేను నీ తల్లిని యనుకో. తప్పులే. తిను." అంటూ నీలయ్యను ఆ అన్నం, తాను తెచ్చిన అన్నం అంతా తినేటట్టు బుజ్జగించింది. ముంతెడు మంచినీళ్లూ దాహం తీర త్రాగేటట్టు చేసింది. "నీ మడమ ఎలావుంది నాతండ్రీ!" అని అడిగింది. "నా మడమేమిటి?" అన్నాడు నీలయ్య. "నీ మడమలో రాయి గుచ్చుకోలే యీ సంజపొద్దు? అది నీవు విదపలే? విదపడంలో నీ నెత్తురు ఆ రాతి కంటుకు ఆ రాయి ఎఱ్ఱబారలే? తలుచుకుంటే నా వొళ్లు ఇప్పుడు కంపర మెత్తుతూ వుంది బాబా!" అంది పెద్దమ్మి. "నిజంగా! పెద్దమ్మి! నిజంగా!" అన్నాడు నీలయ్య. "అబద్ధమాడతానా భాబూ! వేగుచుక్క వెలుగులో సూద్దువుగాని. ఆ రాయి నలిగి, నలికావడానికి వీల్లేదు. పక్కగా పడివుంది." అంది పెద్దమ్మి.

నీలయ్య తన మడమలు చూచుకున్నాడు. అందులో ఎడం మడమ ఆ మాత్రం మేఱ పెచ్చూడినట్టుంది. "అయితే అయివుంటుంది తల్లీ! దాన్ని చూచేదేమిటి తిరిగి? దాన్ని తిరిగి నాకు చూపెట్టేదేమిటి? తల్లీ! నే వెళ్ళి వస్తాను. తెల్లాటి పాటు పడితేగాని పొట్టగడవదు" అన్నాడు. అంటూ నీలయ్య తన దారిని వెళ్ళిపోయినాడు.

పెద్దమ్మి "వెఱ్ఱి నా కుఱ్ఱడు! రిక్షా లాగుడు వదల్లేడు!" అంటూ వెనక్కి నడచివచ్చి ఆ నెత్తురాయిని పైకెత్తి చూస్తూ "రాయీ! నెత్తురూ! దాన్ని తలపోసికొనే యన్నాడు కమోసు "రోజాపువ్వులు!" అని నా బాబు, యంటూ గిలగిల్లాడింది లోలో గిలగిల్లాడింది.

అలా పెద్దమ్మి గిలగిల్లాడుతూనే వుంది: బళ్ళున తెల్లారింది——

.... .... .... .... ....

## జాలారి వీరుడు

"వాళ్ళూ మనుష్యులే మనమూ మనుష్యులమే యని తోచినప్పుడు గాని మనుష్య లన్యోన్యం హింసించుకోవడం మాన"రని నా సిద్ధాంతం. ఇది పైకి చాలా సులభమైన సిద్ధాంతం, అందఱూ యనుకునే సిద్ధాంతం క్రిందే కనబడొచ్చుగాక. ఒక్కొక్క మానిసియొక్క యనుభవంలోకి వచ్చేసరి కొక్కొక్కప్పుడు ఆ మానిసి జీవితంకూడా యంతానికి రావచ్చును. అంటే చాలా కాలం పట్టునన్నమాట. ఎలాగు యంతకాలం పడుతుందో లోకానికి బోధపడేందుకు ఇక్కడ నేనీకథలో ఒక జాలారివాని యొక్క ప్రత్యక్షానుభవాన్ని గురించి వ్రాయదలచుకొన్నాను. పాఠకులంతా బహూశ్రద్ధాభక్తులతో చదివి యందలి పరమార్థం గ్రహించాలనికూడా నేనభిలషిస్తూవున్నాను.

పెద్దవాల్తేరువద్ద చిన్నకుప్పం జాలారిపాలెం నాఁబడే దొకటుంది. చాలామంది దాన్ని చూచివుండరు. "లాసెన్సుబే"కి

అది రేవుస్థానం. ఎత్తుగా రోడ్డుయుంటే ఆ రోడ్డు దిగువాయిని ఏటవాలు వంకరటింకర్లతో ఒక వాన్నీటిజాలు కోసి ఏర్పఱచిన ఇసకా రాయీ చాలుంటే, ఆ చాలే వీధిగా జూచుకొని దానికిటూ నటూ, వెలుతురూ గాలీ పోని చుట్టుగుడిసెలు, గుడిసెమీద గుడిసెగా కట్టుకొని, పడుకోవాలంటే ఎక్కడంటూ, నడ్డెత్తుకు నిలువుగా నడవాలీ యంటే ఏలాగనుకుంటూ, కూడొండుకునే పొయ్యివెల్గు కూడు తినే కంచుగిన్నె మీద తప్ప మఱోతేజస్స్వనే పదార్థమ్మీద పడనంతటీ, ఇఱకాటంగా మఱకాళ్లో అరవై దెబ్భై గడప,—వాళ్ళూ మనుష్యులేనా అన్నట్టుట్టాడుతూంటే—, లోకాని కెఱుకపడుతూ ఉంటుంది. ఆ చిన్నస్థళం.

పురుషులు పడవలు కట్టుకు చేపలవేటకు సముద్రమ్మీదకు పోయి తిరిగి వచ్చేటప్పటికి ఆడవాళ్లు బుట్టలతో తట్టలతో ఒడ్డు నుండి ఏంపడ్డాయో యని ఆసాసతో, ఆకాంక్షతో యవలోకిస్తూ యుంటే, దగ్గఱనున్న కొండలూ కొండలమీదకు తెరలి తెరలి దొరలిపడే కరళ్ళూ, కరళ్ళచాయనే ఎగిరే పక్షులు, అన్నికూడా ఎందుకనిపిస్తాయి వాళ్లకళ్ళముందు: అంత అట ఆ కళ్ళల్లో యువ లోడనంగా యగపిస్తుంది. కొమ్ముకోనాలు, సల్లజిల్లల జంజరాలు తాంబేళ్ళు, అడివలు కెప్పుడూ చూడని రకరకాలవీ తరతరాలవీ పురుషులు తెచ్చి పడేసేతలికి, వాళ్ళయొక్క ఆడవాళ్ళకీ పిల్లలకీ ఒళ్ళు తెలియనంతటి ఆనందం ఎక్కడినుంచి వచ్చి పడుతుందో వచ్చిపడుతుంది. దొంగచాటుగా లాగేవికొన్ని, దొరతనంగా తీసుకునేవికొన్ని, ఎఱుకపఱచి ఎగరేస్కుపోయేవి కొన్ని, ఇలా యన్నీ తుదకు 'ఎవళ్ళపరమో' ఒకళ్ళపరమైపోతాయి. ఆ పట్టుకు వచ్చిన పురుషుడు తనకోసం మిగిలించుకునేది తన

వలాతన శరీరం యంతే! వేటపడవకూడా ఒక్కొక్కప్పుడు చెక్కలు చెక్కలు ముక్కలు ముక్కలు అయిపోతుంది కొండ తగిలీ తిమింగలం తోకదెబ్బ తినీ.—

వాణ్ణి—ఆ జాలారివాణ్ణి—చూస్తే వాడికి మనుష్యులతో సంబంధమనేది వున్నదా వానికి సముద్రం తప్ప వేఱేలోకం వేఱేగొడవ వేఱేబాదరబందీ కలదా యని యనిపిస్తుంది. ఏఇతర మనుష్యుడూ వాని బాగుకోసం, వాని శుభ్రతకోసం యోజించేడట్టే కనబడడు. గవర్నరుగారు చూస్తే చిన్నవాల్తేరులోని విశ్వవిద్యాలయ భవనాలు విశాఖపట్నంలోని హార్బరు చూచి పోతారు గాని జాలరిపాలెం చూస్తారా? అయినా ఆ పల్లెవాడెప్పుడూ తనకో ఇంటర్‌వ్యూ కావాలని గవర్నరుగారి కార్యదర్శినికాని కలక్టరుగారిని గాని యడిగేడా ఏమిటి? అడిగినా దొరకదు. ఆజాలారిపాలెంయొక్క పౌరసత్వాలను గుఱించి, దానియొక్క ఆరోగ్యమును గుఱించి, దానియొక్క ఆర్థికావస్థాలని గుఱించి యోజించే ప్రభువు మఱియొకడు! ఈ భూమిమీది ప్రభువు గాడు! అందుచేతనే మనకు ఏమనిపిస్తుంది? జాలారివాణ్ణి చూస్తే ఏమనిపిస్తుంది? వాడికి మనుష్యులతో సంబంధం అనేది యున్నదా? వానికి మహాసముద్రంతప్ప వేఱేలోకం వేఱేగొడవ వేఱేబాదరబందీ ఉన్నదా అని అనిపిస్తుంది.

ఓయీ! నాగరికతలో పుట్టి పెరిగిన మనుష్యుడను నేను యని విఱ్ఱవీగే మానవుడా! వాణ్ణిగురించి దీర్ఘాలోచన చేయవోయి! దీర్ఘాలోచన చేయవోయి! వానిలో నీకో దివ్యత్వము, వానినోట నీకో దివ్యసందేశము ప్రకటితం కాగలవేమో? దీర్ఘాలోచన చేయవోయి! దీర్ఘాలోచన చేయవోయి! వానిజీవితం చదవవోయి!—

జాలారి వీరుడు తన వేటపడవెక్కి బయలుదేరే దాక రేత్రిపూట. ఆ రేత్రి యతివిచిత్రమైన రేత్రి! బయలుదేటి నప్పుడేమన్నా చుక్కలు బాగానే వెలుగుతున్నాయి, నభోమండ లాన్ని గాలి ఏమన్నా బాగానే వస్తూవుంది అరారగా, చల్లచల్లగా. హోరు విశేషంలేకుండా, సముద్రంకూడా చక్కగా శాంతిగ్లే ఉంది. కాని బయలుదేటి పదిబారలు - సముద్రమ్మేర చెప్పే టప్పుడు పదిబారలంటే పదిమైళ్ళ-పదిమైళ్ళ గడిచేసరికి గరిటెట్టి దేవితే యడుగుతెట్టు పైకివచ్చి కలిగిపోతుంది అలాగ్గా యల్ల కల్లోలంగా కనిపించింది సముద్రం. అయినా చౌలువచేసి యింకా పోసాగేడు జాలారివీరుడు అప్పటికప్పుడే నలుదెసలా గాలి, సోటాడు పూజూచినట్లు మొగమ్మీదికి వీపుమీదికి కణతల మీదికి కాళ్ళమీదికికూడా తగలడం ప్రారంభించింది. గాలిని కూడా లక్ష్యంచేయకుండా ఇంకా పోతున్నాడు జాలారివీరుడు. అంతరాళాన్ని మేఘాలు రయిగప్పి దోకురుదోకురు మంటూ కాట్లకుక్కలు దంష్ట్రాలు చూపించినట్లు మెఱుపులు చూపించ మొదలెట్టాయి. అప్పటికి ఆడియకుండా ఇంకా పోతూనే ఉన్నాడు జాలారివీరుడు. ఇఖ వానందుకొందీ అక్కడ! చూడండి బాబూ! వట్టూవట్టూ అన్నకొద్దీ మొత్తిమొత్తి. విడిచిపెట్టందే! తెల్లవార్లూ చాకిలేపుబల్లనేసి మొత్తినట్లు, తడపనూ మొత్తనూ, తడపనూ మొత్తనూ, తడపనూ మొత్తనూ! జాలారివీరుడు పూర్తిగా జోలపోయి సొమ్మసిల్లి తనగతి తానెఱుక్కుండా తానోలంకమీదికి తన పడవోలంకమీదికి వేఱుపడిపోయి, ఏడు కొండల వెంకటేశ్వరుడికి మొక్కులిడుకుంటూ కూకున్నాడు. అంత తుపాను పట్టినా జాలారివీరుని చేతిలో వల చేతిలోనే

ఉంది. ఎన్నడూ అటువంటి ఘోరమైన అపత్తు సముద్రమ్మీద తనకు తటస్థించి యెరుగడు. పాపం! ఏకాకి అయిపోయినాడు.

ఆ మాదిరిగా రెండుపగళ్ళూ రెండురాత్రుళ్ళూ, నిస్సహాయంగా, ఏమీ తోచక, ఏమీ నేరక, పరుండవలసి వచ్చింది. ఆకలేసిపోతూవుంది. తాగడానికి నీళ్లు ఆ నీళ్లప్పగా ఉంటాయి. పోనీ తిందామంటే చేపా చిక్కదు, పీతా పెగల్దు. అదేదో భగవంతుని మహామాయగా ఎంచుకోవడంలో పడ్డాడు.

మూడోరోజు ఉదయంలాగుంది. ఆకలి దహించుకుపోతూంది. దాహం అమితంగా అవుతూంది. కోదండరామా! గాలివాన మళ్ళీ పడితేనే మేలంటూ మొత్తెట్టుకొంటూ వల ఒక్కమాటు విసరేడు.

ఆశ్చర్యం! పేద్దది పడింది. "ఎంతచేప్పడిందో" అని జాయిగా ఒడ్డుకు లాక్కొని దాన్ని ఇటూ అటూ దొర్లించి చూచేడు. దాని ఆకారం చేపగా ఉంటూ ఆ చేపాకారంలో మళ్ళీ మనుష్యాకారంగా మనుష్యుల్లోనూ మగవాని ఆకారంగా ఉంటూ, చంపేసి తినేదాం దాన్ని వెంటనే పచ్చిపచ్చిగానే అని—అనుకొన్న జాలారి వాణ్ణి—అల్లా ఆపేసేసింది. ఆ దారుణ కృత్యం చేయకుండా అరికట్టేసింది. మాట్లాడదు, కదులుతుంది. చేతులున్నాయి, చేతులుకి వేళ్ళున్నాయి, ముక్కుంది, తెక్కగూళ్లా పక్కెముకలూ టిక్కుటిక్కుమంటున్నాయి. మొలమగమనిషి అంగమొలగా అగపిస్తూవుంది. ఎప్పుడవితే తనవల్లోపడ్డ చేపకు అలా మానవత్వం ఉండడం జాలరివీరుడు చూచేడో అప్పుడు తనకాకలి అవుతూవున్నాగానీ ఆ ప్రాణిని ఏమీచేయకుండా యథాప్రకారంగా తిరిగి నీటిలోకి విడిచి వుచ్చేడు.

ఆహా ! వానిదయ ! వానిజాలి ! వాని సౌభ్రాతృ భావము ! ఒకమూల వానికడుపు నుసి అయిపోతూవుంది. వాడు తింటే వద్దనేదికాదు అవతలవ్యక్తి. అయినాకానీ దానిజోలికి పోయినాడు కాడు. పోకుండా దాన్ని విడిచిపెట్టి, తనపొట్ట వెన్నెముక నంటుకుపోతూ ఉన్నకారణంకొద్దీ మళ్ళీ వల వేశాడు.

ఆ పర్యాయం ఆ మగవాడు మళ్లో ఆడదానితోకూడా ఈడూజోడుగా ప్రకాశిస్తూ జాలారివీరుని వల్లోపడ్డాడు. జాలారి వీరునికి ఆశ్చర్యం అంతకంతే అంతకంతే ఎక్కువ అవుతూ వుంది. ఆశ్చర్యంతోపాటు ఉద్బాధా ఎక్కువ అవుతూనేవుంది. అయితేనేమి ? ఆ ఆడరూపంకూడా మనుష్య స్త్రీ ఆకారంగానూ ఉంది. చేపరూపంగానూ ఉంది. పక్షోజాలు, మర్మస్థానం, చంకలు గజ్జలు యవన్నీ మర్త్యధామిని దున్నట్టే. కాని చేపాకారం ! తదితరాలు !

మొదటితూరి మగమనిషిరూపంగా ఉన్న చేపను విడిచి పెట్టి భరింపరాని ఆకలికి లోనయి యుండడంచేత మలితూరి వల్లో రెండుస్వరూపాలు పడ్డప్పు డెలాగో వాటిలాగు రెండో స్వరూపాన్ని కబళించకుండా యుంటాడా జాలారివీరుడు ? నిజంగా ఆ ఆడస్వరూపాన్ని కాజేదామని గాఢంగా ఉవ్విళ్లూరి దగ్గరకు వెళ్ళి చూచి ఇటూ అటూ మెదిలించేడు. అటదాన్ని కదిపితే మగది ఆడదానికి మరింత దగ్గరగా వచ్చింది. ఇద్దర్ని కలిపి తినేసి ఆకలి తీర్చుకోవోయి జాలారివీరుడా ! అన్నట్టూ తాము రతి గూడుతూ వున్నట్టుకూడా ఉండిపోయినయి. జాలారి వీరునిమెదలం, వానిలో నోరదానికీ తిరుగుమాట లేదు. తిరుగు

బాటు లేదు. కాని జాలారిపీరుడు ఆ రెండింటి యొక్క కలయిక లోనూ మానవ దాంపత్యధర్మం తిలకించినవాడై అంత ఆకలితో నున్నవాడున్నూ ముగ్ధుడైపోయి చాచిన చేయి వెనక్కుతీసికొని మళ్ళీ రెండింటినీ సముద్రంలోనికి వదిలేశాడు.

ఆహా! వాని ఔదార్యము! వాని సద్భావము! వాని సాధువిచింతనము! అలా అని చెప్పి వాని ఆకలి చల్లారిందా? దాహం కట్టిందా? లేదు. ఆకలి ఆరాటం అతిదుర్భరమైపోతూంది. కాలం గడచిన కొద్దీ కడుపులోని పేగులు గురగురలాడు తున్నాయి. కళ్లు గుంటలడిపోవటమే కాకుండా తలతిరుగుడు ఆరంభింపజొచ్చింది. ఇక మఱి పరోపకారం పనికిరాదనీ అయినా అసలైన పరిగె పడకూడదా మూడవసారి అనీ మూడవ సారి వలకంగొదిలేడు.

ఆ మాటు అదివఱకు పడ్డ దంపతులేకాకుండా, పిలపిల మంటూ కొన్ని పిల్లలు పడ్డాయి. కొన్ని పిల్లలుపడ్డాయి అనే కన్న కొందఱు పిల్లలు పడ్డారు అంటే నిజమేమో? ఏమా అంటే ఆ జీవాలుకూడా మనుష్యుల పిల్లలకు మల్లేనే చిబుకం చేతులూ అన్నీ వుండి చేపాకారాలుకూడా కలిగి వెలిసేయి. పిల్లరూపం గదా పోనీ భక్షించేసి ఆకలి తీర్చుకోకూడదూ జాలారిపీరుడు? మనిషిరూపంగా వున్న భాగం విడిచిపెట్టి చేపరూపంగావున్న భాగం తినకూడదూ? తినలేదు! తినలేదు! తినలేదుసరిగదా ఆ మనిషి పిల్లల ఆకారంలో వున్నచేపల్ని ముద్దెట్టుకుని "నా బిడ్డలారా! మీరు నావల్లో పడ్డారుగాని నేను మీలోని మనుష్యత్వం గ్రహించి తినలేకుండా వున్నాను. నా పసిపాప లారా! మిమ్మల్నీ మీ తలిదండ్రుల్నీ విడిచిపెట్టుచున్నాను.

నేను చనిపోవుచున్నాను. నేను చనిపోవుచున్నాను. ఏకాకిగా నేను ఈ లంకమీద చనిపోవుచున్నాను. నేను మిమ్మల్ని తిని మనదలపను. నేను మిమ్మల్ని తిని మనదలపను. అని ఆగుంపు గుంపును సముద్రములోనికి చొఱవిడిచినాడు. తాను సన్యసించిన సమాధిని శరీరం చాలించినట్లు ముక్తి చూఱకొన్నాడు. దేవతలు ఆజాలారిపీరునిమీద పూలవాన కురియించేరు.

ఎందుక్కురియించేరు అంటే ఏమిచెప్పను ! దేవతలు ఆజాలారిపీరునిమీద పూలవాన గురియించేరు.

మర్నాడు మహాసముద్రం ఆ పువ్వుల్ని ఒడ్డుకు తీసుకొచ్చి చూపించక, నురుపే చూపించి ఊరుకుందీ అంటే అది మహాసముద్రంయొక్క లోపంగాని దేవతలయొక్క లోపం గాదు. దేవతలు ఆజాలారిపీరునిమీద తెల్లని పూలవాన గురియించేరు.

" తోడిమానవుడన్నంత, లోకం నిర్మింపవలసిన కరుణా సోపానాలకు పునాదిరాయి నాఁడు ఆజాలారిపీరుఁడు ఆ మహాసముద్రంలో దింపినాఁడు ! " అని కామోసు దేవతలు ఆజాలారిపీరునిమీద బహూపరిమళించే విరులు అవిరళంగా గురియించేరు ! అవిరళంగా గురియించేరు ! కురియించేరు !

.... .... .... .... ....

# ముష్టి ముండా ?

ఆ గుడియొక్క యుత్తరంపైపు ద్వారమే యెప్పుడూ తెఱచియుండి భక్తులకు దారి జూపిస్తూవుంటుంది. పడమటిపైపు ద్వారం సంవత్సరంలో మున్నూట అరవయ్యేదు రోజులూ

మూసివుంటుంది. కాని ఉత్తరంవైపు ద్వారాని కిటూ అటూ వీధిలోని కరుగులు వున్నట్టే పడమటివైపు ద్వారానికికూడా అరుగులు వున్నాయి. ఉత్తరంవైపు ద్వారమ్మీద మహాఋషుల విగ్రహాలు వున్నట్టే పడమటివైపు ద్వారమ్మీదకూడా మహా ఋషుల విగ్రహాలు బాసింపట్టుగా కూర్చోపెట్టినవి తేజరిల్లుతూ వున్నాయి. అవి ధ్రువతార వెలుగులోనైతే ఇవి సూర్యాస్త మయపు పెల్లుబందనంలో—ఎలా చూచినా గుడికిటువైపూ అటు వైపూ అనే తేడా గుడియొక్క కట్టడంలో వున్నట్టు తోచదు కాని గుడియొక్క తలుపులు పూజార్లు తెఱవడంలో వున్నట్టు అగుపిస్తుంది.

ఈ పూజార్లు గావించినదానికి ప్రభుత్వంవారు కూడా తోడైనట్టు, ఉత్తరంవైపు ద్వారాని కెదురుగా రాజమార్గం బాహాటమైంది పఱిపించేరు. పడమటివైపుద్వారాని కడ్డంగా పోతగట్టు పోసి గోదావరినదేకాకుండా నదిమీదనుండి వచ్చేగాలి కూడా ఆ ద్వారంగుండా పోకుండా చేసేశారు.

మఱిన్ని ఆ పోతగట్టు మూలంగా ఊళ్లో కుళ్లు నీళ్ల నది లోకి నిరాఘాటంగా పోవడంమాని గట్టుకు లోబడి గుడిమీదుగా వైతరిణీ చాయను నల్లగా నిరంతరం పాఱుతూ వుంటాయి. ఉత్తరంవైపు రాజమార్గం గొప్పది వుండడంచేత అది సిగ పువ్వుల ఘుమఘుమాయింపులతో మురిసిపోతూ వుంటుంది.

ఒకనాడు తూర్పునుంచి అలా రాజమార్గాన్నే గట్టెక్కి ఇలా దక్షిణంగా గుడికి ప్రదక్షిణ చేసేటట్టు మళ్ళి నడుస్తూ వున్నాను.—గుడియొక్క పడమటిదెస ఓ అరుగుమీద, కుళ్లు కాలవపక్కను, ఓ పాతగుడ్డల ముళ్ళయుయ్యాల్లో కేరుకేరుమని

ఏడుస్తూవుండే పసికందుయొక్క కాలుసేతుల అల్లల్లాడింపు కన వచ్చింది. వేళ అది సాయంత్రం. కాలం శీతాకాలం. వెలుగు చూపించేది సంజ మొగులు. బిడ్డదగ్గఱ ఎవ్వరూ లేరు.

"ఈ బిడ్డ ఈ గుడి అరుగుమీదనేనా పుట్టింది? ఎవరికి పుట్టింది?" అనే సమస్యలు వింతగా నా హృదయాన్ని తట్టినాయి. ఆ తట్టడాని క్కారణం విశేషమైన సానుతాపము కాదను కుంటాను. "ఎవరికి పుట్టిన బిడ్డవురా వెక్కువెక్కుమని ఏడుస్తావు?" అనే సామెతలాంటి దేదో భాషాస్రవంతిలో దొరలుకు వచ్చి నా చెవులకు సోకినట్టయింది ఆ బిడ్డ ఏడుపువిన్నంతనే— దాన్ని పుచ్చుకుని అనుకుంటాను.

ఆ బిడ్డ ఆ గుడి అరుగుమీదనేనా పుట్టింది? ఎవరికి పుట్టింది? అక్కడెవళ్ళూ లేరు పరులు కాని గోడల్ని చింకి గుడ్డలు, చింకిచాపలు ఇత్యాదులు బిచ్చగాండ్రయొక్క మచ్చు సామాగ్రీలని అనుకొనేలాగు కనపడుతున్నాయి. బహుశః ఉత్తరద్వారం ముందు ముష్టి అడుక్కునే బిచ్చగాండ్రుయొక్క బసలుకాబోలు ఈ పడమటెంపు అరుగులు అని లోలోసమర్థించుకొని మటిరెండడుగులు ముందుకు వేసినాను. బిడ్డయింకా గట్టిగా గట్టిగా గుక్కపట్టినట్టు ఏడుస్తూవుంది. వెనక్కితిరిగి చూచినాను.

ఒకానొక స్త్రీవ్యక్తి పఱుగెత్తుకొని ఆ పల్లపు బాటనే అరుగులవంచ కూడియున్న పెంటకుప్పలను తన తడబాటు కాళ్ళతో తన్నుకుంటూ, "నా బాబు! నా తండ్రీ! ఏడుస్తున్నావురా? ఎంతసేపట్నుంచిరా? నాకన్ను! నాపండు!" అని అనుకుంటూ, అరుగులెక్కింది. ఆ బిడ్డని అలా ఉయ్యాల్లోంచి పైకి తీసింది. తాను కూర్చుని కాళ్లు కొంచెము సాచుకొని ఆ వంపునే ఏర్పడ్డ

అద్దాల్లో బిడ్డను పెట్టుకుని అతిస్నిగ్ధంగా పాలిస్తూవుంది. బిడ్డ వూరుకుంది.

ఆ నిశ్శబ్దంలో బిడ్డ పాలు కుడుచుసునే శబ్దం తక్క మరోశబ్దం లేదు. శబ్దంలేకపోయినా అర్థంవుంది.

ప్రశ్న : నన్నెందుకు కన్నావు ?

జవాబు : నీవు పుడతావని అనుకోలేదు.

ప్రశ్న : అయితే నేను చనిపోనా ?

జవాబు : అమ్మయ్యో ! నీవు చనిపోవడమే ! నీవు చనిపోతే నేను చచ్చిపోనూ ? బ్రతికివుండగలనా ? నా చంద మామ చెండూ ! నా చుక్కల చూపూ !

అవకాశం అంతా ప్రశ్న జవాబు ప్రశ్న జవాబులతో ప్రతిధ్వనించిపోయినట్లయింది. ప్రతిధ్వనించిపోవడమే కాకుండా ప్రతిధ్వనితోపాటు జలదరించిపోయినట్లయింది. చీకటి తనంతనే కమ్ముకుపోయి దృశ్యాన్ని బాహిర్లోకానికి తిరోహితం చేసింది.

గుబాలున ఎప్పుడూ తెరువబడని పడమటి ద్వారం తెఱువ బడింది. పూజారి కాగడా వేసికొని అరుగుమీదకు వచ్చి “ ఈ అరుగుమీదనే నీళ్ళాడావుటే ? ఈగుడి అరుగుమీద ? ఎప్పుడే ముష్టిముండా ! ” అన్నాడు. “ ఇక్కడున్నవాళ్లు అంతా ముష్టివాళ్ళే. నన్నేమే అనక్కర్లేదు ” అంది అది, ఆ కాగడా వెలుగున తన చింకిగుడ్డలను పిల్లాడికి పక్కగా పరుస్తూ— “ గుడ్డలు గూడా పరుస్తున్నావు ? ఇంకా ఇక్కడ పడుకుందా మనే ! ఓసిరండా ! ఓసితొత్తూ ! గుడినంతనూ ధ్వంసంచేసి పార వేసినావే యీరోజున” అన్నాడు పూజారి. “ ఈ రోజున కాదండీ నేను నీళ్ళాడింది. రెన్నాళ్ళయిందండీ ! ” అంది స్త్రీ నవ్వుతూ

ఆ పఱచిన గుడ్డలమీద బిడ్డను పవళింపజేస్తూ. "ధర్మకర్తతో చెప్పి నిన్నీడిపిస్తాను" అన్నాడు పూజారి. "అంత మాత్రం గడువిస్తే నాబిడ్డ మహారాజై నిన్నీ గుడిలోనుంచి గెంటింపిస్తాడు" అని మెహర్బాణీగా అనుకొని రాణీలాగు పిల్లపక్కలో పడుకొంది బిడ్డమీద అభయహస్తం వేసుకోని.

పూజారి వెళ్ళిపోయినాడు. కాగడా గుడిలోకి మళ్ళిపోయింది. గుడితలుపులు దబదబ మళ్ళా గెడలు పడిపోయినయి.

ఆ అమ్మి ఆలోచిస్తూవుంది ప్రణయపరమైన ఒకానొక మహాగాధ ఆమెకు స్ఫురిస్తోంది. ఆ స్ఫురణలో విఘడియలు, ఘడియలు, జాములు గడవగా రాత్రి రెండవయామమైంది.

రెండవయామానికి గుడియొక్క పడమటివైపు మురుగు నీటిలో ప్రతిఫలిస్తూ క్రమంగా ఆమె మీదకొక పెట్రోమాక్సు లైటు వెలుతురు పడింది. ఆమె చూడలేదు. వెలుతురులో ధర్మకర్తా పూజారీ యుద్దబూ వుండి ధర్మకర్త అడుగుతున్నాడు "ఇదేనా ఆ మనిషి ?" అని, పూజారి "అవు" నంటూయున్నాడు. ఆమె వారి సంభాషణవినలేదు.

ఆమె అనుకుంటోంది తనలో—"వాని శరీరం మీద ఆ సమయాన్ని గుడ్డలువున్నా గుడ్డలు లేనట్టే. వాని యొడలు చలిచేతను కంపించి పోవుచున్నది. వాడు దిక్కులేక నాకడకు వచ్చేనన్నాడు. ఎవడవని అనకుండానే వానియొక్క మణికట్టు పట్టుకుని వానిని ఈ అరుగు ఎక్కించాను. వాడు నాచేయి తాకుడుకు పరవశుడయిపోయి నీ యొళ్లెంతో వెచ్చగా నున్నదన్నాడు. ఎంతో హాయిగా నున్నదన్నాడు. నా నెత్తుటియొక్క గుణము కనిపెట్టినవా డీలోకంలో నొకడున్నా డనుకున్నాను

వానికి నాహృదయం ఇచ్చి ఇచ్చి ఈ అరుగుమీద—ఈ అడుగు మీద — అప్పు డీ తలుపులే మైపోయినవి. అప్పుడీ గాగడాలేమై పోయినవి. అప్పుడీ పూజార్లేమైనారు ? ”

ధర్మకర్త ఆమె స్వగతం వింటూ పూజారితో “ ఈ తలుపు లెప్పుడూ తెఱచియుంచవలసినది. ఎప్పుడూ తెఱచియుంచినయెడల యిలాంటి ముష్టిముండ లిలా నక్కి యుండడాని కవకాశముండదు చూడూ ! ” అన్నాడు.

నిదరలోంచి మేల్కొంచినట్లు ఆమె లేచింది. లేచి ధర్మ కర్తతో “ బాబూ ! ఈ నాశరీరం ముష్టియెత్తితే నాకువచ్చింది కాదు. ఈ నాబిడ్డడు నాకు ముష్టియెత్తితే వచ్చినవాడు కాడు. ఎందుకు పదిసార్లు ముష్టిముండా ముష్టిముండా అని అంటారు. నన్ను ప్రేమచే సంపాదించుకొంటినని నాతల్లి మురిసిపోయింది. నేనున్నూ నాబిడ్డను యీబిడ్డను ప్రేమచేతనే సంపాదించుకో గల్గితినని మురిసిపోవుచున్నాను ” అంది. ధర్మకర్త దానివైపు నకు తేరిపార చూచినాడు. వసంతఋతువులో పువ్వుపూసిన మల్లెతీగలా నవ్వింది ఆమె.

“ ఏడీ నీ ప్రియుడు ?” అన్నాడు ధర్మకర్త. “ ఇవిగో యీపాత చింకిగుడ్డలను ఇక్కడ దిగవిడిచి ఆ తెల్లవాఱుజాము ననే వెళ్ళిపోయినాడు. వీనినిబట్టి మీరు వానిని ఆనవాలుబట్టి నాకు తిరిగి ప్రసాదించినట్లయినా వేవేల దండాలు ” అంది. ఆ గుడ్డలకేసి ధర్మకర్త పరీక్షించి చూచినాడు. ఒక్కదానిమీదను పేరు లేదు. ఒకదాని పోలినగుడ్డ మఱొకగుడ్డ కాదు. అన్నీ పేలికలే. ఒకదాని కింకొకముక్క చొప్పున వాని నన్నింటినీ అతికినా బొంత కాదు.

ఆమెను చూచి ధర్మకర్త మిక్కిలి జాలిపొందినవాడై పూజారితో "ఈ పడమటివైపు తలుపులు ఎప్పుడూ తెఱవక పోవడమే మేలు. నేటినుంచీ ఈవలివైపు తాళంవేసి వేయు చున్నాను. ఈ వైపునకు మీ రెవ్వరును రావద్దు" అని శాసించి నాడు. శాసించి తాళంవేసి పూజారితో పెట్రోమాక్సులైటుతో ధర్మకర్త వెళ్ళిపోయినాడు.

ఆ పురటాలిప్రాణం కుదుటుపడింది. బిడ్డను మెల్లిగా తన పొత్తిలోని కిముడ్చుకొని కాళ్ళు దగ్గఱగా తీసికొని గాఢ నిదరలో నిర్యాణావస్థ ననుభవిస్తోందా అన్నట్టు విలసిల్లి పోయింది.

.... .... .... .... ....

# టర్కీలు - గినీలు

టర్కీలు, గినీలు, అంటే అవో రెండు రకాల కోళ్ళు. కథ కాపేరిచ్చి నందు క్కారణం మరేం లేదు. ఆ కోళ్లు ఆ "కాలెనీ" లో పెంచ బడతాయి. "కాలెనీ" అంటే పెద్దవలస రాజ్యం అనుకొనేరు కనుక. రైల్వే కాలెనీ. రైల్వే కాలెనీ అని వీథుల్లో రైళ్లనడప్వు. రైల్వే యిలాకా నవుకరీవుండే ఏంగ్లో ఇండియన్లు విస్తారంగా కాపురం ఉంటారు. అందుచే దాన్ని రైల్వే కాలనీ అని పిలవడం పరిపాటి. కానైతే, రైళ్లు పక్కనుంచి కూస్తూపోతాయి. పూర్తిగా రైళ్ళకూ ఆ కాలనీకి సంబంధం లేదని అనడానికి వీల్లేదు. సంబంధం ఉండనూ ఉంది లేనూలేదు.

పై దంతా కథకు చెందని ఉపోద్ఘాతమే. అయితేం, తప్పని సరిగా వ్రాయవలసి వస్తాయి కొన్ని సంగతులు. పాఠకుణ్ణి పట్నంలో వోమూలనుంచి ఇంకో మూలకు తీసుకు పోవాలీ అంటే ఎలా చెప్పండి ? పట్నంయొక్క వో తట్టున లేనివి, మరో తట్టున యున్నవి స్ఫురింప చేయాలి. చేస్తే కథ మేఘంలా ఈ పక్కనుకదా ఉదయిస్తూ వుందని అనుకోడానికి మనస్సు సిద్ధ పడుతుంది. ఇప్పుడు పై ఉపోద్ఘాతంవల్ల పాఠకుని చిత్త ప్రసన్నత ఏ మూలకు ప్రసరిస్తూ వుంది అని అనుకోను ? రాజమహేంద్రవరంలో వోమూలకు చేరుకుని యుండాలి. ఏ మూల అది ? రైల్వేకాలనీ వున్న మూలకు. కాని రైల్వే కాలనీకి కథకూ సంబంధం లేదన్నాం. అంచేత రైల్వే కాలనీకి కొంచెం అనుకుంటూ వెళ్ళాలి. అక్కడొక లెవెల్ క్రాసింగు. ఆ క్రాసింగు దారితీసే పెద్దరోడ్డు. ఆ రోడ్డున జనం వుండరు. కాని హఠాత్తుగా మోటార్లు వస్తూ పోతూ వుంటాయి. అదీకథకు రంగస్థలం. ఆనవాలు పట్టి ఉంటా రీపాటికందఱున్నూ ఆ స్థలం.

చిన్నజాన్ అక్కడ ఆడుకుంటూ యున్నాడు. బుల్లిమేరీ అక్కడ పాడుకుంటూ వుంది. అప్పలమ్మ ఆయా వాళ్ళతో కూడా వుంది. ఆ యా సొంత పిల్లలు రామస్వామిగాడు, ఎఱికలమ్మ ఆయాను వెంటాడ్తూ ఏదో ఇసకలో కంచాల్లాంటివి గీసుకుంటూ యున్నారు. సాయంకాలం 5-గంటలు.

ఆయా అప్పలమ్మ ! రాక్షసిబొగ్గంత నలుపూను దాని చాయ. కాని హృదయం అంత కటికిదిగా దోచదు. మువ్వగింజ మాదిరి హృదయంగా తోస్తుంది. అంటే చమురున్న మనిషి అన్నమాట. ఊహ ప్రజ్వలింపజేస్తే నిల్చి, వెలుగుతుంది.

కాంతి యిస్తుంది. తీరైన ముఖం, నీటైన చూపు. గోటైన నడక. నీ వెవరవు అని అడిగితే ఇంగ్లీషులో "అయిమ్ ఆయా అప్పలమ్మ" అని జవాబు చెప్పేస్తుంది తిన్నగా. సన్న విడిగా విడివడి సంగీతంలా వినవస్తుంది దాని యాస. "బేబీ మేరీ!" అని అది ఆ తెల్ల పిల్లల్లో ఒకర్ని పిలుస్తూంటే చెట్లమీద గోరింక పలుకులా వెలిసిపోయిం దానాడు.

రామస్వామి గాడికి ఏడేళ్లు. ఎటికలమ్మకు అయిదేళ్ళు ఉంటాయి. వాళ్ళిద్దరూ మామోలు కడజాతి పిల్లలల్లేనే అగపిస్తారు. ఒళ్ళంతా దుమ్మూ ధూళీ. అల్లరి చిల్లరి చేష్టలు, కంచెల్లో కట్టలు విఱవడం, దారే పొయ్యే కుక్కలుంటే వాటి మీదకు రాళ్లు విసరడం. ఇది వాళ్ళ తంతు. ఈ పిల్లలు ఆ యా అప్పలమ్మగారి పిల్లలని యనుకోడానికి సుతలాం వీలగపించదు. ఏం చేతా అంటే ఆ యా అప్పలమ్మ దిరీసే వేఱు. తెల్లని చీర మల్లెపువ్వుల చాయది కట్టింది. వొళ్లెంతో సంతనాగా మల్చి చూపించే వెనక ముందు కత్తిరింపుగల రయిక తొడిగింది. కాలికి ఆకు జోడే అనుకోండి కాని యదో రకం అందమైన ఆకుజోడు అన్నింటి కంటే చోద్యం! ఒకటో రెండో పూలుపూలు కురుల్లో గ్రుచ్చుకుంది. దాని పిల్లలు ఈ అతతాయి ముండా వాళ్ళ యనుకోవడం ఎట్లా? ముఱిసిన్ని పలకరించినా ఆదరించి నా అప్పలమ్మ జాన్‌నీ, మేరీనీ, పలకరించేది. ఆదరించేది. రామస్వామిగాణ్ణీ, ఎటికలమ్మనీ, తలపెట్టైదే లేదు. ఇకెల్లా చెప్పండీ యనుకోడం వాళ్లు దీని పిల్లలని?

జాన్! మేరీ! ఇద్దఱూ తెల్లని పిల్లలు! వాళ్ళకు శుభ్రమైన దుస్తులు! జోళ్ళు! మేజోళ్ళు! ఎక్కడకు పోయినా కూడా వోతోపుడు బగ్గీ!

ప్రభుత్వంవారి చట్టాలు యనండి. స్థానిక పరిపాలనం వారి చట్టాలు అనండి. అవి మిక్కిలి చిత్రమైన చట్టాలు. ఒక మనిషిమీద కన్నకనక మతో మోటారెక్కించి వాణ్ణి కడతేరిస్తే, ఆ మోటారు డ్రైవర్ని హంతకుడంటూ సెషెన్సు కోర్టు దాకా ఈడ్చుకు పోతారు. ఒక్కొక్కప్పుడు ఉరిస్తంభాలుకూడా ఎక్కిస్తారు. కాని మోటారు దుమ్ము యమేషా బీదసాదల ముక్కుల్లో దూరి, వాళ్ళ ఆరోగ్యం దినే దినే నాశనంచేస్తూ తుదకు వాళ్ళ కేక్షయరోగమో తెచ్చిపెట్టి చంపివేస్తుంటే, అది హత్యగా ఏ "లా" పరిగణించదు. ఆ మహానుభావులందఱూ యతీ భోగులూ! మహా భోగులూ! దాంతో పాటు నిర్దోషులున్నూ! ప్రపంచం అలా నడుస్తూవుంది భాగ్యవంతులయొక్క ప్రాభవ మ్మీద: ప్రతీవాడూ ఎందుకు భాగ్యవంతుడు కాకూడదు. ప్రతీ వాడూ మోటా రెందుకు ఎక్కకూడదు యని అడగొచ్చు.

ఆ ప్రశ్న నన్నడిగితే నేను జవాబు చెప్పలేనేమోకాని ఆయా అప్పలమ్మను యడిగితే చెబుతుంది. అది యంటుంది "భాగ్యవంతుడు కావడానికి పుట్టుచేటూ కొంత తాహతు వుండాలి. అదే పెట్టి పుట్టాలన్న సామెత. మఱి ఆరోగ్యవంతుడు కావడానికి వేఱే తాహతు యక్కర్లేదు. భూమి మీద పడ్డ ప్రతీ ప్రాణికీ ఆరోగ్య మనుభవించడానికి హక్కు వుంది. మంచిగాలి పీల్చడానికి, శుభ్రమైననీరు తాగడానికి, శుచీ, రుచి, పచీగల పదార్థాలు భుజించడానికి, ప్రతీవ్యక్తికీ హక్కువుంది. పక్షులకు భాగ్యం అక్కర్లేదు చూడండి కాని చల్లని గాలినీ, నిర్మలమైన సెలయేటినీ, తియ్యని పండ్లను ఎలా యనుభవిస్తూ వుంటాయో! అవి వాటి జన్మ స్వార్జితాలే. అలాగే తక్కిన జంతుజాల

విషయమైనన్నీ మానవుడు ఈ పశు పక్ష్యాదుల మాత్రం పాటి చేయడా ? ఆ జన్మ హక్కు వీడనుభవించ నక్కర్లేదా ? మాయ దారి భోగా లనుభవించే భోగలాలసుల యొక్క బళ్ళవెనుక కొట్టే దుమ్మే పీల్చాలా వీడు ? మేడలూ మిద్దెలూ కట్టుకున్న వాళ్ళయొక్క పెఱటిదారుల కుళ్ళు నీళ్లు కడిగి పొయ్యాలా వీడు ? ఎబ్బే ! ఎబ్బే ! ఏమి మనిషి ! ఎందుకు పుట్టిన మనిషి?" అని అంటుంది.

ఆ మాత్రం స్వయం వ్యక్తిత్వం సంపాదించుకుని ఆజవాబు చెప్పడానికైనా అప్పలమ్మకు ధైర్య మన్నాది ఎలా వచ్చిందో మీకు తెలుసునా ? ఆయా అవబట్టి. అప్పలమ్మే కనక అప్పలమ్మ లాగే వుండి వుంటే, అంత ధైర్యంగా జవాబు చెప్పి యుండదు. కాని ఆయాకంటె పై ఉద్యోగం అది ఎం తంటాలు పడ్డా సంపాదించ లేకపోయింది. నిజంగా దా కడుపులో వూహ తెలుసుకుంటే ఎంత వూహ ఉందీ నీ కడుపులో అని అంతా యనీవారే. దానికి నిజంగా ఆ పాళంగా వో వైస్రాయి యయిపోవాలని ఉంది యనుకోండి. ప్రత్యేక భవనం, ప్రత్యే కోద్యానవనం, ప్రత్యేక పరిజనం, ప్రత్యేక వాయువిమానం, అంతా ప్రత్యేక—ప్రత్యేక—ఇత్యాదిగా ఉండి యనుభవించాలని దాని కోరిక. కాని ఎలా ? ఏంగ్లో ఇండియన్ దొరగారి యింట్లో ఆయా పని మానివేస్తే మఱివేఱే చోట పనే దొరకదేమో దానికి పాపం ! పోనీ ముందు జన్మకైనా వైస్రాయి యవుతుందా ?— ముందు జన్మలో ? ఈ జన్మలో నిర్మలమైన గాలి పీల్చడానికే పెట్టి పుట్టని మనిషి ముందు జన్మలో వైస్రాయి ?

ఒక మోటారుకారు వాళ్ళ వెనుతట్టునే బంయి మంది. కంగారెత్తి పోయింది పిల్లలకు. ఆయా అప్పలమ్మ తాను పిల్లల కంటే ఎక్కువగా కంగారు పడిపోయింది.

ఆ మోటారులో ఎవరున్నారో యనే కంగారుకాదు వాళ్ళది. ఆ మోటారుకారు తన దుమ్మును వాళ్ళ కళ్ళల్లోకి ముక్కుల్లోకి కుమ్మి వాళ్ళ మీదనుంచి పోతుందేమోననే భయం. అప్పలమ్మ, గబగబా తల్లికోడి కనక తన రెక్కల క్రిందకు పిల్ల కోళ్ళను లాక్కొన్నట్టు, కేకేస్తూ " జాన్ ! " బేబీ మేరీ " కమ్‌ది సైడ్.—ఒరే రామసామిగా ! ఏమేవ్ ఎటికలమ్మ ఈలా రాండర్రా ! కార్ కార్ యంటూ ఆ నలుగుర్నీ కూడా తనయొక్క చేతుల మధ్యకు తీసికుని రోడ్డువంచకు దిగింది.

కార్లో వాళ్లు దొరలు. ఆ దొరలు గబుక్కున కారు ఆపి " ఏయ్ ! అమ్మీ ! " అన్నారు. అప్పలమ్మ గడ గడ లాడింది మొదట. కాని తాను తప్పుచేసింది లేదని తనలో తెలుసుకొని " ఏమండీ బాబూ ! " అంది. " నీ పిల్లల్ని మా పిల్లల్ని అలా కలిపి పట్టుకోకు — మా పిల్లలు చెడిపోతారు. పరిశుభ్రంగా యుండరు " అన్నారు. అప్పలమ్మ అంది : " కారుక్రింద పడి చచ్చిపోతారేమో యని దగ్గరగా తీశాను సర్. ఇందాకట్నుంచీ వేటే వేతనే ఆడుకుంటూ యున్నారు " అంది.

" చచ్చిపోయినా కలపకూడదు " అన్నారు దొరలు. ఆయా " చిత్తం " అని పైకి సలాంపెట్టి లోపల యనుకుంది " ఆ వాళ్లమాట మనిషి పిల్లల్ని గురించా టర్కీలను గినీలను గురించా " అని.

.... .... .... .... ....

# పడకగది వంటగది

" She wouldn"t change her lot for any
artificial delights the world
could offer "

కరుబూజారావు మాంచి చదువుకున్న మనిషి. సంపన్నుడు. అన్నీ తెలిసినవాడు. అతని భార్య శశికాంత ఉందే ఆమె బలే మాటకారి. సకలగుణ సంపెంగలా కీర్తి దిక్కు లల్లుకుపోయిన గుణవతి. బహూ మోజుకువైంది.

అయినప్పటికిన్నీ వాళ్ళిద్దరియొక్క యభిరుచులు వేర్వేరు. ఒక్క పిల్లలకోసమై హృదయాలు ఏకంచేసుకుని ఏం ప్రవర్తిస్తారో, అది తప్పిస్తే తతిమ్మా యన్ని విషయాల్లోనూ ఎడ మొహం పెడమొహంగా వారిద్దఋ యుండిపోవడం పరిపాటి.

"నేను క్లబ్బుకు వెళ్ళిపోతున్నానేవ్! వీధితలుపు వేసేసుకోవేవ్!" అని కరుబూజారావు బుజాన్ని కండువా వేసుకొని, చేతి బెత్తంవంపు మోచేత తగుల్చుకుని, సెలవడిగితే శశికాంత "మళ్ళీ రేత్రి పండ్రెండు కొట్టాకే కమోసు కొంపకి?" అని ధడీలున తలుపువేసి గెడెట్టుకు లోపలకు చక్కాపోయింది. నిజంగా గడపంటూ ఉండబట్టిన్నీ, తలుపులకు గ్రందెలంటూ యుండబట్టిన్నీ, వాకిటి రెక్కలు తనమీద పడకుండా కరుబూజారావు ప్రాణాలు దక్కించు కవతల పడగలిగాడు— లోతట్టు ఒకడుగు ఉన్నా గాని మడమ నలిగి యతగాడి ప్రాణాలు కడట్టిపోను. శ్రీహరి! ఏమిస్త్రీ! ఆపె!

వెళ్ళిపోయింది తిన్నగా వంటిట్లోకి శశికాంత ధుమధుమలాడుకుంటూ—"వీళ్ళ ఆటలు మండ! పేకాటలు పడుగాటలూట!

పిళ్ళ సరదాలు తగలడ ! రోజూ టాకీ గుడిసెల్లో దూరడమే, రోజూ మూకిగుడారాల్లో ప్రవేశించడమే. పైపెచ్చు పడగ్గది గోడలనిండా ఇవేం బొమ్మలో ? సినీమా తారలంటూ యడ్డమైన ఆడవాళ్ళ ఫోటోలు పత్రాను ! చట్రాల్లో బిగింపించను ! మేకులు కొట్టను ! తగిలించను—చచ్చిపోతున్నాను—ఓ శ్రీరాముని పటం లేదు. ఓ గౌరీదేవి విగ్రహం లేదు.—అవీ యక్కరలేదు. తెల్లగా ఉన్న గోడలు తెల్లగా ఉణ్ణిస్తే చక్కగా తెల్లారిపోను రోజులు ! ఎంతడబ్బు వ్రయమైపోతూవుంది; ఎంతడబ్బు ! ఎంతడబ్బు !" అని గుండెలు బాదుకుంది—స్వగతానికి లయేమో యన్నట్టు ఒకటి రెండు దఫాలు ఆ యిల్లాలు.

పెఱట్లో ఆకాశాన్ని యప్పుడే పొడుస్తూవున్న నక్షత్రాల్ని చూస్తూ ఆదాకా పొర్లి వచ్చిన దుఃఖం ఆపుకొన్నదై యంత లోనే ఓ చిన్ని చిరునవ్వు నవ్వుకుంది. "ఇవేళ ఓ పనిచేసి చూపిస్తాను" అని తీర్మానించుకుంది. తీర్మానించుకుందీ యంటే చేసేసిందన్నమాటే ఆవిడ ఏపనైనా.

వార్పులోను వడ్డనలోను చేయిపేడెక్కకుండా యక్కర కుపకరిస్తాయని, అక్కడా ఇక్కడా కుక్కివుంచిన తనదాపుడు చిత్తు కాగితాలు, నోట్లలాగు దస్తావేజుల్లాగు ఓ లక్ష పైకి తీసింది. ఎక్కడి వంటారు యవన్నీని ? అవన్నీ బజార్లో చిల్లరగా మల్లరగా తెప్పించిన సరుకులకు యంగడివాండ్రు చుట్టీకట్టీ ఇచ్చిన పాత వార్తాపత్రికల కాగితపు తునుకలు, పావుటావులు, అరటావులు, అంతలేసివి.—అవన్నీ ముందుపడేసుకుని, అందులో బొమ్మలున్నవి, అక్షరాలున్నవి కొన్నికొన్ని ఏర్చింది ఓ వంద. చాలాభాగం యవన్నీ కాసరబీసర భాషల్లో ఉన్నవే—డెయిలీ

స్కెచ్, డెయిలీ రికార్డరు, పంచ్, స్పెక్టేటర్, ఇలాంటి వార్తా పత్రికలయొక్క శిష్టభాగాలు. ఓ గిన్నెడు మైదాపిండి ఉడికించి, ఆ కాగితా లన్నింటికీ రాచి, పడగ్గదిలో భర్త తగిలించిన పటా లన్నింటిమీదనూ యంటించింది. వంట చేసింది. దీపం హెచ్చించి వెలుగులో కూర్చుని కత్తిరి పుచ్చుకుని, విడివిడిగా నట్టిం టెగురుతూయున్న మరోపాతవార్తాపత్రిక పుట యందుకుని యందులోని ఒక బొమ్మ యతి చిత్రంగా మహా చిత్రంగా ఆకారం చెడిపోకుండా చుట్టూ అంచునుబట్టి కత్తిరిస్తూ దానికేసి చూస్తు కాలం వెళ్ళబుచ్చుతూవుంది.

పన్రెండు కొట్టీకొట్టడంలో కరుబూజారావు ఇంటితలుపు తట్టాడు. శశికాంత లేచి మగనికి తలుపుతీసింది. భార్య తలుపు తీసితీయడంలోనే కరుబూజారావు తన కండువాను సావిట్లో కూర్మాన్ని తగిలించి, లాల్చిచేతులు పైకెగద్రోసికుంటూ "చూడోసేప్! ఆ రాయి ఇలాతే!" అంటూ తన జేబులోనుంచి తీగమేకున్నూ వోచిన్న పటమున్నూ తీశాడు. తీసి వెంటనే మేకొట్టి ఆ మేక్కు పటం తగిల్చి "నీళ్ళుపట్టుకురా కాళ్ళు కడుక్కోవడాని" కంటూ వెళ్ళి పెఱటో కాళ్లు కడుక్కుంటూ వున్నాడు.

ఆలోపున శశికాంత తాను కత్తిరించిపెట్టిన బొమ్మకు వెనుతట్టు మైదాపిండి రాచి యది తిన్నగా తీసుకువెళ్ళి భర్త కొత్తగా తగిలించిన పటాని కంటించింది; ఏమీ ఎఱుగనట్లు వచ్చి భర్తకు అన్నం వడ్డించింది.

భర్త భోంచేసి, భార్య భోంచేసి, యిద్దఱూ శయనా గారం ప్రవేశించేసరికి రాత్రి రెండోఝాం దాటింది. ఇంగ్లీషు లెక్కప్రకారం కొత్తతేదీ వచ్చింది.

ప్రహస్వరాత్రి యంటూ ఒకేపక్కమీద భార్యాభర్త లిద్దరూ పవళించేరు. భర్త భార్యను తనకేసి తిప్పుకొంటూ "ఒసేవ్! ఇవాళ "చూడక చూచిన" అనే ఫిల్ములోని కథానాయకిబొమ్మ కొనుక్కొచ్చి మనగోడకొట్టాను చూచావు?" అన్నాడు. భార్య చిరాగ్గా రెండోవంపుకు తిరిగి "మీరు చూపెడితేగా చూచేది?" అంది. ఆ పాళంగా కరుబూజారాపు వెంటనే లేచి వెళ్ళి తానావేళ కొనుక్కొచ్చినపటం గోడకు తగిలించింది తీసి, చేత్తోతుడిచి, అలా భార్యకు చూపించే తలంపుకంటె యంతకుముందు తానింకోసారి చూచే మురిసిపాటు హెచ్చై పడగ్గది పచ్చదీపబ్బుడ్డి ముందుపెట్టి పరకాయించేడు.

"నేనో బొమ్మట్టుకొస్తే ఇదోబొమ్మఅయిందేమిటేవ్! ఒసేవ్! ఇవాళదగా పడిపోయానేవ్! ఆరి పీడిల్లు పల్లకాడుగాను. "గొరిల్లా" పటమిచ్చాదేమిటే?" అని కేకేశాడు. "గొరిల్లా"వో "చింపంజీ"వో బాగాచూచారా? ఏదైనా మీరు ఈడాకా కొనుక్కొచ్చిన బొమ్మలన్నింటికంటె బాగానేవుండి వుంటుంది. ఏది ఇలా పట్రాండి! చూసి చెప్తాను." అంది.

"ఇదిగో చూడు!" అని ఆ పటాన్ని పక్కమీద శశికాంత ముందుపడవేసి "ఏదో తిరకాసుజరిగింది" అంటూ చుట్టూ పడగ్గది నాలుగ్గోడలూ తిలకించేడు. భార్యచేసిన చేతకు లోపల మండిపోతూయున్నాడు. పైకి మాటాడలేకుండా వున్నాడు అలా మగడు చెకుముకిరాయిలాగవుంటే, శశికాంత పక్కమీదను అలాగే పండుకుంది, మోచేతి మోపున తలెత్తి భర్త పడవేసిన బొమ్మను తాను కొత్తగా చూస్తూవున్నదానిలా నటించి అంది: "దీనికేమండీ? ఇది నిక్షేపంలా ఉంది. సృష్టిలో పుట్టిపెరిగిన

జంతువు. కృత్రిమవేషం సుంతైనా లేనిది. ఎంచక్కా ముద్దొస్తూ వుంది. ఇవాళకు నాకు నచ్చిన బొమ్మట్టుకొచ్చారండీ !" అని ఆ బొమ్మను ముద్దెట్టుకోబోయింది.

"ఇన్నాళ్ళు నాతో కాపరం వెలగబెట్టి తుదకు జంతు పటాన్నే ముద్దెట్టుకోవడం ! గొప్పఅభిరుచి వెల్లడించేవు ! తీసి పారెయ్యి ఆ బొమ్మను " అంటూ భార్యచేతిలోని దాన్ని తాను లాక్కున్నాడు కరుబూజారావు.

చుట్టూ గోడలమీది పాత చిత్తుకాగితాలయొక్క అంటింపులు వంకరటింకరలు యతిగాణ్ణి మరీ ఉగ్రుణ్ణిగావిస్తున్నాయి. "ఇంకా లాగిపారెయ్యవేం ఆ అంటించిన కాగితాలు ? లాగి పారేస్తావా లేదా ?" అన్నాడు. "నేలాగిపారెయ్యను. అవన్నీ నా పటాలు. ఇదీ నాపటమే !" అంది శశికాంత మంచంమీద నుంచి దిగి నిటారుగా నిలబడి మగనిచేతిలో వున్న క్రొంగ్రొత్త చిత్తరువు తాను లాగిపుచ్చుకుంటూ మళ్ళీమళ్ళీ ఆ పటాన్నే చూస్తూ "నయం ! ముద్దెట్టుకున్నాను కాను. ఇది ఎవరిదో పర పురుషుడిపటంలాగున్నదండీ ! ఛీ !" అని అక్కడే నేలమీదను కాళ్ళుతుడుచుకొనే గోజూరీవుంటే దానిమీదకు విసిరేసింది. కరుబూజారావు ఆ విసురమ్మటే తన తలవంచి ఆ బొమ్మను చూస్తూ "ఇది మగాడే అయితే ఉరాంగు-ఉటాంగులాగున్నాడు ! వెధవ !" అన్నాడు.

"వెధవో గిధవో ! నా కదంతా తెలీదు. నేను ఓ చిత్తు కాగితంలోంచి కత్తిరించి మైదాపిండి రాసి మీరట్టుకొచ్చిన బొమ్మమీద ఉడుకుమోత్తనం కొద్దీ యంటించాను. మీరు సొర కాయ కోతలు కోస్తూ మురిసిపొయ్యే ఆడవాళ్ళ బొమ్మలు

మాత్రం? అవీ అచ్చుగుద్దిన బాపతులే కదండీ? అవి కూడా మనం చూస్తే—పణ్యో, కన్యో. పునిస్త్రీవో, పూర్వ సువాసినీవో తెలిసేది లేనేలేదు కదండీ? అంతకంటె మెరుగే కదండీ ఇది, నరుని దైతేం? వానరునిదైతేం? హృదయం కలిగిన బొమ్మ యిది! కనిపెట్టేరో లేదో మీరు. ఈ వొక్క ఘాతికంలో యగ పడ్డంలే? కేవలం ప్రకృతిని ప్రేమిస్తూవున్న అకృత్రిమపుటాత్మ! జంతువే కానీండి. జానపదమే కానీండి?" అంది శశికాంత ఉప్పొంగిపోయి.

కరుబూజారావు ఆలోచనలో పడ్డాడు. "పదా? నీవు ఏ చిత్తు కాగితంలోంచి ఈబొమ్మను చించి తీశావో చూపించు" అన్నాడు, దుమ్ములోపడ్డ బొమ్మను పైకెత్తి దులుపుతూ, మెల్లగా గోడకు తగిలించి.

శశికాంత వంటగదిలోకి వెళ్ళి తాను దేనినుంచి ఆబొమ్మ కత్తిరించిందో ఆ కాగితం కోసం వెదుకుతూవుంది. మరోదీపం వెలిగించి—చమక్ చమక్‌గా.

ఆమె వెనకాతలే కరుబూజారావు వంటయింటిలోనికి వెడుతూ "నిజంగా! ఏ బొమ్మా, ఏ సొమ్మూ, లేని యీ వంట గదియే ఎక్కువ ప్రశాంతంగా వుంది! అయితే నీవు ఈ చిత్తు కాగితాలన్నీ కూడిగ్గా దాస్తూవున్నావు? ఎంత పొదుపు నీది!" అని శశికాంత యొక్క రైక లేక పైట జారిన వీపుమీదను ముద్దుముద్దుగా తట్టాడు.

ఇంకా ఏమైనా చనువు చేష్టలు చేసే వాడేమో!—అంతలో పొరుగింటి ముసిలమ్మ చల్లకవ్వం త్రిప్పుతూ, పెరుగు తరుస్తూ, చిన్న కిట్టమ్మమీది పాటలు వినసొంపుగా పాడి లోకంతోపాటు

ఆ భార్యాభర్త లిద్దరికీ కూడా తెలివి గొలిపింది. చిత్తుకాగితం ఎక్కడనుంచి ఎక్కడకు పోయిందీ తెలుపుడు చేసింది.

ఆ కాయితం ముక్క, బొమ్మ కత్తిరింపబడ్డ భాగం గ్రహణం మొబ్బిలా ఆనవాలుగా అగపిస్తూవుంటే వీథంట ఎగిరి పోతూవుంది. ఆ ఎగిరిపోతూయున్న దాన్ని కరుబూజారావు వెనుదగిలి తీసికొనివచ్చి సూర్యరశ్మిలో చూచేడు.

29-4-1939 తేదీ గల డెయిలీ మిర్రర్‌యొక్క 18-వ పుటనుండి కత్తిరింపు అది. ఆ బొమ్మ డెబ్బై ఆరేండ్ల కన్య! ఆమెయొక్క జీవితాన్ని గుదించిన వాక్యాలు అతి శ్రద్ధగా చదివినవారై బొమ్మను మళ్ళీ మళ్ళీ చూచినవారై కరుబూజా రావూ శశికాంతా యిద్దరూకూడా అన్యోన్యం యిలా చెప్పు కున్నారు మనకూ మనకూ తెలియని ఇంగ్లీషుభాషలో అతి రహస్యంగా కొసకు దేలిన ముక్కగా ఆ బొమ్మని గురించి— ఏమనీ ?

'She wouldn't change her lot for any artificial delights the world could offer' అని.

.... .... .... .... ....

# నిన్నటిపువ్వు నిన్నటిదైనిక

నేడు మదరాసుకు మెయిల్లో
టిక్కట్టు దురుకుతుందా లేదా

అనే ఆందోళనతో రాజమహేంద్రం స్టేషన్‌కు వెళ్ళాను. టిక్కట్టు చులాగ్గానే దొరికింది. "బుక్కింగు ఆపేశాం" అని గాని "చిల్లరలే"దని గాని అనకుండా గూడిలోంచి యివలకు

వచ్చి పడింది టిక్కెట్టు అడిగిన తడవుగా. మఱి మెయిల్ "లేటా" అని కనుక్కున్నాను. లేదు. రైట్టయిమే అంటూ పోనిచ్చాడు టిక్కెట్ కలక్టర్ నా చేతిలోని టిక్కెట్ "కటక్" మనిపిస్తూ. మఱక్కణ్ణుంచి ప్లాట్‌ఫారమ్‌మీదకురికి, వచ్చే గాడి వంక వంగి వంగి చూపులు సారిస్తూంటే నా లోపల అంకురించిన తలపులకు మేరలేదు. రైలు కింద పడిపోయినాసరే "ఖాళీ పెట్టెలో ఎక్కి కూర్చోవాలని" కూలీక్కూడా అలాంటి సూచనే చేసి నావెనకాలే వుండమన్నాను; బెడింగు సూట్‌కేసు ఇత్యాదు లన్నీ నే కూర్చునేచోటనే ఉంచమన్నాను.

కూలివాడు, మెయిలింకా ఆగకుండానే, "ఈ బండి ఖాళీ బాబయ్యా! ఈ బండి బాగుంది. ఇందులో ఎక్కండి" అని హెచ్చరిస్తూనేవున్నాడు. కాని నేనేదో ముందుచూపుని అన్ని బళ్ళూ పరిశీలించి, ఒకానొక పెట్టెలోకి చొరబడి "సామాను ఇల్లా ఇవ్వు కిటికీలోంచి" అంటూ అందుకున్నాను. కూలివాడు గుమ్మం అంటవచ్చి సామాను సర్దడానికి మరి జాగాలేదు. ఆ గాడీకి ఒకే గుమ్మం. ఎంతమంది ఎక్కినా ఆ గుమ్మంఅంటే. ఎంతమంది దిగినా ఆ గుమ్మంఅంటే.

తక్కినవాళ్ళమాట ఎలావున్నా నా మట్టుకు నేను సదు పాయంగా సర్దుక్కూర్చోగలిగాను ఒక్క సెకనులో. గోదావరి స్టేషన్‌కు బండివెళ్ళే అంతలో బహూ సావకాశంగా ప్లాట్‌ఫారమ్ మీద మిత్రుల్ని పలకరించి "మద్రాస్" వెడుతున్నాను యని చెప్పగలిగేటంత స్థావరత్వం సంపాదించుకున్నాను బల్లమీద.

గోదావరీ ప్లాట్‌ఫారంమీదనుంచి వో మిత్రుడు, ఓబంగారు వన్నెచెట్టు సంపెంగపువ్వు నా మీదకు విసిరాడు. మఱో మిత్రుడు

ఓ దైనిక పత్రిక మీద పారేశాడు. రెండూ అలా అంజలిపట్టి యందుకుంటూ "గుడ్‌బై" అన్నాను. వారున్ను "గుడ్‌బై" అన్నారు.

మెయిల్ మటి వంతెనమీదను చప్పుడుచేస్తూ నడుస్తూ వుంది. అయితే మెయిలు నడక వంతెనమీద యతి నెమ్మది. ఎప్పుడైనా తెలుసుకున్నారో లేదో పాఠకులు టక్‌టక్ యని రెండు దెబ్బలుకొట్టి కొంతసేపు ఆగి మళ్ళీ "టక్" మంటుంది ధ్వని. బండి సాగుతూనే యుంటుంది. రెండువెంపుల కిటికీల్లోంచి ప్రకృతి దృశ్యం పరవశం పుట్టిస్తూంది. ధ్వని యవుతూనే ఉంటుంది. ప్రయాణీకులు యందరూ పరస్పరం తీయబడి చూపులు చూచుకుంటూ తన్మయులు అవుతారు.

నా ఎదరబల్లమీద ఇద్దరు యువతులు ఇద్దరు యువకులు కూర్చునియున్నారు. బాగా పరిశీలిస్తే ఒక యువకు డొక యువతిని ఒక యువకు డొక యువతినిచేరి కూర్చున్నట్టు కాపడ్డారు. ఇంకా యోజిస్తే వారిద్దరూ ఒక్కొక్క దంపతులు యన్న నిర్ధారణకూడా మనం రావచ్చును. మటిన్నీ విలోకిస్తే ఒకరు అరవ దంపతులు, ఒకరు తెలుగు దంపతులుగాను బోధ పడక మానదు. నా తీరుబడి చూపులు అప్రయత్నంగా ఆ నలువురుమీదకు ప్రసరింప సాగినాయి.

నా చేతిలోని పువ్వు వో అమ్మాయికి నా చేతిలోని దైనిక పత్రిక ఓ అమ్మాయికి ఊరికేనే హృదయపూర్వకాభినందన సమేతంగా ఇచ్చివేదామని తొలుత ఊహ పోయింది కాని ఎదో వెనుదృష్టిని ఆ పువ్వును ఆ దైనికమీద పెట్టి బులబులాగ్గా మణచి, వారు కూర్చున్న మీతట్టు సామానుపెట్టుకొన్న అటక

చెక్కమీద వారి సామానుతోపాటు జాగ్రత్తగా చూస్తూయుండు మన్నట్లు చెప్పించి ఉంచాను. దైనికలోని వార్తలు వెలికి విన వచ్చినట్లు లేదు కాని, పువ్వుమాత్రం ఘుమఘుమా పరిమళించి వేసింది. నేను నా బల్లమీద పక్కపరుచుకు పడుకుని నిదర పోయే పర్యంతమూను.

అయితే నిదర పడుతుందా? నే నొంటరిగాణ్ణి. ఎదర రెండు జోడాలు కొంతసేపు వారికీ నాకూ ఉన్న యవస్థాభేదం తలపోసికొన్నాను. కొంతసేపు వారూ వారూ యన్యోన్యం దంపతులు మాటాడుకొనే నుడువులూ చూచుకొనే చూపులూ విలాసంగా ఉపలక్షించాను. తుద కో నిశ్చయానికి వచ్చాను. "అరవ యువతి తెనుగు యువతికంటె యందంగా ఉండి తీరుతుంది" అని. మఱిన్నీ "తెగించి ఊ-తెగ కబుర్లు చెప్పి పొద్దు పుచ్చుతుంది" అని. అయితే తెనుగు యువతి అరవ యువతికంటె చేష్టల్లోను చిన్నెల్లోను అందెవేసిన చేయి" అని కూడా గమనించ గల్గాను.

కొంతసేపటికి నిద్రాదేవత "ఎంతసేపు వాళ్ళను పరిశీలిస్తావు? నన్ను చూడు!" అన్నట్లు తన యొక్క యత్యంత మైన యౌవన వికారంతో వచ్చి నా మీద పడింది. లోకాన్నంతనూ మరిచిపోయాను.

మళ్ళీ ఏలా మెలకువ వచ్చిందో నాకే విప్పిచెప్పడానికి బోధపడకుండా వుంది.

తెల్లతెల్లాఱుతూంటే తోడి ప్రయాణీకులు నలుగురూ ఒకేచోట "గూడూరు"లో దిగిపోయి యప్పటికప్పుడే ప్లాట్‌ఫారం మీదికి తమ సామాను అంతా దించివేసికొని దిగిపోయినట్లు

తోస్తుంది. వారి సామానుతోపాటు నా పత్రికా, పుష్పమూకూడా ప్లాట్‌ఫారమ్ మీదకు వెళ్ళిపోయినట్లు యగుపిస్తూంది. తెనుగు దంపతులు వారి సామాను కూలీ నెత్తికెక్కించి చడీచప్పుడూ కాకుండా వెళ్ళిపోతున్నారేమో అరవ దంపతులు ఏదో పరస్పరం రహస్య మాడుకుంటూ వున్నారు.

యువతి : ఏమిటి పారేశారు ?

యువకుడు : నిన్నటి దైనిక - నిన్నటి పువ్వు.

యువతి : అవి ఆయనవండీ! మనవి కావు.

.... .... .... .... ....

# ఇది కుర్చీ కాదు గోడకుర్చీ

ఈ రోజుల్లో ఏ సరుకు ఒక నిమిషం "దొరకదు. లేదు" యని అంటే, దాని లేమి చేతనే లోకం అంతా లేనట్టు. తాను లేనట్టు, కొంప మునిగినట్టు, కొట్టుమిట్టాడిపోవడం రివాజు అయిపోయింది. "పంచదారలే" దనండి—" అమ్మమ్మమ్మా పంచదార చిటికెడుంటే విదుపుదురూ పుణ్యముంటుంది," అని రూపాయికాగితం చేత పుచ్చుకు జెండాలా ఎగరేస్తువుంటాడు ఒకానొక వ్యక్తి.

"కాఫీ పొడుంకు కరువొచ్చింది యని అననియ్యండి,— పదిమంది వెనకాతల మనిషీ గిరాఫీలా మెడెత్తి కాఫీపొడరు షాపులోకి తలదూర్చి "అదిగో! ఆడుతున్నారే! అబ్బీ! అబ్బీ! ఆలాపోనియి ఇంటిదగ్గఱ పొయిమీద నీళ్లెట్టు కూర్చున్నారు మావారు.

ఇక్కడ “ మా వారు ” (మగవాని భార్య ఆడది అలి అన్నమాట, డైవోర్సు బిల్లు ఇత్యాదుల్ని యనుసరించి తారు మారయ్యే పదార్థల్లో ఇదొకటి. )

మరిన్నీ ఇంటిల్లిపాదీని. చుట్టూను ; తీరాడబ్బా మూత తీసింది గదా యడుగూ బొడుగూ నోటిలో మృత్తిక మాత్ర మన్నా చేరుకోలేదు. వెంటనే పట్టుకెళ్ళకపోతే అగ్నిహోత్రమే దిగమింగేలాగున్నారు, ఇంటిల్లిపాదీని ! బాబు బాబు బాబు! పౌనిప్పించండి. కాదన్నారా అరపౌను, లేదన్నారా పాతికపౌను, ఆఖరుకు చాలణాదన్నా సరే “ కాఫీ ” అనే పేరుతో చెలామణీ అయ్యేది మాత్రం ఇప్పించండి : నిఖార్సది; ” అంటూ బల్ల మీదరాలే పౌడరు తనపైపున కెగిరేలా నిట్టూర్పుల్ని కుంభించే డో పురుషుడు. అదేవ్యక్తి పురుషుడుగాక పుణ్యస్త్రీ అయివుంటే, పౌడరు కళ్ళనద్దుకు వేతే కాటుకక్కర్లేని పోజు కనపడిచి వుండేది.

ఇంతకూ “కాఫీ” రంగు, “కాఫీ” రంగని ఈ రోజుల్లో యనుకునేది కాటుకరంగుదే యని నా అభిప్రాయం.

రంగు చూచివద్దన్నారా—“ అంగెపో పో ! ఇంగవరాదు” అని ఫక్తు అరవమనిషిలా ఎమ్. ఎఫ్. జి. సి. వాలా నెట్టేస్తాడు.

అటువంటి గలభా, గలాటా, దోసందు మూర్తం చూమకో, “ కలగలపుల రమణయ్య పంతులుగారు ” కాఫీపౌడరు అమ్మే కొట్టులోకి ప్రవేశించాడు. అబలకంటె యబలుడు, తమ మధ్యకంటె తను తరమధ్యవాడు, ఈ కలగలపుల రమణయ్య పంతులుగారన్నాయన !

పంతులుగారిని చూడ్డంతోనే పౌడరు యజమాని— “ పంతులుగారూ ! ఆలాదయచేయండి ఆ కుర్చీమీద ! తమరే

స్వయంగా దయచేసారే ?" అని ఎంతో మన్నించాడు. పంతులుగారుబ్బిపోయి పదిరూపాయలనోటు జేబులోంచి పైకి తీస్తూ "ఒక్క పదిరూపాయల పౌడరు ఈ వేళ ఇప్పిస్తిరా మళ్ళీ పదిరోజుల్దాకా మిమ్మల్ని యడగ ! సరుకు వచ్చినట్టుందే? సరిపడా మనూరికి ?" అన్నారు.

యజమాని మళ్లీ పంతులుగారి వంకగాని, ఆ పది రూపాయలనోటు వంకగాని, చూడక, పాతికపౌను, పాతికపౌను, పొట్లాలుమిగతా వాళ్ళ కూహా పంచిపెట్టేస్తున్నాడు. డబ్బుచ్చుకునే ! ఊరకేకాదు లేండి !

పంతులుగారు మిడుతూ మిడుతూ చూడదొడగేడు. ఒక అరగంటకాచి వేచికొని వుండిపోయినవాడై అక్కడనుండి చేతిలోని పదిరూపాయలనోటు బల్లమీద దేకించడం మొదలు పెట్టాడు.

"చూడండి ! పంతులుగారూ ! అల్లా ఆ ఖరీదు అయిన కాగితాన్ని దేకించారా దాగడుతుంది." అన్నాడు కొట్టు ఆయన.

"కాఫీడాగు ఈ రోజుల్లో డాబేరా" అన్నాడు, పంతులు నవ్వుతూ.

"నవ్వినా లాభంలేదండీ" అన్నాడు యజమాని.

"మళ్లీ ఏడిస్తే వుంటుందా ?" యని అడిగాడు పంతులు.

యజమాని "ఇదేం మిరపకాయగుండకాదు ఏడవడానికి" అన్నాడు.

ఇలా ఇకిలిస్తూ నకిలిస్తూనే, పంతులుతో ఇష్టాగోష్టి నడుపుతూనే మఠోపాతికమందికి పంచి పెట్టించాడు యజమాని— ఈ పర్యాయం అరపౌను పొట్లాలే యన్నిని !

" క్రమంగా వర్థిల్లచేస్తున్నారే పొట్లాం వలం " అన్నాడు పంతులు.

యజమాని " ఆదాకానే అ సరుకు. " అన్నాడు.

" మఱి నా మాట ?''

" మీకూ వస్తుంది ఛాన్సు. తోపుకు ఔన్సు చొప్పున తగ్గి తగ్గి ! ఎంతమందిని తోసుకు ముందుకువచ్చేశారు పంతులుగారూ! తమరు ?'' యని అడిగాడు యజమాని. మహా మహా నిష్పక్ష పాతిలా !

పంతులు రైలుస్టేషనులో బుక్కింగ్ బొర్రికాడన్నా నయం ! యటునుంచి తిరిగిరండి యంటూ ఎర్ర టిక్కట్ కావలిస్తే ఎర్ర టిక్కట్ ఆకుపచ్చ టిక్కట్టు కావలిస్తే ఆకు పచ్చటిక్కట్ యంటూ యడ్డుచెప్పకుండా హెచ్చుతరగతి ఇచ్చే సేస్తారే నాకు ! యని అంటూ పంతులు గుడ్లెర్రచేసుకు గుండె కాయలోనిక్రుర యంతా వెడల గ్రక్కేడు !

యజమాని వెంటనే ఐదు తులాల సరుకు పంతులుకిచ్చి, " తమరు ముందు ఇంటికివెళ్ళి ఒక కప్పుకాఫీ త్రాగి శాంతించి రండి, ఈ లోపున ఈ జనం సర్దుకుంటారు. నేనున్నూ ఒకకప్పు తాగి తయారీగా వుంటాను. తాపీగా కూర్చుని కోపానికి కోపం వెలిబుచ్చుకుందాం ! వాళ్ళందర్నీ నిలబెట్టి మీకు కుర్చీ ఇచ్చాను ! అన్నగోప్యం నిలబెట్టుకోలేని పంతులాంగం ఏం పంతులాంగమో ! పంతులాంగం ?'' యంటూ హేళన చేసేడు.

" ఇది కుర్చీకాదు. గోడకుర్చీ '' అంటూ పంతులు ఐదు తులాల సరుకు చేత పుచ్చుకు " కాఫీ త్రాగివచ్చి వుండి వుంటే వీడిపని వీడబ్బపనీ కూడా పట్టించి వుండేవాణ్ణి ఎంతసేపైనా

అలా కుర్చీమీద కూర్చుండి ! ఇంతసేపూ కూర్చున్నది కుర్చీ కాదు. గోడకుర్చీ ! " అంటూ ఇంకా ఇంకా ఫారమ్ యివుతూ వున్న క్యూవంక చూస్తూ "వీళ్ళందఱివెనక యివితే 2కీ తులాలే!" యని అనుకుంటూ నిష్క్రమించేడు.

ఎవరు ? కలగలపుల రమణయ్యపంతులుగారు ఆయన ఆదాకా కూర్చున్నది కుర్చీకాదు ! గోడకుర్చీ !

.... .... .... .... ....

## క్షౌరకల్యాణంలో కల్యాణం

పల్లెటూళ్ళల్లో పంటలు పచ్చగడ్డి మున్నైనవి ఎంత బాగా ఎదిగి ఏపుగావుంటే యంత మంచిదని ప్రజలు తలపోస్తూ వుంటారు. కాబట్టి యక్కడివాళ్ళకు గడ్డాలు పెరిగినా తలకట్లు పొడుగ్గావున్నా కాతరుచేయరు. తగువులేదు. కాని పట్నవాసాల్లో యందులోను చెన్నపట్నంవంటి మహానగరంలో, నున్నని తార్రోడ్లు, తెల్లైన పింగాణీ గోడలు వున్న రాజధానీ ముఖ్యపట్నంలో ప్రతీ మగ ప్రతీ ఆడా టిప్‌టోగా, ట్రిమ్‌గా వుండాలనే ప్రయత్నం. అల పెంద్రుక లేచిందీ యంటే ఇలా క్షౌరం చేయించుకు తీరాలిసింది వ్యక్తి అయినవాడు ! మఱి ఆడవాళ్ళకు మీసాలూ గడ్డాలూ యుండవుగాక ! అయినా సెలూన్నుమీద "ఫర్ జెంట్స్ అండ్ లేడీస్ " అని వ్రాయబడి వుంటుంది కాబట్టి ఆడవాండ్ల దృష్టి కూడా ఎందుకో అటే ఆకర్షింపబడుతూ వుంటుంది.

ఫాషన్ : మనమంతా ఫాషన్‌కు బానిసలం. ప్రేమకోసం బైరాగులం. అంటే విరాగులం యన్నమాట కాదు. ఒకళ్ళ

నొకళ్ళం ప్రేమముషి అడుక్కునేవాళ్ళమన్నమాట. ఈ ప్రేమ ముషిలో మగవాని నున్నని గడ్డం, నున్నని పెదిమెలు స్త్రీ ఎంతగా కోరుతుందో, స్త్రీయొక్క గేరాగిరజా లంతగా మగవాడు కోరుతూంటాడు ఈ నవనాగరికవాతావరణంలో.

" అదిదా " కారణంగా " వన్ ఫైన్ మార్నింగ్ " ఒకానొక షేవింగ్ సెలూన్‌లోకి "చక్రి" యనే యౌవన బ్రహ్మచారి మొదటిరోజున వెళ్ళాడు. వెళ్ళేముందు బోర్డుమీద " ఫర్ లేడీస్ అండ్ జెంట్సు " అన్నది " చూస్తూ కళ్యాణానికి "ఇంగ" యవకాశం వుంది " యని కూడా అనుకున్నాడు. కాని లోపల ఒక్క జెంటూ లేడు, ఒక్క లేడీ లేదు. సెలూన్ ప్రొప్రయిటర్ ఒక సోఫాకుర్చీలో కూర్చుని వార్తాపత్రిక చదువుకుంటూ ఒక కుట్టి మంగలికి కన్నుగీటాడు. వాడు చక్రిని ఒక పెద్ద అద్దం ఎదుట ఒక ఎత్తు సోఫో కుర్చీమీద కూర్చోపెట్టాడు. చక్రి యొక్క గడ్డానకు సోపూగీపూ రాశాడు. నున్నగా గీశాడు. వాడే చక్రినుండి పావులా వసూలుచేస్తూ పొమ్మన్నాడు. పోతూ చక్రి బోర్డుకేసి చూస్తూ " మతో జెంటూ లేడు, మతో లేడీ లేదే లోన " అని నసుక్కుంటూ వెళ్ళిపోయాడు.

అయినా ఒకనాడు చేయించుకున్న గడ్డం ఎన్నాళ్ళని నున్నగా వుంటుంది. మర్నాడే పెరిగింది చక్రికి గడ్డం చరచరా! మర్నాడూ ఆ సెలూన్‌కే వెళ్ళి చూచాడు " ట్రై ఎగెన్ " అన్నట్టు. ఆనాడు మొదటికుర్చీమీద ఒక జెంట్ కూర్చుని ఉన్నాడు. చక్రికి మొదటరోజున గడ్డం గీసిన కుర్రాడు ఆ జెంట్‌కు నాడు గీస్తూ యున్నాడు. వెంటనే ప్రొప్రయిటరు చక్రికి రెండవకుర్చీ కాపరుస్తూ మతో ఎసిస్టాంటును పురమా

యించాడు. ఆ ఎసిస్టాంటు గబగబా యధాసెలూన్ శాస్త్రీయంగా షేవ్ చేస్తూ చక్రినుండి పావలా వసూలుచేస్తూ చక్రిని "వూడ్చు సామీ" అన్నాడు. చక్రి ఇలా అలా చూస్తూ స్వగతంగా "నో లేడీ ?" యని అనుకుంటూ సైన్‌బోర్డుమీది వ్రాత హోక్సుగా భావించుకుంటూ వెళ్ళిపోయాడు. కాని టౌన్‌లో తిరిగేటప్పుడు కత్తిరింపు జుత్తులున్న మత్తకాశినులు వేనవేలు కానరావడం కద్దు. ఆ ముద్దియలందఱూ తమ తలకట్లెక్కడ డ్రెస్ చేయించుకోవడమా యనేదతని పరిశీలనయిపోయింది ఆ రోజుల్లా. ఆ పరిశీలనలో మధ్యమధ్య ఆశ. మధ్యమధ్య నిరాశ.

మూడవనాడు కూడా ఎప్పట్లాగ తన గడ్డం పెరగడం చేత సెలూనుకు రావడం తప్పిందికాదు చక్రికి. రావడంతోపాటు ఆశ కొనలు సాగడం తప్పిందికాదు.

వింత ! మూడవనాటి యుదయం అప్పటికప్పుడే సెలూన్ ఇద్దఱు జెంట్సుతో నిండివుంది. ఇద్దఱు ఎసిస్టెంట్సు వారితో ఎంగేజీ అయియున్నారు, ప్రొప్రయిటరు సంజ్ఞగా చక్రిని మూడో కుర్చీమీదకు తానే పిల్చి కూర్చోపెట్టి—మఱో ఎసిస్టాంటుకు ఒప్పజెబుతూ "అయ్యర్‌వాళ్ రోజురోజూ దయచేస్తూ ఉండారు. నిండాదయ మామీద" అన్నాడు.

చక్రి అద్దంలో చూచుకుంటూ తదేకదీక్షగా గడ్డంగీయించుకుంటూ ఉన్నాడు. గేటులో ఒక యువతి ప్రవేశమౌతూవున్న షూస్ చప్పుడయింది. ఆ సెలూన్‌లో ఉన్నవి మూడే అద్దాలు, మూడే కుర్చీలు, ప్రొప్రయిటరుకు కంగారెత్తుతూ ఉంది. ఒక్క జెంటూ క్షౌరం అయిపోయినా లేచిపోడే ! అక్కడ కత్తిరించుమని

ఇక్కడ కత్తిరించుమని ఎదో కనుబొమ్మల్లో చెవులచెంతనో చూపించడమే! ఇంకా ఇంకా! చక్రికింకా సగం క్షౌరం అయినా కాలే!

"గుడ్‌మార్నింగ్ మాడెమ్!" అంటూ ప్రొప్రయిటర్ తాను స్వయంగా కత్తిరి సవరించేడు. ఆమెను కూర్చోబెట్టడానికి తావు లేదని లోలో చింతిస్తూన్నట్టు నటిస్తూ. ఆమె "నోమేటర్. ఐ కెన్ స్టేండ్ లైక్ దిస్. వెరీ అర్జంట్" అని తనకుదాను ఆమె—ఏమా చక్రి యదృష్టం!—చక్రి వెనకాల కుర్చీకి యని నిలబడింది. అద్దంలో తన ముఖం ప్రతిఫలించేలా! నడుమ నడుమ చక్రి ముఖబింబంతో కలిసిపోయేలా! ఒరసిపోయేలా! ఏమిటి? ఆమె ప్రతిఫలనం!

ప్రొప్రయిటరు ఆమె వెనుక పొంచుండి ఆమె పొడుగు పాటి జుత్తును గిరిజాల పరిమాణానికి కత్తిరిస్తూ "సారీ! మేడామ్! మిమ్మల్ని నిలబెట్టి కత్తిరించాలసి వచ్చినందుకు విచారిస్తూ ఉన్నాను" అన్నాడు.

"నో మేటర్! ఐ ఏమ్ ఆల్‌రైట్. మాకు ముందు మీసాలు గడ్డాలు వుండవు కాబట్టి ఈ పొసిషన్ ఏ అనుకూలం. వెనక జుత్తే కత్తిరించాలిసింది మాకు. ఇట్ ఈస్ ఆల్‌రైట్" అంది అమ్మందయాన మందస్మితయై, తప్పని సరిగా యలవరకు కొన్న ప్రిల్‌టోనుతో!

చక్రి అద్దంలో సాక్షాత్ క్షౌరకల్యాణం పరవశంగా యనుభోగిస్తూ వెనక్కు తన రెండు చేతులూ మృదువుగా విసరి ఆమె మెడనే దండగా కలిపాడు! "క్షౌరకళ్యాణంలో కళ్యాణం" అన్నట్టు.

.... .... .... .... ....

# జెరూసలెమ్

లోకంలో ఆడామగాభేదం పాటించనటువంటిదీ, కలిమిలేముల వ్యత్యాసం పరిగణించనటువంటిదీ, తెల్లనా నల్లనా కేటాయింపు నెఱుగనటువంటిదీ ఏదైనా వుందా యంటే అదిడీసెల్‌కారు. దానిలో స్త్రీలకు ప్రత్యేకించి యరలేదు. ఒకటి, రెండు, ఇంటర్లులేవు. అమెరికన్‌కూ ఒకలాంటి సీటే, ఆది ఆంధ్రుడికీ ఒకలాంటి సీటే అందఱూ ఒకే గుమ్మంగుండా, ధాన్యం కొట్టో పొయ్యిబడ్డట్టుగా త్రొయ్యబడి త్రోసుకుంటూనో కాసుకొంటూనో నించోవలసిందే.

"మఱి బండిలేదు ఇది తప్పితే! అలా ఎకూ! ఎకు!" యంటూ మిషనరీడేవిడ్ మిసెస్ డేవిడ్‌ను ప్రోత్సహిస్తూ మాస్టర్ డేవిడ్‌ను కిటికీగుండా లోపలున్న హిందువులకు యందిస్తూన్నాడు. మాస్టర్ డేవిడ్ నవ్వుతున్నాడు తనను పైకెత్తి కిటికీలోంచి లోపలకు దించుతూవుంటే; ఎవరో లోపల్నుంచి "గుడ్‌మార్నింగు సర్!" యని అందుకున్నాడ ఓ! మీ రకడున్నారు? లేకుంటే దురదృష్టవంతులిమి." అంట పెద్దడేవిడ్ భార్యా సమేతంగా ఏలాగో వోలాగు ఎట్టకేల. లోపలకు ఎక్కగలిగాడు.—" బయట ప్లాట్‌ఫారముమీద నాకెంత మంది యనుచరులువుంటే ఏంలాభం? లోపల్నుంచి నాబిడ్డణ్ణి యందుకోడానికి లాతిమతస్థుల తోడ్పాటే కావలసివచ్చిందికదా" అన్నసంగతి గ్రహిస్తూ ఆవఱకే జనంతో నిండియున్న ఓబల్ల చివర్ని తాను కూర్చుని ఎదరబల్లమీద తన భార్యను "ఆసీను రాలువుగా" అన్నట్టు చెయ్యివూపి బండి కదలడంలో ఊపిరి బాగా పీల్చుకుంటూ చిన్న డేవిడ్‌ను తన కాళ్ళమధ్యకు తీసుకొని

నిలుపుకొన్నాడు నిలుపుకొని ప్లాట్‌ఫారమ్‌మీది తన యను చరులతో " ఇప్పటికి వెళుతూయున్నాము. మళ్ళీ కొద్ది రోజులలో మనము కలుసుకోగలము " అని దోసిటగుండా యఱచాడు, అమెరిక నాంధ్రోచ్చారణ ప్రచురిస్తూ. దంపతులు తమతమ టోపీలను పైని ఖాళీగాయున్న చిట్టి యటకమీద పడేశారు.

ఉచ్చారణ ఏలావున్నా బాగా తెనుగుతెలిసిన వారేను ఆ దొర దొరసాని యని బండిలో వాళ్ళందఱూ వెంటనే గ్రహించారు. విడ్డూరంగా చూడసాగేరు. చిన్న దేవిడ్ కూడా తెనుగు తనకూ వచ్చునని చూపించేలాగు పపా ! కొంగ ! మమా ! ఆవు !" అంటూ రైలు రోడ్డు కాపక్కా ఈ పక్కా కనిపించే పక్షినో జంతువునో కాపరుస్తూ ఆంధ్రాన్ని ఆనవాలు బట్టేడు. బండి నాలుగుమూలలా పూరా పరిశీలించగలిగింది ఆ చిన్నబిడ్డ దొక్కడే. అతడు తేరిపారనేరని ముఖం లేదు, ముక్కులేదు, కన్నులేదు, కాలులేదు. ఎందాకా ? ఒకానొక వ్యక్తిని "వాడుగో లాజరస్ ! వాడుగో ! లాజరస్" అనేదాకా !

పెద్దదేవిడ్ వెంటనే లాజరస్ యనే ఆ అవతల వ్యక్తిని గుర్తించాడు. " నీవూ మాతోటిపాటు బండిలో ఎకగలిగావు ? మాతో వస్తున్నావు లాజరస్ ! " అని ప్రయాణీకుల పదిపదేను తలకాయల మీదనుంచి వైర్‌లెస్ పోనిచ్చాడు. లాజరస్ " చిత్తం ! సార్ ! చిత్తం !" అనుకుంటూ దొరగారివంకకు గుంపుగుండా చేతుల్తో దారి త్రవ్వుకుంటూ చేరుకున్నాడు. దొరగారు లాజరస్‌ను వీపుమీద తట్టుతూ " మన కన్వెన్షన్‌లో నీవు బాగా మాట్లాడావు ! నీ ఉపన్యాసం బాగుంది !" అన్నారు. దొరసానమ్మగారు లాజరస్‌తో " బాగా మాట్లాడారు మీరు !"

అంది. "ఇదంతా తమరు చెప్పించిన విద్దేనండి" అన్నాడు లాజరస్.

దొరగారు "లాజరస్! రష్—జనసమ్మర్దం బండిలో దళంగావుంది. దిగడంలో చిక్కులేకుండా దింపు మమ్మల్ని" అన్నారు. మాస్టర్ డేవిడ్ వెంటనే "నన్ను లాజరస్ దింప వద్దు. నన్ను ఆయన దింపుతారు నన్నెక్కించిన కిటికీగుండా దింపుతారు" అని ఒకానొక హిందువుణ్ణి యదివఱకు తన్నందు కుని కుశలపఱచిన యతణ్ణి చూపించబోయాడు. ఆ ఒకానొక వ్యక్తి యప్పటికప్పుడే ఎదో క్రితం హాల్టింగువద్ద దిగిపోయేడు. మాస్టర్ డేవిడ్ బిక్కమొగంతో కిటికీ యవతలకు ఊరికే చూడ దొడగేడు తన రెండుకళ్ళూ చెమ్మగిలజేసికొంటూ.

లాజరస్ "మాస్టర్ డేవిడ్‌ను ఎత్తుకుని ఆ కిటికీ యవత లకు చూడ్డంగాదు బిడ్డా! ఈ కిటికీ యవతలకు చూడు" అని జవాబు కిటికీవద్దకు కొంపోతూ "నిన్నిలా ఈ కిటికీలోంచి దింపి విడిచిపెడితే ఎక్కడికి వెడతావో తెలుసునా? మా పల్లెటూరు చేరుకుంటావు! మా వూరికి యడ్డదారి యదేను. అవిగో! యవే మా పొలాలు! ఆ వరిచేనుకోత నేను కోయిస్తూ ఉన్నదే ఆపమను డ్రైవర్ను గాడీ ఆపమను! ఆపు! అపు! ఆపు!" యని అన్నాడు ఏవేవో కనబరుస్తూ. ఆ కుఱ్ఱవాని ముఖమే కాకుండా బండిలో వారి యందఱి ముఖాలూ ఆ వెంపుకు తిరిగాయి. లాజరస్ ఇంకా ఉత్సాహంతో "అదే నా యిల్లు! యదే నా పూరిల్లు. పూరిల్లయినా చూడు ఇక్కడకు స్కాయి స్క్రేపర్‌లా దిజ్మండలం యంటివున్న చూపుతో మెఱసిపోతూ వుంది. కనిపించడంలేదు తండ్రీ! మా ఆనపాదు, చిక్కుడు

పాదు ? నాయింటికి ఎప్పుడువస్తావు నీవు ! ఎప్పుడు వస్తారు మీ పపా ; మీ మమా ! ఎందుకు వస్తారు ?" అని నిరాశా విహ్వాలుడై డేవిడ్ కిశోరుని చిబుకం ముద్దెట్టుకున్నాడు.

"అయితే యదేనా మీవూరికి దారి ?" అన్నాడు మిస్టర్ డేవిడ్ లాజరస్‌తో. "చిత్తం! రైలుగట్టునుంచి యడ్డదారి— తమరోతూరి దయచెయ్యాలి" అన్నాడు లాజరస్. "అయితే మీరు పై స్టేషనులో దిగుతారు" యంది దొరసానమ్మగారు. "అవును తల్లీ ! దిగి వెనక్కువస్తాం ! యదిగో స్టేషన్" యంటూ మాస్టర్ డేవిడ్‌ను ఆమెకు అందిచ్చాడు.

మాస్టర్ డేవిడ్ కొంచెం మొగంవంచుకు కించబడ్డాడు. లాజరస్ "సెలవు" యభినయిస్తూవుంటే దొరసానమ్మగారు కొడుకును చేరదీసుకొంటూ "గుడ్‌బై లాజరస్" అంది. అని పిల్లవానితో "మనం రేపు అమెరికా వెడతాం ! నేడు లాజరస్ వాళ్ళవూరు వెడుతూ ఉన్నట్టే మనం రేపు అమెరికా వెడతాం ! నీవు ఏడవకూడదు. "నానీ" డియర్ అంది.

మాస్టర్ డేవిడ్ "అడ్డదారిని వెళ్ళాలి !" అన్నాడు. ఆలా లాజరస్ చూపిన దారివంక జూస్తూ. ఆ కుఱ్ఱవాని చూపు కనిపెట్టకుండానే మిస్టర్ డేవిడ్ యడ్డదారినే జెరూసలమ్‌గుండా!" అని పంట్లాం జేబులోంచి బైబిలు చిన్నిపొత్తం చూస్తూ పెలస్టయిన్ పటంవున్న పుట తెఱిచాడు. ఆ పుటలోంచి ఒక రూపాయి నోటు ఇవతలకు పడింది.

లాజరస్ యప్పుడే గాడీదిగి వెనక్కు రైలుగట్టే యరవై గజాలు నడచి యడ్డదారి పుచ్చుకు విస్పష్టంగా గోచరిస్తున్నాడు తుమ్మల్లో పొద్దు కూకిస్తూ. మాస్టర్ డేవిడ్ "మామా ;

లాజరస్ ఊరుపేరు ?" అన్నాడు. మిస్టర్ డేవిడ్ రూపాయి నోటు తిరిగి బైబిలు పటపు పుటలో సర్దుతూ "ఈ రూపాయి నోటు క్రింద వుంది లాజరస్ వూరుపేరు, చదువు" అన్నాడు. పిల్లవాడు రూపాయినోటు తాను తీసికొంటూ పాలెస్టయిన్ పటం చూస్తూ "జెరూసలెమ్" అని చదివాడు.

మిసెస్ డేవిడ్ చిరునవ్వు నవ్వింది. మిస్టర్ డేవిడ్ "వచ్చాం" అని తనటోపీ ధరించుకుంటూ భార్యాటోపీకూడా తానే తీసి ఆమె నెత్తిమీద వుంచాడు.

మిసెస్ డేవిడ్ "క్యూ" అంది. మిస్టర్ డేవిడ్ రూపాయి నోటు ఆమె కళ్ళమీద వుంచి "జెరూసలెమ్" అన్నాడు. మిసెస్ డేవిడ్ "ఐ ? మై ఐ ? క్యూ" అంది.

.... .... .... .... ....

# మా కెప్పుడూ స్వరాజ్యమే

నదికి వఱద కొత్తగా వచ్చింది. అద్దరినీ ఇద్దరినీ కూడా నవ్యత హెచ్చింది. గట్టనే పచ్చని పచ్చిక మొలిచింది. వాలునే కంప, "కర్ర" తొడుసు చొప్ప కొట్టుకొనివచ్చి యదోమాదిరి అంచు కట్టులా యమరివుంది. గోధుంవన్నె త్రాచులా యతిరాజసంగా నడుస్తూవుంది నీరు. ఆ నదిమీద పడపే దిగాడో అర్ధరాత్రి, లేక అమరనదీలోయం నుండి ఊడిపడ్డాడో, తెల్లవారేసరికి ఒక కోయపురుషుడు ఒడ్డునే కనబడసాగాడు. తనదే ఆ ప్రవాహం యన్నట్టు తనివిదీఱ స్నానంచేసి, ఒక నల్లనికంబళిగుడ్డ పుట్ట

గోచీ పెట్టుకొని, వాలంలా వెనక్కు వదిలేసి, ఒడలుతుడుచుకు గట్టెక్కి నిలుచుండి, అక్కడే మొలిచి ముదిఅయిన ఒకానొక నల్లని పెద్ద తాడిచెట్టువంక చూస్తూ విస్తుపోతున్నాడు.

అడవి మనిషికీ పట్నంలోని ఈ తాటిచెట్టంటే ఇంత వింత ఏమాయని ఆలోచించసాగాను నేను.

" దొరా " యని పిలిచాడు నన్ను. " చూశావా ! దొరా ;" అన్నాడు. " ఏమిటి ?" అన్నాను. " ఆ తాటిచెట్టుని ఆ నల్లటి తాటిపండును " అన్నాడు. "ఒకటేం చాలా ఉన్నాయి" యన్నాను నేను. అన్నింటిలోకి పెద్దది పక్వానికి వచ్చిందీ దాన్ని !" యన్నాడు, "ఆఁ చూచాను" యన్నాను. "నన్ను చూచావా ?" అన్నాడు.

అప్పుడుగాని నేను వాని నఖశిఖ పర్యంతం చూడలేదు. మనిషి ఎల్లాయున్నాడూ ?—జగజెట్టిలా కన్ను చెదరిపోయేలా, పిక్కలూ, తొడలూ, తొమ్ము, జబ్బలూ, మెడగుళ్ళూ, వెన్ను పట్టీ, యతడూ బలే బలిష్టునిగా దోచేడు. వానిముందు ఆ తాటి చెట్టు ఏపాటిది యన్నట్టుగా ఉన్నాడు. " చూడుదొరా ! " అన్నాడు. చూస్తున్నాను. "ఈ దండతో ఆ తాటిని తాకి ఆ తాటి పండును నేలకు పడగొట్టమంటావా ?" అన్నాడు. " పడగొట్ట డంలో ప్రజ్ఞ ఏముంది ? పండి పక్వానికివస్తే కాకతాళీయం యన్నట్టు, కాకివాలితేనే పడిపోగలదు తాళఫలం " యన్నాను. నేను, "అదికాదు చూడుదొరా !" యన్నాడు. అని ఒక తాకు తాకి తాటిపండు నేలకు పడేలోపున దోసిట పండు పట్టాడు! దాన్ని. నేలనుపడి కూడా ! పండు పట్టాడు. నేనేకాకుండా యప్పటికప్పుడే యక్కడ మూగిన ముప్పై నలభై మంది జనంకూడా చూచారు. నివ్వెరపోయారు యావన్మందినీ.

పండక్కడపారేసి, కోయదొర, వారెవరివంకా మఱి చూడకుండా, యతిరాజసంగా వెన్ను విరుచుకొని, బుజాన్ని తన సంచీ తగిలించుకుని, సంచీలోంచి నెమలికుంచె, అమ్ములు, ఇలాంటి సామగ్రి కొంతకొంత తొంగిచూస్తూంటే యడుగులు కొల్చుకుంటూ నడువ సాగాడు పూరావేషం ఎక్కడనో వేసికొనే తలంపుతో. ప్రజలు మఱి అతణ్ణి వెంటాడించడానికి జడిసి పోయారు. " ఈ కోయదొరనిన్న సాయంత్రానికి లేనివాడు ఈ పొద్దెక్కడనుండి దిగాడు ? పడవా కానం, పాదం కానం !" యని అనుకోసాగారు.

ఆ తాటిపండును ముట్టి పైకెత్తడానికి బ్రాహ్మణులు భయపడ్డారు. క్షత్రియులు బెదరిపోయారు. వైశ్యులు వెఱిచారు. శూద్రులు చూచి చూచి శంకించారు.

ఒక హరిజన యువతిమాత్రం, తాటి చేవకంటె నల్లటిది, చేవతాడికంటె దృఢమైంది, " మీకందరికీ యంత పిరికితనం ఐతే నేను పట్టుకుపోతాను " యని దాన్ని తన నల్లటి కుండలో పెట్టుకుని, వఱద వద్దకు తీసికొనివెళ్ళి, బాడి బత్రూ కడిగివేసి. నిండుకుండ నెత్తునెట్టుకు పండు ఒకచేత్తో పైకెత్తి మోచుకుంటూ ఉండుండి రెండో చేతిలోకి మార్చుకుంటూ. ఈవైపు ఆవైపు దిక్కులు చూడ్డానికైనా మెడస్వాధీనం లేనిదై తనవాడకు వెళ్ళింది.

హరిజనవాడ యంటే వేఱే వర్ణించనక్కరలేదు. ఎక్కడ లేని చెట్లు, ఎక్కడలేని పాదులు వాళ్ళ గూడెంలోనే ఏపుగా పెరుగుతాయి. విరివిగా ఉన్నాయి. సందడికూడా హెచ్చు యక్కడే. డప్పుల కాకల కాడనుంచి తప్పులుకట్టేటప్పటి తీర్పు కేకలుదాకా ఆ వాడ ననవరతం మాఱుమోగి పోతూవుంటాయి.

ఒక ముసిలిమాలెత, ఈ యువతిచేతిలోని తాటిపండు చూస్తూ "పడిందంటే ఈ పొద్దు?" అంది. "నీ వెరుగుదువే ఆ తాడి" యని యువతి తన ముక్కునయున్న ఒక మూడు పొళ్ళ పుడకను మెఱయిస్తూ, అడిగింది. "నాకు తెలవక పోవ డం ఏమిటి? ఆ చెట్టుకంటె ముందు పుట్టినదాన్ని! నే తిని పారేసిన టెంకను బయలుదేఱిన తాడికాదే! అది!" అని రెచ్చిపోయింది, తిరిగి యవ్వనం వచ్చిన దానిలా.

అంతట్లో ఆ వెలివాడకు, వెనుకటికోయ దొర నిండు వేషంవేసుకు యడుగులు కొల్చుకుంటూ వెళ్ళాడు. "యయ్యో ఈ పండు చెట్టునుండి పడగొట్టింది ఈ పొద్దు!" అంది యువతి ముసిల్దానితో—ముసిల్ది "ఆడికేం పొయ్యేకాలం వచ్చింది. ఆడికేం వినాశకాలం వచ్చింది. ఆ కాలంలో రాలగొట్టాడే కాయను." అని తూర్పార బోయసాగింది. కోయదొర యతిశాంతంగా యంగలు లెక్కగా నడుస్తూ, తన యమ్ములపొదిలోంచి ఒక అమ్ముతీసి సంధించి యువతి చేతిలోని తాటిపండును గురిచూచి కొట్టాడు. పండు వెళ్ళి ముసిల్దాని పాదాలదగ్గఱ వాలింది. ముసిల్దిది వెంటనే చేటంత ముఖం చేసికొని, "నా పాలిట శ్రీమన్నారాయణమూర్తి వున్నాడు. నన్ను రక్షించాడు. నాముది తాడియొక్క మూడు టెంకల ముద్దులపండును నాకు దక్కించాడు" అంటూ ఆ పండును తన గుడిసెలోనికి తీసికొని వెళ్ళింది.

యువతి కోయదొర వంకకు తిరిగిచూచింది—"స్వరాజ్యం వచ్చింది అనానీమిడిసిపాటు?" అని కొఱకొఱలాడింది. కోయ దొర "మా కెప్పుడూ స్వరాజ్యమే" అంటూ బారెడుబారెడు ఎడంలో మడమలు ఆన్చుకుంటూ అతి దర్జాగా నడచిపోసాగాడు-

యువతి మఱి మాట్లాడితే తననెత్తిమీది కుండకే మోసంరాగల దని తిన్నగా తన గుడిసెలోనికి దూరిపోయింది.

ముసిల్ది ఆ తాటిపండును తన గుడిసెలో ఉట్టిమీద చట్టిలో పెట్టింది. క్రమంగా వెచ్చనన్నం వండుకునే వేళప్పుడు కాల్చుకు తిందామనో ఏమో? పొయి రాజేస్తూవుంది—పొయిరాజేలోగా ఉట్టిమీద చట్టిలో చంటిపిల్లాడి ఏడుపులాగు కుంయి కుంయి, కేరు కేరు; చప్పుడయింది.

ముసిల్ది చట్టిదింపిచూస్తే తాడిపండు చట్టిలో లేదు. తాటి పండంత తలకాయ, అంతనలుపు గల పసిపాప తొణికిసలాడ జొచ్చాడు—అదేం విడ్డూరమోనని యువతిని "ఓలమ్మో!" అని కూకేసింది. యువతి తన గుడిసెలో ఆసమయానికి ఇందుప కాయ యరగదీస్తూ ఆ జిగురుకుండలో త్రిప్పుతూ, చేతికేవో తగిల్తే పయికితీసిచూస్తూవుంది. ఒకటొకటిగా—మూడు తాటి టెంకలు! పీచూపిచీ యన్నీ ఊడదీసి పారేసిన బోడిటెంకలు! పైకి చేతిలోకి వచ్చినాయి—"ఇదేం! విడ్డూరమే ఓలమ్మో!" అంటూ యది యివలకు వచ్చి ముసిల్దాన్ని కేకేసింది——

"ఈ పిల్లడు నీ పిల్లడంటే?" యని అంటూ ముసిల్ది తన గుడిసెనుంచి శిశువును యివలకు తీసికొనివచ్చి చూపింది—"పండుతిని ఈ టెంకలు నా గుడిసెలో పడేశావంటే?" అంటూ యువతి ముసిల్దానిమీదకు గిరాటేసింది—గిరాటేసిన పళంగాం ముసిల్దాని చేతిలోని శిశువు నోరుతెరిచాడు—మూడు టెంకలూ ఒకదాని వెనుకనొకటి ఆ శిశువు కుక్షిలో పడిపోయినాయి—అమాంతంగా శిశువు తాటిపండై దొర్లుకుంటూ దొర్లుకుంటూ, ఏ తాటిచెట్టునుండి రాలగొట్టబడిందో ఆ తాటిచెట్టు మువ్వకంటా ఎగసి అంటిపెట్టుకూరుకుంది ఎప్పట్లా——

ఊరంతా కనుగొన్నారు ఆ వింతను యతివింతగా మహా వింతగా! ఊరంతా గాలించారు ఆ కోయదొరకోసం— "మాకెప్పుడు స్వరాజ్యమే!" అన్నవాని యూసుయొక్క ఎదిరియులివు తప్పిస్తే, మఱి దాని యజాలేదు పజాలేదు ఎటు చూచినా ఎంతవెదకినా!

కోయదొర యంతచేటు మటుమాయమై చన్నాగానీ, "యువతిది తప్పా? ముత్తవ్వదితప్పా?" అని చెట్టుక్రింద విచారణమాత్రం ఆ హరిజనవాడలో ఇప్పటికీతప్పలే! తాటిచెట్టు ఆకులు టపటప కొట్టుకోడం మానలే!

.... .... .... .... ....

## సముద్రమ్మీద పెద్దనీడ

"ఓడకంటె ఘనమైనదిగా దోచెన్
నీడ! ఆ నీడ! నీటిమీద నీడ!
మున్నీటిమీద నీడ?—
నా నీడ కాదు చూడ,
నీ నీడ కాదుకూడ
మేడ నీడ కాదు,
చేదె నీడ కాదు,
మేడమీద చేదెదేమొ?
కాదు! కాదు!"

ఇలాగ్గా తలపోస్తూ దిక్కులన్నీ కలయజూచాను. తుద కాకాశ మ్మీద కానగల్గాను. కాదంబినీమాల నొకదాన్ని. మేఘం పట్నం మీద నుంది. నీడ సముద్రంమీద నుంది. నీడపట్టు, మేఘంపట్టు తప్పిస్తే, మిగతా ఆకాశంమిగతా అవని సమస్తం సవితృతేజాన్ని విరాజిల్లుతూన్నాయి.

సముద్రంమీద నౌకానౌక మహత్తరమైన దృశ్యంగా ఆ నీడను, ఆకాశమ్మీద నౌకానౌక మహత్తరమైన దృశ్యంగా ఆ మేఘాన్ని, పరిగణిస్తూ, తీరాన్నే నిలుచుండిపోయాను కొన్ని నిమిషాలు ఒక ప్రొద్దున్నప్పుడు. అలలమీద ఆ చాయ అవతరించి ఈదులాడుతూన్నట్టుంది. దానికో ప్రత్యేకత, పరమావధి ఉన్నట్టగపించింది. పరిబంధన మేమాత్రంకూడా లేనట్టుగా పొడగట్టింది. మేఘమేమన్నా పట్నంమీద నుంది. నీడేమన్నా మహా సముద్రంమీద నడాడుతూవుంది. నీడను నడిపించేది ఆ మేఘము కాదేమో అన్నంత స్వేచ్ఛగా అల్లలాడిపోతూవుంది ఆ నీడ ! ఆ మేఘం ఒకవేళ వర్షించినా వానచినుకులన్నీ పట్నంమీదనే పడతాయిగాని ఆ నీడను లాగిపట్టి, అరికట్టబోవు ! ఆ నీడ మఱో మేఘానిదేమో అని యనుకోడానికి ఆకాశమ్మీద మఱో మేఘమే లేదు ఆ వొక్క మేఘాన్ని తప్పిస్తే. పోనీ మఱో పదార్థానిదేమో అంటే, పక్షి అన్నా ఎగరడంలేదు, పయోధిమీదగాని, వీధిగుండాగాని, మేఘంయొక్క ప్రకృతిని తప్పిస్తే ఆ నీడయొక్క ప్రాదుర్భావానికి మఱో హేతువు కానరాకుండా వుంది. ఆ నీడే వాలకపోతే సముద్రము నా దెంత అయోమయంగా కాపడియుండేదో నా దృష్టికి. అదో వ్రాత, అదో తెలుపుడు. అని అనజేసింది నా చేత !

"ఏంటుండి చూస్తున్నారు విడ్డూరంగా ! నీటి మీద ?" అని ఎటకరించినట్టడిగింది దారేపోయే ఒక మిటారి మిన్న. "ఏం లేదు నీడ వల విసిరేను" అన్నాను. "నీడ వల అహహా !" అని నవ్వింది. ఆ నవ్వులో ఆమె నఖశిఖపర్యంతం చూచాను. నల్లని యొడళ్ళు, నవకమెటిగిన కళ్ళు, చవగ్గా

అప్పుడే కొన్న కూరదాక, దాకలో గుప్పెడు నీరుల్లిపాయలు, అదీ సంతనుండి తిరిగివచ్చే పెడికీల నెరజాణగా తోచింది.

"అదేంటుండీ ! నావంక అంత విడ్డూరంగా చూస్తున్నారు ?" అని అడిగింది. "నీ వొళ్ళు నీ కళ్ళు" అని జారుడిలా సూటిగా జవాబు చెప్పాను. "నా వొళ్ళు నా కళ్ళు ? మీ కంటి కెలా కనిపిస్తున్నాయి ఏంటి ?" అని రెచ్చిపోతూ అడిగింది.

నేను మాత్రం మఱి సరాగం ముదరనీక ఆధ్యాత్మంలో పడిపోతూ, "నీ ఆత్మ నవ్విన వెలుగునే నిలువునా నీవు. నీ ఆత్మయొక్క నీడలా కనిపిస్తున్నావు, అమ్మ ! తెలిసిందా ?" అన్నాను. మరెక్కడో నీడల రాయళ్ళల్లే కాపడుతున్నారు— నాకిప్పుడు ఆకలి తప్పిస్తే మఱొకటి లేదు. మీరేంటో ఆత్మ అంటారు. ఈ దాకలో పోపేసుకునేదాకా నాకు మఱొకటి తోచదు. మీకన్నీ విడ్డూరాలే తోస్తాయి" అంటూ చక్కా పోయింది ఆ జవ్వని.

మేఘం నవనీతంలా కరిగిపోతూ మాయమైంది. ఎండ విప్పారింది. ఎటుచూచిన ఎండే. నడక తప్పిన కొండమీదా ఎండే. నడుస్తూవున్న ఓడ కొయ్యనూ ఎండే ! ఎండలో సమస్తం అతి విస్పష్టంగా, నీటిమీద వస్తువులు, నీటివోరే జరిగే వృత్తాంతాలు, నిడివిగా ఎదిగి నిలబడ్డట్టు కనబడే నగర హర్మ్యపరి నందగించే కాంతలయొక్క కుటిలకుంతలాలు అన్నీ అతి స్పష్టంగా వెల్లడిపడి తెల్లమౌతూవున్నాయి.

పల్లె జవ్వని ఏమన్నా నన్ను వదలి వెళ్ళిందై అంత దూరాన్ని ఆ తీరమందే నిలుచుండి తన చేతిలోని కొత్తగా

కొనుక్కున్న కూరదాకను వారాసిమీదకు నే చూస్తూవుండగానే గిరాటేసింది. గబగబా పరుగెత్తుకుని వెళ్ళి "ఏం పని అది? నిక్షేపంవంటి కూరదాకను కొనుక్కున్నదానివి. కూర పోపెట్టుకోవాలని ఉబలాటపడ్డదానివి, అలా ఎందుకు గిరాటేసినావు?" యని అడుగుదామని యనుకున్నాను: కాని దాని ముదలకింపు స్వభావం యదివఱకే ఎరిగున్న కారణంగా, అటు చనక, ఆ తేల్తూ మునుగుతూ ఒడ్డును తాకుతూ, తిరిగి నీటిలోపలకు దాకుడుండి పోతూవున్న దాక దృశ్యాన్నిమట్టుకే పరికిస్తూ ఉండిపోయాను.

అంతట్లోనే యటువెంపునుంచి షికారుగా కాలినడకను వస్తూవున్న ఒక నవనాగరికపు జవరాలు నన్ను తనకుతానే ఎఱుకపఱుచుకునే మెలికచూపులతో తొ_ల్తి చూచిందై, వెంటనే పలకరిస్తూ "ఆమె ఆ దాకను అలా ఎందుకు విసిరిందో మీరు గ్రహించారా?" యని అడిగింది. అదివఱకూ లోకానికి నేను మిక్కిలీ లాతివాణ్ణేమో యని యనుకొన్నంత వింతగా నిల్చున్న వాణ్ణీని, ఆమె పలుకరింపుతో భూలోకవాసినై భూలోకవాసినే కాకుండా వర్తమానయుగమునందలి వాసిగానే నన్ను నేను భావించుకుంటూ—"నమస్తే! మీరేమైనా గ్రహించివుంటే ఈ దాసుడు వినగోరుతున్నాడు" అన్నాను. "నా మేధాశక్తి యంతటిది కాదు కనుకనే తమర్ని యడగడం జరిగింది" అంది. "అవితే ఇద్దఱం ఒక మట్టాన్నే యున్నాము, ఆసీనులమై కొంత సేపు పరకాయించి చూదాం! ఇద్దటి బుద్ధులూ కలిపి ఆలోచిస్తే ఏమైనా ఆ పల్లె జవ్వని యుల్లం తెలియవస్తుందేమో" అన్నాను "పోనీ! ఒకడుగు అలా వెళ్ళి ఆమెను కనుక్కొని రాకూడదూ

మనమిద్దఱం !" అంది తెనుగుమీఱి కన్పడుతూయున్న అమ్మ ద్దియ. "అలాగే చేయవచ్చును" యంటూ ఆమె ముందూ నేను వెనక కొంతదవ్వు, ఇద్దఱం ఒకళ్ళ ప్రక్క నొకళ్ళం కొంత దవ్వు, నేను ముందూ ఆమె వెనుకా కొంతదవ్వు, ఈలా పదడుగులనుకోండి లేక పాతికడుగులనుకోండి, యటువంటప్పుడు దూరం నేరడం కష్టం—కలిసీ నడిచాం, కలియకా నడిచాం !

అంతలో పల్లెజవ్వని తిరోహిత అయింది, పారంమీద లేనేలేదు. నీరంమీదనూ లేదు. నీరంమీద మాత్రం దాక వొక్కచే నల్లని జుత్తు పుట్టలా ఎగిసెగిసి పడుతూవుంది.

తీరాన్నివున్న ఇద్దఱమూ ఈ చదువుకున్న వాళ్ళం, ఒకళ్ళ వంక నొకళ్ళం తెలియని చూపులు కొంతసేపు. తెలిసీ తెలియని చూపులు కొంతసేపూ, చూచుకున్నవాళ్ళమై—" ఆమె మత్స్యగంధిలా మాయమైందే" అని ఒకళ్ళం అంటే "అట్లా యవితే యోజనగంధియై యీ చుట్టు ప్రక్కల్నే ఉందేమో" అని మఱొకళ్ళం !—ఏలాగవుతేం చివరకు పర్యవసానం ఒక్కటే! దశదిశలూ కలియచూచాం, నరుల సంచారం లేదు. అమరుల సంచారం లేదు. ఎండమాత్రం తీవ్రతరం అయిపోతూవుంది. నాకూడా ఉన్న నాగరీకాంగన నుదుటిమీద యప్పుడే చిఱు చెమ్మటలు క్రమ్ముతూ వున్నాయి.

"మనం ఇటూ యటూ చూడ్డంలో ఆ పల్లెది తానుకూడా సముద్రంలో పడిపోయివుంటుంది" యని అన్నాను నేను గద్గదికంగా, "ఆత్మహత్య చేసికొనే స్వభావంగలదానిగా నాకు తోచలేదు దాని వైఖరి చూస్తే! అట్లాడుకునే అమాయకు రాలిగా దోచిందిగాని" అంది ఆ నాకూడా ఉన్న ఆమె

"లోకంలో చావు ఆట కాకూడదా ?" అన్నాను నేను, అభిజ్ఞ నిరుత్తరగా నిలుచుండిపోయి. వొడ్డుకు కొట్టుకొస్తూవున్న దాక నింకా కంటూవుంది——

దాకనష్టే తన గాజుల చేత్తో ఎత్తిపట్టుకొన్నదై పల్లె యిల్లాలు—అమ్మయ్యో ఘాతంలా, బూచిలా, తల విడిపోయి, మొల తడిసి, జిల జిలా పయికి నడచివచ్చింది.

ఆమెను వెంటనే ఈమె పలుకరిస్తూ "అంత తెగువ సెల్లునటే ?" యని అడిగింది, "తెగువేంటి ? అయనగారు నీడ విసిరి ఆడేరు గందా యని నేను దాక విసిరిచూచాను, మఱి విసిరినాక దాకెక్కడ పగిలిపోతుందో యని నేనే దూకాను. అంతే !" అంది పల్లెది జవాబుగా. "దాక గట్టిగా ఉందా ? నా నీడ గట్టిగా ఉందా ?" యని అడిగాను నేను. "మీ నీడ మఱి కానరాలేదు నాకు, కాని నా దాక అమ్మట్టునే ఉంది. ఇదుగో ! ఇదెందుకు పగుల్తుంది ? ముమ్మారు నడివేలి కణుపుతో మోగించి మఱి చూచి కొనుక్కొన్నాను. నా దాకెన్నటికీ పగలదు. ఇఖసలే పగలదు. చూచారుగాదూ మీరిద్దఱూ యిది నీట దేలి ఇసకనేసుకు కొట్టుకోవడం ?" యంది అత్యాశ్చర్య పోతూ ఆ జాలారివనిత. అంటూ వెళ్ళిపోతూంది. "బతికింది అది మన కళ్ళముందు చావకుండాను" యని బిగ్గరగా అను కొన్నాము దగ్గఱగా చేరుకుంటూ అక్కడ నున్న తక్కిన యిద్దఱమూను.

ఆ మాటలో వెనక్కి తిరిగిచూచిందై ఆ పల్లెజవ్వని "ఆయుర్దాయము దేవుడిచ్చినంత కాలం ఉండక తప్పదు మనకూ మన దాకలకూ !" యంటూ మహాసముద్రంవంకకు

చూస్తూ " మేఘాంది కాబోసు మీరు చూచిన నీడ, మీరు విసిరిందన్నారు! విసిరిన వల అన్నారు! నన్ను మోసపుచ్చారు! మాం మేఘాల్లో మెఱపులే చూచాం కాని మేఘాలుపఱచే నీడలు ఎరుగబోం!" అంది తెల్లగా! " మెఱపులు ముందునీడలు?" అంది నాగరీకురాలు తన ఎఱ్ఱటి పెదవులు నా వెంపుకు త్రిప్పుతూ, " మేమే! మనమే! నా నల్లటియొళ్ళు చీకట్లో కానలేడు నా మొగుడు. మెఱపులో జిగాల్‌మంటానంట!" అంది చిరునవ్వు నవ్వుతూ ఆ జానపదస్త్రీ, చిరునవ్వుతోనే తన పల్లెను చేరుకుంది ఆమె—

మే మిద్దఱం, మిగిలిపోయిన నవనాగరీకుల మిద్దఱం చెరోవైపుకు

" నా కళ్ళు మెఱపులో - నీవేను నీడవు!"

అని యనుకొంటూ వెనుచూపులు చూచుకుంటూ విడిపోయాము.

.... .... .... .... ....

## మాయంగాక మరేమిటది?

పాలకు ధర పెరిగింది. ఆ రోజుల్లోనే అలకూ ధర పెరిగింది. అందఱూ కాఫీ ఇత్యాది పానీయాలు పీకమొయ్యా త్రాగడంవల్ల ఎక్కడ ఉన్నపాలు ఆటీవికావు. ఎంతధర పడితే యంత ధరాపెట్టి కొనుక్కుపొయ్యేవారు మఱి మిలిటరీ వాండ్లకు ఆహారసరఫరాగా ఏ మాంసం పడితే ఆ మాంసమే సంగ్రహింపబడుతూవచ్చేదేమో, గోమాంసంకుకూడా విలవ పెరిగిపోయింది.

కాని, కృత్తికయ్య కృత్తికయ్య—అని ఒక మనిషిపేరు, బహుశా కృత్తిక నక్షత్రాన్ని పుట్టి వుంటాడు—అతని కుటుంబం వారు ఆదాకా ఆవును పోషించడమే ఎరుగుదురు. గోహత్యా పాతకం ఎఱుగరు.

కృత్తికయ్య కుటుంబం అంతా పోగుచేస్తే ముగ్గురూ—— తనూ, తన పడుచుపెళ్ళాం, తన ముసిలితల్లి—అతను ఆవును తోలుకెళ్ళి మేపుకొచ్చేవాడు, అతనిపెళ్ళాం పాలుపితికేది. అతని తల్లి దోర్రంగుమీగడ, బిర్రబిగువు పెరుగ్గడ్డ, చుర్రుమనే హాయంగవీనం, ఒకటేమిటి ఆవుపాలనుండి తయారయ్యే ప్రతీ సామగ్రీ అమ్మి సొమ్ముచేసేది. ఇదంతా—వారున్నది పట్నవాస మేమో, ఆ రోజుల్లో మరి లాభసాటవగా యుండేది. శేరు రూపాయ రూపాయిన్నరకూడాను వారింటి పాలధర.

ఉన్న దొక్క—అవైనా కామధేనువులాంటిదని యందరూ చెప్పుకొనేవారు, దాని నీడను నించుంటేనే చాలు ఒంటిడు పాపాలూ పోతాయి యని అనుకొనేవారు ప్రజలు. అటువంటి అవు అది ! అవుకు తగిన దూడకూడా వుండేది.

ఈ పాలవర్తకంవల్ల కృత్తికయ్యకు కుటుంబపోషణ నిరాటంకంగా జరిగిపోవడమే కాకుండా రోజూ ఒకవరహా మిగుల్తూండేది. కృత్తికయ్య పెళ్ళాం కొత్తకోకలు, రోజుకొక కోక, కొనుక్కోవడంతో ప్రారంభించి, తన నవనాగరికత, క్రమంగా తలలో పువ్వులు పాకించుకోవడం కాడికి పెంచి, నవ్వుతూ కెవ్వుతూ సినీమాలకు వెళ్ళడం రూపేణా పెంపొందించింది, మరి పైపెట్టు, మగనిని మంచి కాసులపేరు చేయించ మనడమే ! చేయించాడుకూడాను కృత్తికయ్య ఒకటోరకం కట్టడప్పేరు, పచ్చుటి మెఱుగెట్టించి.

ఏ సాయంత్రం, పేరు, తయారై వచ్చిందో ఆ సాయంత్రమే, పేరు, అలా మెళ్లో వేసుకొని, ఓరపయటగా, కృత్తికయ్య పెళ్ళాం వాళ్ళ ఆవు దగ్గఱ కెళ్ళింది. దూడను చేపొదిలి, ఆవుముందు కూర్చుంది, ఆ ఎమ్మెలాడి. ఆవు అట్టే—ఎప్పుడూ లేంది—కొమ్ము విసిరింది. కూలబడి పోయింది నెత్తురు కక్కుకుంటూ ఆ చక్కని చుక్క. కృత్తికయ్యతల్లి ముసిల్ది, ఇంట్లో నుంచి ఇవలకు వచ్చి, కోడల్ని లేవనెత్తి లోపలకు తీసికొని వెళ్ళి, మంచంమీద పరుండబెట్టి, "ఆవు బెదిరే ఆభరణ మెందుకే ? చేయించేదాకా వేపుకుతిన్నావు కట్టునాగమ్మని." అని ఆ కాసులపేరు తాను తీసిపుచ్చుకొని, గోడకు తగిలించింది.

కృత్తికయ్య ఒక కంటితో భార్యను ఆవుకుమ్మడం చూస్తూ, రెండోకంటితో, ఆ వెంటనే వీధిని పోతూవున్న మిలిటరీలారీకి సైగచేశాడు. "మా ఆవు పోటుమఱిగింది" అంటూ వాళ్ళకు ఆ మిలిటరీలకు మూడువందల రూపాయలకు అమ్మిపారేశాడు ; వాండ్లున్నూ, డబ్బు కృత్తికయ్య చేతిలో యక్కడికక్కడ లెక్కెట్టిపోసి, దౌర్జన్యంగా దూడసమేతం ఆవును—గోమాతను కాళ్ళు ముట్టీ కలగట్టి లారీలో పడేసుకొంటూ పోయారు. ఇంటిల్లిపాదీ ఒక్కసారి లబోమన్నా మఱి లాభం లేకపోయింది. వాండ్లు, ఆ మిలిటరీ వాండ్లు ఆ లారీని మఱి ఆపితే వొట్టు.

ఆ రాత్రి కృత్తికయ్య ఇంట ఎటుచూచినా కీడే. అప రేత్రికి గోడను కాసులపేరుకు బదులు, ఎముకలదండ, ఆవు ఎముకలదండ ! దండకు ఒకప్రక్క "కడుపుకన్నం" యని అక్షరాలు, అక్షరాలక్రింద నిజంగా పెద్దకన్నం. రెండోప్రక్కన

"కరువుకావు" యని అక్షరాలు. అక్షరాల క్రింద నల్లటి మాల కాకిబొమ్మ. కన్నంలోంచి మధ్యమధ్య సుడిగాలి, గాలిగుండా మధ్యమధ్య వెయ్యికాకులు యఱచినట్టు "కావు కావు" గావు గోల. ఇంట్లోజనం ముగ్గురికీ ముందుచూపూ తట్టలేదు. వెనుక చూపూ తట్టలేదు.

"గోవు దయ్యమైందికామోసు దేవుడా!" అని కృత్తి కయ్యతో ముగ్గురూ ఇల్లు పాడెట్టి పోయారు. పోతూపోతూ అవునమ్మిన రొక్కం, మూడువందలు, తాము ఉపయోగించుకోరాదని మూటకట్టి, మంచిరోజులు తమకుమళ్ళీవస్తే గోవుపేరంటాలికి గుడికట్టిస్తామని, ఆ గోవునమ్మిన సొమ్ము మీదుకట్టారు. మీదు కట్టిన రూకల బరువు, నూకల బరువుతోపాటు కూడా కూడ ఉంచుకు ఉండ చూచుకునేవారు అతిజాగ్రత్తగా.

ఇలా ప్రయాణమై, ఆవారు, పూటకోవూరుగా ఆగుతు దగసెగ అనక, మంచిరోజులకోసం కాలినడకనే సాగారు ఓనాడు రెండువూళ్ళ మధ్యను మహారణ్యమొకటి కనిపించింది వారికి. మహారణ్యం మధ్యను రాజభవనంలాంటి మహా భవన ఒకటి అగుపించింది. తలుపులూ బార్లా తీసివున్నాయేమో తిన్న ఆ ముగ్గురూ ఆ భవనం లోపలకు వెళ్ళిపోయినారు. ఎదురు గుండా గోడను, వారికి, వాళ్ళ పోయిన కట్టడపు కాసులపేరు, తగిలించి, కనబడింది! ఆ పేరు కిటూ, యటూ, గోడమీద, కుడితట్టు "కరువుకన్నం" అని, ఎడంతట్టు "కరువుకావు" అనే వ్రాసియున్నాయి. కాని యీ పర్యాయం కన్నంబదులు గోడప్రక్కను, వెచ్చనన్నం—సన్నబియ్యంతో వండి వార్చింది.. ఎండలోని సన్నజాజుల పూలపోగులా—కనిపించింది, అవి వస్తూ—ఎడంతట్టు కాకికి బదులు ఆవుబొమ్మ వ్రాసివుంది, ఆవును

దూడ కుడుచుకుంటూవుంటే, క్షీరం ఊక్షితిమీద పడుతూయున్న ట్టుగా ఉంది. నేలమీద నిజంగా పాలే కాలవకడుతూ, కడవల పొర్లుతూ కాబడ్డాయి? "కరువుకు అన్నం" "కరువుకు ఆవు" కనబడినాయి అని, ఆ ముగ్గురూ. వాళ్ళకు మంచిరోజులు రాబట్టే, వాళ్ళపోయిన వస్తువు కనబడింది అని. ఆ కాసులపేరు తీసుకొని, అక్కడనే ఆ అన్నం. ఆ పాలూ కడుపునిండా అర గించి, త్రేంచినవారై. మరి తమకు మంచిరోజులు వచ్చినట్టే రూఢిగావించుకొని ఒక్క నిమిషం మరి అక్కడ ఆగితే, మరేమి ఉపద్రవం సంభవిస్తుందో అని. ముందు మగడూ, తరువాత పడుచుపెళ్ళాం, తరువాత ముసిలితల్లీ భవనం వెలుపడి తొందరగా నడువసాగారు. వస్తువు దొరికిన సంబరంకొద్దీ, మీదుకట్టిన మూడువందల ముడుపుమూటా ఆ భవనంలోనే వారు మరచిపోయినారు.

వారి వెనుకవెనుకనే, రాజభవనంలాంటి ఆ భవనం లోనికి—ఆ అడవిలోని దొంగలగుంపు దా భవనం — అసలు దొంగలు భోజనమునకుగాను వచ్చినవారై తమ భోజనము, తమ పాలు కొదువబడుటయేగాక, తమరు నాటిరాత్రి దొంగి లించి తెచ్చుకున్న ఆభరణం,—దానివల్లనే ఆ మ్యాజిక్ అంతా రోజూ దొంగలముందు జరిగేది — ఆ ఆభరణంకూడా పోయి నందుకు వగచి. భవనమంతా వెమకసాగారు. ఆ వెమకడంలో మీదు కట్టుమూట వారికి చేజిక్కింది. చేత చిక్కేలో వారు దానిని విప్పక మానరైరి. విప్పిచూచేలో మూటనుండి ఒక పాడియావు పైకివచ్చి, వాడికొమ్ములతో ఆ దొంగలను కుమ్మి కుమ్మి, కూకటి వ్రేళ్ళకంటా ఆ మహాభవనాన్ని పెల్లగించి పారి వేసింది. ఆవుదూడకూడా అదేపని చేసిచూపింది.

దొంగలు పటాపంచలయ్యారు.

ఇంతలో కృత్తికయ్యకు మూడువందల మూటమాట జ్ఞాపకంవచ్చి వెనుకకు రావడం తటస్థించింది. అతగాని ఆవూ, దూడ తిరిగి ఆతగాడికి దొరికాయి.

ఇదంతా ఏమిటనుకున్నారు పాఠకులు ! గోవు పేరంటాలి మాయ. మాయ అని ఎందుకు అంటూ ఉన్నానూ యంటే, తన ఆవును మళ్ళీ కృత్తికయ్యగాని, కృత్తికయ్య భార్యగాని పాలు పితుకుతూయున్నప్పుడల్లా, కుసింత కడవెట్టినా కొండంత గుండి గెట్టినా, అంతా నురుగే ! నురుగులో ఆవూ కనిపించేదికాదు, దూడా కనిపించేదికాదు. పితికే కృత్తికయ్యా కనిపించేవాడు కాడు. కృత్తికయ్య పాలుపితకడం చూస్తూ విస్తుపోయే మత్త కాసినీ కనిపించేదికాదు. నురుగు వొత్తిగిస్తే పాలసముద్రం, పాలసముద్రంమీది శేషశాయీ కనిపించేవారట !

మాయగాక మరేమిటది ? వింతగాక మరేమిటది ?

.... .... .... .... ....

## చీమల త్యాగం

అడిగితేనేగాని ముష్టి పెట్టనిజాతి మనిషి జాతి. అపేక్షిస్తేనేగాని సాయపడని సంఘం మానవసంఘం. పిపీలికాది బ్రహ్మపర్యంతంగల యావత్తు తతిమ్మా ప్రాణికోటి ప్రకృతిసిద్ధంగా ప్రపంచానికి తోడ్పడతాయి. చూడండి ! బ్రహ్మ, మనం కోరకుండానే మనల్ని సృష్టించాడు; ఈ మనల్నే కాకుండా, సమస్త చరాచర,

ప్రపంచాన్ని సృష్టించాడు. చెట్లను చూడండి! మనం అడక్కుండానే ఫలములను రాలుస్తాయి. పువ్వులు పడేస్తాయి. నదులను చూడండి! నావలను తర్లించుకుంటూ పోతాయి తమంతటతామే, వాలునే వదిలేస్తే, ఇఖ మఱి పక్షులను గురించి యోజిస్తుమా—కోరకుండానే కోయిలకూస్తుంది. ఎత్తుగా ఎగురుతూ భరద్వాజ పక్షి పాడుతుంది. మరిగుర్రాలు, ఏనుగులు, లొట్టిపిట్టలు యన్నీ మనం యనుకోకుండానే ఎక్కడలేని సాయం చేస్తూయుంటాయి యీ లోకానికి. ఒక్కమనిషే మరోమనిషికి సాహాయ్యపడడం అనేది, ఎదరవాడు కోరితేనే! ఎదరవాడు యడిగితేనే! ఎందుకూ! అల్పాత్యల్పమైన ఎఱ్ఱచీమలు గావించిన యీ కథ లోని విచిత్రం చదివేరా, లోకంలో మానవేతరమైన ప్రతీప్రాణి స్వతస్సిద్ధంగా ప్రపంచోపకారి యని పాఠకులకు బోధపడి తీరుతుంది.

కథలో కనికట్టులేదు, మాయలేదు—డోలు వాయించడమంటూ ఉండదు. మంత్రించడం జరుగదు. ఈలవేయడం అంటూ కానము—ముంగిసపాము రావు. మామిడిచెట్టు యమాంతంగా దుప్పటిక్రింద మొలవదు. గోచిలోంచి రూపాయ ఊడి పడదు—చూచువారి తప్పెటలుండవు, చూడని వారి తహతహ లగపడవు—అంతా ఋజువు, రూపం, ప్రత్యక్షం, నగ్నసత్యం—తెలిసినవారికి తేడాలేంది. తెలియనివారికి గోడాగొండీ!

"కాండిశీకులు" "కాందిశీకులు" అనే పేరు ఇప్పుడు పత్రికల్లో పరిపాటిగా చదువుతూయున్నాము చూడండి, వాళ్ళు ఒక దేశస్థులుకారు. పడమటి పాంచాలంనుంచి వలసవచ్చిన కాందిశీకులున్నారు. అక్కాశ్మీరదేశాన్నుంచి పిక్కబలం కొద్దీ,

వచ్చిన కాందిశీకులున్నారు. తూర్పువంగనుంచి పైతొలగివచ్చిన కాందిశీకులున్నారు. హైదరాబాదు సంస్థానంనుంచి హైసరబజ్జా యంటూ హడావిడిపడి హడతెత్తి "ఆలించండోయి!" "పాలించండోయి" అంటూ పలాయనులై వచ్చిన కాందిశీకులున్నారు. వీరినందఱను ఒక చోటికి చేరిస్తే "కాందిశీకుస్థాన్" యనే క్రొత్త ప్రదేశం భారతదేశంలో ఏర్పాటు కాగలదు నిజంగా!

ఒక్క నూతన విషమపరిస్థితిలో వెడలివచ్చిన వీరినందరినీ గౌరవించి, వారికి భారత ఐక్యరాజ్యంలో సగంరాజ్యం ఇచ్చివేస్తుమా, వీరంతా ఒక నూతనయుగానికి కర్తలై, నూతన చైతన్యం కాపరుస్తూ, కులం యని, కట్టుబాటు యని, కోశం యని, కొలత యని, ఏమీలేకుండా సంపూర్ణ స్వేచ్ఛతోను, వినూత్న సంఘబలంతోనూ, విరాజిల్లగలరని నా నమ్మకం,—ఏమా అంటే—వారు, వారి వారి యసలు ఆస్తులు పోగొట్టుకొన్నారు; వారి వారి ఆదిమోద్యాలకు ఉన్న ఉద్యోగాలకు నీళ్ళు వదలుకొన్నారు. కొండలు కోంచలు, పిల్లాతల్లీ ఎడమై, భార్యాభర్తా విడివడి, తండ్రీకొడుకూ ఒకరినొకరు కానక,—ఉన్నారో పోయారో అన్న ఉదంతం కూడా నేరక తిరుగుతూయున్నవారు కలరుకూడాను. వింటే గుండెకు జాలివేస్తుంది. కంటే కళ్ళమ్మట నీళ్ళు కారుతాయి!

"శిబిరాలు" "కాందిశీకుల శిబిరాలు" అంటూ ప్రభుత్వం వారు అక్కడక్కడ నెలకొల్పారు యనుకోండి! అవి ఏమూలకి? అక్కడ సదుపాయం కంటె మూలో ఏపంచో ఒక ఖాళీగాయున్న యరుగుమీద పరుండి, ఏవేళో ఒకవేళ బిచ్చమెత్తుకు, నాలుగు బియ్యపుగింజలు సంపాదించుకు గంజికాచు

కుంటే యంతకంటె గొప్పగా కాలం వెళ్ళిపోతుంది యని అను కునే కాందిశీకులు వేలకువేలున్నారు. మీరెప్పుడైనా చూచారో లేదో ?

ఒకానొక రైల్వేస్టేషన్ ప్రాంతాన్ని ఒకానొక శిరీష వృక్షం ఎత్తుగాపెరిగి నీడగావాదిగి పూవులతో, కుచ్చులపల్లకీల్లా కొమ్మలల్లాడుతూ ఉంటే, ఎంతో ఇంపుగొల్పేదికద్దు. ఆ చెట్టు క్రింద అప్పటికెంతమంది బాటసారులు పక్కలు పఱచుకునో, ఎండుపూలమీద పఱచుకోకనో, విశ్రమించి, మఱి తిరిగి ప్రయాణమైనారో, జనాభాలెక్క తీసికొన్న నాధుడులేడు.

ఆ పొద్దు, ఒక యువతి, పైచెట్టునున్న పువ్వుకంటె మెత్తని శరీరంగలది, శరీరంకంటె మెత్తందనంగల చిత్తం గలది, ఒక యువతి, ఆ చెట్టుక్రింద మేనువాల్చింది. పచ్చని దబ్బపండులాంటి శరీరచ్ఛాయ, ఎఱ్ఱని మేలిముసుగులోంచి కాపడుతూ, ఉషస్సు ఎన్ని ఊహలు మనలో గొల్పుతుందో, అన్ని ఊహలు గొల్పుతూయుంది. పాలమీగడలో పంచదార మెదపిన సుతారపు అహారంమీదనే నిరంతరం పరిథవిల్లిన ప్రస్ఫుటస్వరూపంగా పరకాయింపున కానింది అంటే నమ్మండీ ఆమె !

ఆమె తలవెంపు ఒక సంచీ ఉంది. కాని సంచీమీద మాత్రం ఆమె తలలేదు. ఆమెకు తలాడగా ఆమె బాహువును ఉపకరించుకుంటూయుంది. సంచీలోని సరుకు ఎవరికీ తెలియదు. కాని ముట్టెకట్టిందికాదు. ఆమెకు మగడున్నాడో, మగడెక్కడి కైనా ఊళ్లోకివెళ్ళాడో అని అడుగుదామన్నా, ఆమెను చూచిన వారికి అడుగ బుద్ధిపుట్టదు. ఏమాఅంటే ఆమె అందం చూచుటలో

అందరూకూడా అంతచేటు ముగ్గులు కావలసిందే! ఆమెకు వచ్చిన భాషకూడా అక్కడ ఉన్నవారెవ్వరికీ రానేరదు. అక్కడ ఉన్నవారి భాష ఆమెకు రానేరదు. మఱి అన్యోన్యం మాట్లాడ మెట్లా ?

అయితే ఆమె వొంటిగా ఊరికేలేదు. ఏదో వింటూవుంది! కడనే ఒక చీమల ఎలుగు, ఎఱ్ఱచీమలపాట !

" కాందిశీకులకు కనకధనం,
మందభాగ్యులకు మంచీ ముత్యం,
మమ్మన్నెవరూ అడుగక్కఱలే !
అడిగినవారికి మఱీ అదృష్టం !"

వినబడింది ఆమెకు ఆపాట. తేరిచూచింది ! చీమలబారు ఒకటి నడిచిపోతూవుంది. అవికూడా కాందిశీకులకు మల్లేనే ఆమెకు కనబడ్డాయి. వాటి సాయం, తనకేలాగూ అని, శంకించింది. అయినా పారచూచింది-ప్రతీ మగచీమ ముక్కునా ఒక కందిబద్ద, ప్రతీ ఆడచీమ ముక్కునా ఒక బియ్యపుగింజ, అదే చెక్కుమాత్రంగా, అదే నూకవాటుగా, అవి మోయగల ప్రమాణంలో, ఆమెకు గోచరించాయి.

వెంటనే ఆమెకు నాడు, తనకు "ఊరంతా తిరిగినా, ఒక్క బియ్యపుగింజగాని, ఒక్క పప్పుబద్దగాని, ఒక్క కూర తొడిమగాని, ఒక్క ఊరుగాయ పేడుగాని, ఎన్నిగుమ్మాలెక్కి, ఎన్నిగుమ్మాలుదిగి, "అమ్మా" "అయ్యా!" అని యఱచినా పుట్టలేదు. పెట్టలేదు యన్న ఆరాటం ఎత్తింది. కడుపు యేడ్చినట్టయి వళులు చెమ్మగిల్లాయి !

"మనుష్యులకు లేనిహృదయం చీమలకు ఉంటుందా ?" యని అనుకుంది. అయినా చూధాం అని.

" చీమల్లారా ! చీమల్లారా !
నాతోవున్న భామల్లారా !
మీమీ బిచ్చం పెడతారగ్రా !
మీరే పట్నం పెడతారగ్రా !"

అని ముభావంగా యాచించింది.

వెంటనే ఆ చీమలబారు, అల్లా వెళ్ళేది, ఇల్లా మళ్ళి ఆమె తలవెంపు సంచీలోకి తమతమ సరుకుతో ప్రవేశింపసాగాయి. కొంతసేపటికి ఉత్తచీమలు వెలికివచ్చాయి.

యువతి సంచీలో చేయిపెట్టిచూచింది, " గుప్పెడు నూకలైనా కావా ? గిద్దెడు చెక్కైనా కాదా ? అన్ని చీమలు లోపలకు వెళ్ళి యివలకు వచ్చాయి, తమతమ ముట్టెకుగల పొల్లో, పొట్టో, సంచీలో పడేసి," యని అనుకొంటూ—

ఆమె చేతిలోకి గుప్పెడు బంగారు పిల్లకాసులు, గుప్పెడు మంచిముత్యాలు వచ్చాయి ! అవి సంచీలో చీమలుపడేసినవేనా లేక తన దేశంనుంచి వచ్చినప్పుడు యందులో తానేవుంచి మఱచిపోయినవా ? అనే సందేహంలోపడి చీమలవంక చూస్తూ సంచీ ఘట్టిగ్గాదులిపింది. వట్టిదయ్యేలా వెలిపింది తన గుప్పిళ్ళల్లోని పిల్లకాసులు మంచి ముత్యాలు నేలపడేలా ! నేలమీదపడుతూంటే, ఒక్కొక్క పిల్లకాసుక్రింద ఒక్కొక్క చీమ, ఒక్కొక్క మంచిముత్యంక్రింద ఒక్కొక్క చీమ, వాటిమీద పడ్డపాటుగా, బరువు తట్టుకోలేక ప్రాణంపోయినట్టణగారి పోయాయి.

చటక్కున, ఆ కాసులు, ఆ ముత్యాలు యేరిందై యువతి ఆ చీమలు చచ్చిపోయినాయో, జీవంతో ఉన్నాయో అని పరీక్షించింది. అప్పటికప్పుడే వాటితోటి చీమలు, వెనకశ్రేణిలో ఘ్నుండి, ఇంకా సరుకు సప్పరా మోసుకొస్తూయున్నవి, ఊజీవకళ

తప్పినట్టున్న చీమలవంక ఆగి ఒక్కొక్క మగచీమనోట్లో, ఒక్కొక్క బియ్యపునూక పలుకు, ఒక్కొక్క ఆడచీమనోట్లో ఒక్కొక్క కందిబద్దపిసరు, తాము తెచ్చుకుంటూయున్నవి వాని నోళ్ళకు అందిచ్చాయి ; వెంటనే సంజీవి పోసినట్టు, అమృతం కుడిపినట్టు, పాకతొడగాయి ఆ పడివున్న చీమలు.

యువతి, " వాటికి జీవనాధారమైన సరుకు నా సంచీలో పడేసి, అమరత్యాగం చూపినాయే ఈ చీమలు " అని మెచ్చు కొన్నదై, మెచ్చుకోలు సశేషంలోనే, తాను నిజంగా ఆకలిగొని వుంది కాబట్టి, అడగడం మఱచో, అడిగేదేమిటి యనో, తనకు గల పశుబలంకొద్దీ, కొత్తచీమలలోని ఒకదాని నోట్లోనుండి ఒక మెతియ, ఒకదాని నోట్లోనుంచి ఒక కందిబద్ద తునియ ఊడలాక్కుని అలా తన నోట్లో వేసికొంది !

" ధనియామేఁ "—" ఎంత కనకమయితే ఆకలితీరను, ఎంతెత్తు ముత్యాల కుప్పవొస్తే దప్పికొఱను ?" అని అనె యనుకుంటూ గర్రునర్రెంచింది. ఎక్కడి ఆకలి యక్కడె ఆమెకు మాయమైంది, ఎక్కడిదాహం యక్కడే ఆమెకు తగ్గి పోయింది. ఆమెకు మఱి, నాడు తాను మనుష్యులను ఎక్కె గుమ్మందిగే గుమ్మంగా యాచించినప్పటి నిష్ఠురవైఫల్యము, స్ఫురణమాత్రంగానైనా తట్టలేదు.

కాని ఏ చీమనుండి తాను బియ్యపు పిసరు కొల్లగొన్నదో యేచీమనుండి తాను పప్పు చీఱు చూరగొన్నదో, ఆ రెండు చీమలు ఈ పర్యాయం నిజంగా ప్రాణాలు వదిలేశాయి ! చుట్టూ ఎన్ని తోడిచీమలు మూగి ఎంత ప్రయత్నించినా బ్రదుకలేదు ఆ రెండు చీమలూను !

అయితే యువతి వాటివంక చూచిందీలేదు ! యువతిలో అందం లోకం మఱి గమనించిందీ లేదు ! ఊడలాగికోకుండా ఆ రెండుచీమలను వేడివుంటే ఎంత మంచి జరివుండేదో ! ఆమెకూ ఆ చీమలకూ కూడా !

.... .... .... .... ....

## బంగ్లయ్యకు గుడ్ - లక్ !

లార్డు లివియథాన్ ఇంగ్లీమాన్. లివియాథాన్ ప్రభ్వికూడా ఆదేశానకు చెందిన మనిషే. వాళ్ళ పిల్లలందఱూ కూడా ఆ దేశంలో జన్మించినవారే "కన్వెన్షెన్" ఏ దేశంలో కానీయండి.

లివియథాన్ కుటుంబంవారి చాయ ఉడుకుసున్నంలో పైకెత్తిన దూదిపింజెల చాయ నొప్పుతూ, లోపలి వెచ్చని నెత్తురుయొక్క కావి ఆవి బూరిబుగ్గల్ని బుసకొట్టేలా, బొద్దు దేటి అద్దుకాగితాల్లాంటి దళాసరి చర్మంతో వెలిసివుంటుంది. ఇండియాదేశపు వేడిమి తట్టుకోలేక ముహూర్ముహూర్ఘర్మవారి నేరులు కట్టుకుంటూ "సీలింగు ఫానుల" క్రింద కూర్చుండి "ది ఫ్రెజిడీర్ కూలింగు ప్రిసెర్వ్డ్ ఫుడ్సు" ఫలాహారంగా అహరిస్తూ, వారున్నారు ఈ కథాకాలంనాటికి.

లివియథాన్ ప్రభువువద్ద వుండే బట్లరుపేరు బంగ్లయ్య, బంగ్లయ్య, పక్కా-నేటివ్, అవుగాక ! చిన్నప్పుడే మతముచ్చుకు, మూచూచి మూచూచి ముట్టుకొన్నట్టుగా, "వూ"చేసి "వూ"చేసి కట్టుకున్నాడు అనుతాపి అనే ఒక బిబ్లికల్ మహాపాపిని.

బిబ్లికల్ పాపి యంటే ఏడమ్ అండ్ ఈవ్ దంపతుల ప్రణయఫలితంగా పరిణమించిన పరంపర పాపజన్మ అన్నమాట. అంతే, అంతకంటె వేఱే పాపం చేసింది లేదు ఆ యిల్లాలు.

ఆ నేటివ్ క్రిష్టియన్ దంపతులిద్దరూ, ఒకరు నల్లతుమ్మ కాల్చగా వచ్చిన బొగ్గు చాయనుంటే, ఒకరు సింగరేణి గనుల నుండి వెలిబుచ్చిన రాక్షసిబొగ్గు చాయనుండేవారేగాని ఒక ర్నొకరు తీసిపోయేవారు ఏమాత్రం కారు. మఱిన్ని వారిపిల్లలు డజనుమంది. డజనుమందిని వరుసగా పరుండపెడితే వాల్చిన బ్లాక్‌బోర్డు యని అనుకొని తీరాలి.

కాని ఎప్పుడున్నూ బంగ్లయ్య బాపతు ప్రజాసమూహం లివియథాన్ దంపతులు కంటబడింది లేదు. వీళ్ళ ఉనికి ఊరు పట్టుపీడు విశ్రాంతి పాడుపేఱు. బంగ్లయ్య వొక్కడే బస్లేరు. ఏ రూపాన్నో వో రూపాన్ని నిత్యం లివియథాన్ దంపతులింట ప్రత్యక్షమయివుండేవాడుకూడా అతడొక్కడే !

కాని రోజులైనా సరే, కరువురోజులైనా సరే, కర్మకాండ తప్పదు గదా ! 25-12-? క్రిస్టమస్ పండగ వచ్చింది. అదివఱ కల్లా బంగ్లయ్య వొక్కడే దొరగారికి, వారి కుటుంబానికి చెప్తూ యుండేవాడు "సంతోషకరమైన కిసిమిసి" ఆ సంవత్సరం పిల్లల్ని పెళ్ళాన్నికూడా తీసుకువెళ్ళి దొరగారికి, దొరగారి భార్యకు, వారి పిల్లలకు తాను కుటుంబ సమేతంగా "సంతోష కరమైన కిసిమిసి" చెబ్దామని సంకల్పించుకున్నవాడై, రెండు దండలూ, ఓ బిస్కట్ల డబ్బా పట్టుకు బయలుదేఱాడు, తెల్లాఱి ఎనిమిదికే ఆ పొద్దు బంగ్లయ్య.

డజనుమంది నేటివ్ పిల్లలూ, బంగ్లయ్య, బంగ్లయ్య భార్య అనుతాపి బజారంటే నడుస్తూ క్రమక్రమంగా లివియథాన్

దొరగారి బంగాళాగుమ్మం చేరుకునేలో, వారి వెనకాల, ఎఱ్ఱటి వోళ్ళు, పచ్చటివోళ్ళు, చామనచాయవోళ్లు, ఓ మోస్తరు నల్లని వోళ్ళు, ఏ చాయాలేని వోళ్లు, ఎంత తోమినా రానివోళ్ళు, హిందువులూ, ముస్లిమ్‌లూ, వీరందఱూ, ఎంత లేదన్నా, ఓవంద మంది వెంటాడించారు.

"వీరందర్నీ ఎలా పోషిస్తున్నాడు ? ఈ బంగ్లయ్య ఈ రోజుల్లో" అని ఆశ్చర్య పోసాగినారు.

"పోషణ జరక్కే దొరగారి దర్శనార్థం తీసికెడుతూ ఉన్నాను" యన్నాడు అతిజాలిగా బంగ్లయ్య ప్రక్క ప్రక్క నున్న జనంతో. "దొరగారెంత దొడ్డోరైనా ఇంతమందిని పోషించుకునే సూత్రం చూపిస్తారా ఈ వెఱ్ఱిమొహానికి" అని కనిపెట్టి చూస్తూవున్నారు ప్రజానీకం. అనుతాపి ఎవరివంకా చూడకుండా తన బిడ్డలవంక తనవంక నేలంక చూసుకుంటూ నడుస్తూవుంది.

చేరుకున్నారు నగుమొగాల్తో లార్డు లివియథాన్‌గారి బంగాళా !

లార్డు లివియథాన్ వచ్చి, బంగ్లయ్య దంపతులు వేసిన పూలదండల సువాసన మెచ్చుకుంటూ, "బ్లాక్‌మార్కెట్టును పెంపొందింపజేస్తూ ఉన్నది మీ కుటుంబమే యనుకుంటాను బంగ్లయ్యా !" యని అభినందించాడు. వెంటనే బంగ్లయ్య మగనాలి "మావల్లను ఏమవుతుందండి ! దొరగారూ ! బియ్యం తెలుపు బిన్నిబట్ట తెలుపు, డఫ్ తెలుపు, పౌడరు తెలుపు ! ఎంత నల్లటివాళ్లో కప్పెట్టినా ఎంత నల్లటి గుప్పిట్లో కుదించినా, తెలుపురంగు బయటపడి తీరుద్ది దొరగారూ ! మా నల్లనోళ్ళవల్ల

ఏమవుద్ది దొరగారూ ! ఏదన్నా తమకే ! తెల్లదొరలకే సెల్లు తమకు మా సలాములు !" అంది వొయ్యారంగా.

ఎంతమందిని కన్నా అనుతాపి వొయ్యారం అదేమిటో అలాగే నిల్చివుంది "టీన్సు" లోలా "ఫోర్టైన్సు" అప్పుడున్నూ.

లార్డు లివియథాన్ అతి టిప్‌టోగా "మేం ఈ రోజునే క్విట్ఇండియా కావిస్తున్నాం. మీకు తెలియదు కామోసు.

ఎప్పుడో అన్నాది.

ఈ నాడే నెరవేరుస్తున్నాం.

మీకు తావిస్తున్నాం. ఈలా ఆడవాళ్ళ దగ్గర్నుంచి వై దొలగమంటూ ఉన్నప్పుడు, మఱి వుండడం మాకు మంచిది కాదు. సామాను ప్యాక్ చేశేశాం, ఈ తక్షణం "క్విట్ఇండియా" పంథా మేం మా కుటుంబం అమలుపెట్టేసి వేస్తున్నాం. " ఎ హాపీ క్రిష్టమస్ టుయు ఆల్ !" అన్నాడు పెద్ద నవ్వు నవ్వుతూ !

అనుతాపికి కళ్లు చెమ్మగిల్లాయి, బంగ్లయ్య లివియథాన్ పాదం ముట్టాడు. బాంగ్లీయులు మాత్రం "మీరు వెళ్ళిపోతే ఈ బంగళాలో మాం ప్రవేశిస్తున్నాం !" అన్నారు సగర్వంగా.

" ఉండుండి ! సత్వరం ప్రవేశించి వుండుండి ! మీ క్షేమం కొరకే మేం వెళ్ళిపోతున్నది " అని లివియథాన్ ప్రభువు ఒక తాళంచెవి ఆ పిల్లల కందించాడు.

ఆ తాళంచెవి తెల్లగా వుంది. " వెండి చెవిలాగుంది. " అంది అనుతాపి వోరచూపు చూస్తూ. బంగ్లయ్య " దానిమీద క్రెసెంట్ చెక్కబడివుంది " అన్నాడు దూరపుజూపు ప్రకటిస్తూ. పిల్లలు తాళంచెవి పెట్టి తలుపులు తియ్యబోతే తలుపులు రావు. లోపల కిచకిచలు. తలుపుల సందులంట చూచేరు. లోపల కృష్ణ గద్దల సంతానం. జీసస్ లేడు మోసెస్ లేడు.

అప్పటికప్పుడే లివియథాన్ ప్రభువు ప్రభ్వితో వారి ప్రోజెనీతో అందరూ బొంబేమెయిల్ ఎక్కేసి—చల్! చల్! చల్! స్టీమర్ డెక్ మీద తొక్కేసి టక్! టక్! టక్! మరిన్ని దేవుడుమేలుచేస్తే లండన్‌నుండి బంగ్లయ్యకు కేబిల్-గుడ్ లక్! లక్! లక్!

.... .... .... .... ....

## ఎఱ్ఱకలవ చేతులూ - నల్లకలవ ముఖమూ

"యూ ఆర్ డిశ్చార్జిడు ఫ్రమ్ దిస్ మోమెంట్" ఈ నివేషం తమకు వెళ్ళిపోవాలని వుంటే, వెళ్ళిపోవచ్చు హాస్పిటాల్లోంచి; మీజబ్బు కుదిరింది, మీరు కులాసాగా నున్నారు. ఇదిగో! పెద్ద దొరగారి ఉత్తరువు" అని తాఖీదు చూపించింది, అత్యుత్సాహంగా కళ్ళల్లో నవ్వు పెదవులమీదా ముక్కుకొనమీదా మెఱసేలా ఆ కోమలాంగి. కోమలాంగి అంటే నర్సు వీరవల్లి. పరాయిమనిషి కాదు. ఆమెచెప్పే ఆ వీడ్కోలు వాక్యాలు విని వేడుకపడ వచ్చునా? విశ్వసింగు మహదేవుకు వేడుకలేదు సరికదా విచారం పుట్టుకొచ్చింది.

అప్పటికి నెలరోజుల్నుండి ఆ హాస్పిటాల్లో స్పెషల్ వార్డు ఇన్‌పేషంటుగా వుంటూ, వీరవల్లి పెట్టిన రొట్టి, వీరవల్లి అందిచ్చిన పాలు, వీరవల్లి కొట్టిచ్చిన కోడిగ్రుడ్లు ఒకటేమిటి? ఆమె గ్రుచ్చిన సూదిమందుల దగ్గర్నుంచీ, డాక్టర్ సమక్ష మందు, డాక్టర్ పరోక్షమందూ కూడా తీసికొంటూ రోజూవారీగా

తేరుకొన్నాడు—అన్నాడు "ఇంటికంటె నాకీ హాస్పిటాల్లోనే బాగుంది. చించెయి ఆ విడుదల ఉత్తరువు. వీరవల్లి "మీ ఇల్లెక్కడ ?" వీరసింగు మహాదేవుడు "ఇల్లూ లేదు వాళ్లూ లేదు ఈదాకా. నీ మూలంగా వాళ్లొచ్చింది. మఱి ఇల్లు ఎవరిమూలంగా వస్తుందో ? ఇంతకూ ఇల్లుండి ప్రయోజనం ఏమిటి ? పిల్లలుండాలి. ఒక్క పిల్లైనా కలిగినా కంటిముందు త్రచ్చాడుతూ వుంటే బ్రతకగలను గాని లేకపోతే చావే శరణ్యం. ఏమంటావు నీ అభిప్రాయం ?" అని ఆమె కళ్ళల్లోకి యతిదీనంగా చూశాడు.

ఎందరెందరో వ్యాధిగ్రస్తుల్ని ఈసరికి వీరవల్లి నాడి చూచి, నరంసాచి తెలిసికొంది కాని, ఈలా తన కళ్ళల్లోకి ప్రాధేయపూర్వకంగా చూస్తూ తననే ఆధారంగా పరిగణించిన పురుషుణ్ణి ఆపె చూచియుండలేదు. అయినా యతగాడు కోరింది ఆదో పెద్ద కోరిక కాదు. ఒక్కకుఱ్ఱాణ్ణి తనకు ప్రసాదించమంటూ వున్నాడు. ఆలోచించింది వోలిప్త. ఆలోచించి "ఆలాగే, అందుకేమీ నీవు ఆందోళనపడనక్కరలేదు. నీవు మొదలింట బ్రహ్మచారివిలా గున్నావు. మరి ఇల్లెక్కడ" అంది. "ఎక్కడేమిటి ? తెల్లారేసరికి ఈ హాస్పిటాలుకు వెనుతట్టునవున్న మైదానమ్మీద రెండో స్వర్గంలాగ సాధిస్తాను" అన్నాడు వీరసింగు మహాదేవ్. వాండ్లు ఇరువురూ పరస్పరం వీడ్కోలు గొన్నారు.

కథలో బిల్డింగ్ లేవడం కష్టమేమో గాని ఈ రోజుల్లో అవతల యసలు మైదానమ్మీద యతిసుళువు మహాసుళువూను. ఎటామిక్ ఎనర్జీతోటి లేచిపోయినాయి స్తంభాలు, దూలాలు, కొమర్లు, గొళ్ళాలు, కావలసినన్ని గదులు, పోలేనన్ని త్రోవలు,

లిప్టులు, స్విచ్చులు, పిల్లోలు, పుళ్ళీలు—అంతా అధునాతన రసాయన పదార్థవిజ్ఞానశాస్త్ర వృక్షజంతుశాస్త్ర, తాత్విక ఆర్థిక, సాంఘిక రాజకీయ సాముదాయక సూత్రాల ననుసరించి వీరసింగ్ మహాదేవ్ మహల్ పెద్ద పాలెస్ తయారైంది. వీరవల్లి తన హాస్పిటాల్ డ్యూటీస్ నెరవేర్చిన అనంతరపు గడియలయొక్క విలాస నివేశాలన్నీ ఆ "పీఠు" నందే. లోపల ఆమె ఏమేమి చేసేదో, వీరసింగ్ మహాదేవు నెలా సంతోషపెట్టేదో బ్రహ్మ రహస్యం.

అయితే వీరసింగు మహాదేవ్, తన కట్టెదుట ఆమె చేస్తూవచ్చిన చేతల్లో ఒక సేవ దైనందిన నూతనంగాను యతి వినోదవంతంగాను చూచేవాడు; తన తలాపు దిక్కునే. మంచం ప్రక్క !

డయాగ్రామ్ గియ్యలేను గాని, అతి వయ్యారంగా నడిచేది యతని పడకగదిలో వీరవల్లి. ఇంటర్మిటెంట్ ఫీవర్ చార్టుగీతలా వంకర టింకర్లు పోతూ ఓ టెస్టుట్యూబ్ లోకి అస్తమానం చూస్తూ వుండేది ఆమె. ఆమె దృష్టిలో తన దృష్టి కలుపుతూ వీరసింగ్ మహాదేవు ఆ టెస్టుట్యూబ్ లోకే చూస్తూ ఎవేవో రంగులొచ్చినట్టు పొంగువచ్చినట్టు, హృదయముప్పొంగినట్టు కనుగొంటూ ఉండేవాడు. ముట్టుకోవద్దు అని ఆజ్ఞాపించేది ఆమె. ఆ ముక్కతో తన కోరికలన్నీ కట్టిపెట్టేసుకు మంచంపట్టీమీద గడ్డంమోపుక ఊ ఆ గాజుపాత్రవంక చూచేవాడు. అప్పుడప్పుడు వీరవల్లి ఓ ఎఱ్ఱ కలువపువ్వో, ఓ నల్ల కలువపువ్వో ఆ టెస్టుట్యూబ్ లోకి నీళ్లుపోసి తేలవేస్తూ ఉంటే తనూ వొకటేసి చూచేవాడు. నాలుగైదు కలవపుష్పాలదాకా తేల్చి, పోల్చదాని

కవకాశంవున్న కైవారం గల పాత్ర అది. ఇలావుండగా ఓనాడు రాత్రి ఏంజరిగిందీ! వీరసింగు మహాదేవ్ ఒక్కడే ఉన్నాడు ఇంటిలో! ఇల్లంతకూ వొక్కడే! అన్ని గొళ్ళాలు వేసేసి. లోపల గెడెట్టుకు, మరి కూర్కు కనబోతున్నాడు. ఇఖ నిశ్చింతగా! అట్టె! ఓ బేబీ! అంటే పిల్లవాడు! అంటే శిశువు! ఒకడు ఎఱ్ఱ కలువ చాయనో రెండు చేతులూ, నల్ల కలువ చాయనో ముఖమూ, టెస్టుట్యూబ్ పగల, విసరి, కేరుమన్నాడు! లోకంలోని కలలన్నీ వొక్కమారు కాంతిల్లి తేజరిల్లినట్టు, లోకంలోని తెలివిఅంతా కేంద్రీకరణమై ధ్వనించినట్టు!

వీరసింగు మహాదేవ్ తక్షణం పాడ్ నుంచి ఒక లెటర్ పేపరు చించి, కుర్రాణ్ణి చూడకుండానే ఇలా వ్రాశాడు: "బొడ్డు కోయనక్కఅలేదు. పాలైనా ఇవ్వ నక్కఅలేదు. బిడ్డడు బాగానే ఉన్నాడు. నీవీ నిమిషమునుండి నా యింటికి రానవసరములేదు. యు ఆర్ డిస్చార్జిడు ఫ్రంమ్ దిస్ మోమెంట్" అని వ్రాసి వెంటనే వీరవల్లి కందచేశాడు.

ఆ చీటీ యందుకుని యటుతర్వాత వీరవల్లి మిక్కిలి చింతించిందై తాను కనబోయే పిల్లవాడు వాడే యేమోనని, ఆ యింట్లోకి ఎలాగైనా వెళ్ళి ఆ పిల్లణ్ణి చూదామనుకుంది. కాని ఆ యింటి తలుపులు నాటికీ నేటికీ అభేద్యాలై ఊరుకున్నాయి!

.... .... .... .... ....

# అసలైన సిసలైన స్వేచ్ఛను అందుకోండి!

"అయిదువందల రూపాయలు ఖరీదు
చేసే ఆటవస్తువు కొన్నాను! చూసుకో"

అనిఅంటూ భర్త ఒకపేకేజీపెట్టె కూలివానినెత్తినుండి చావడిలో దించుతూ కూలివాణ్ణి పంపించివేసి వంటింటికేసి చూచాడు.

భార్య : " నాకా ? పిల్లలకా ?" అంటూ చక్కావచ్చింది,

భ ర్త : " నీకూ, పిల్లలకూను, నీవుమాత్రము పిల్లల కన్న ఎక్కువ తెలివైనదానవా ? "

భార్య : " అలా చేశేశారు ! " అని చెప్పే జవాబు వినకుండానే భర్త పేకేజీపెట్టె విప్పుచుండెను.

పిల్లలు చుట్టూ మూగసాగిరి.

తల్లి వెంటనే " చుట్టూ మూక్కండి. 500 రూపాయలు ఖరీదుచేసే ఆటవస్తువు వుంటుందా ? దూరంగావుండండి " అని పిల్లలను బెదరించింది.

పిల్లలలో వొకడు " బందర్లాడూ తేమో ? బంగాళాదేశపు రసగుల్లాలేమో ?—

తల్లి : " అస్తమానం మీకు తిండిగోడవే ! అరసంచీ రూపాయల ఖరీదుచేసే లాడులేమిట్రా? లక్షణమైన కాసుల పేరో, వరహాలపేరో అయివుంటుంది. "

భ ర్త : " అవి నీ ఆటవస్తువులా ?"

భార్య : " నాకే అవ్వాలా ఏమిటి ? నా మెళ్లో మీరు వేస్తే ఈ చంటికూన చంకెక్కి అడుకోదూ ? మీ రెప్పుడూ చదవలేదూ, వేమృణాళాంకురశంకనంబెడు గజాస్యుని గొల్తుమదభీష్టసిద్ధికై " అన్నది.

భ ర్త : " మనము చేయబోయే కార్యమునకు వేరే బ్రాహ్మణుడు, విఘ్నేశ్వరపూజ అక్కర లేకుండా చక్కని పద్యపాద ముటంకించినావు !"

భార్య : " ఆటవస్తువుతో కార్యమేమిటండీ ?"

భ ర్త : " చెప్తా ! పెరట్లోకివెళ్ళి ముందు ఒక వెదురు కర్ర తీసికొనిరా ?"

భార్య : " నేను తీసికొనిరాను "

పిల్లలు పరస్పరము " మనము వెళ్ళి తీసికొని వద్దాము."

తల్లి : " మీరు వెళ్ళారా ? తంతాను. "

భర్త : " ఎందుకే అంత భయం ?"

భార్య : " నన్ను దానితో కొడతారేమో అని "

భర్త : " కొట్టను " అని పేకేజీ ఇంకా విప్పుచుండెను.

భార్య పెఱటిలోనికి వెళ్ళి గెడకర్ర తెచ్చెను. అప్పటి కప్పుడే భర్త పేకేజీ విప్పి అందులోనుంచి ఒక కొత్త రేడియో పెట్టెను పైకితీసి టేబిల్ మీద అమర్చెను. గెడకర్రకోసము ఎదురు చూచుచుండెను.

భార్య : " రేడియోటండీ ? మీరన్న 500 రూపాయల ఆటవస్తువూను ? మఱిఉన్న గడకర్ర వొక్కటీ మీ రేడియోకి ఇచ్చివేస్తే నా త్రివర్ణ పతాకం దేనికి కట్టేది ?"

భర్త : " కొన్నావుటే నీవున్నూ ?"

భార్య : " ఆఁ ! కొన్నాను అయిదు అణాలు పెట్టి " అని అలమారులోనుండి జాతీయ పతాకం తీసి, చుట్టివున్న దాన్ని విప్పుతూ " దీన్ని ఈ రోజున సరిగా కేంద్రమందు మన మంత్రులు ప్రమాణం గొనేటప్పుడు ఈ గెడకర్రకు కట్టి స్వరాజ్య చిహ్నంగా నిలబెట్టాలనుకొన్నాను. "

భర్త : " జెండాకు నా చేతికర్ర ఉపయోగించు. "

భార్య : మఱి సాయంకాలం అడిగేరా .. మీ చేతికర్ర మీకివ్వను సుమండీ, తిరిగి ఒక పర్యాయము ప్రతిష్ఠించిన తరువాత మఱి ఊడదీయనేరను. బాగా ఆలోచించుకోండి !"

భ ర్త : " ఈపైనుండి మనకు బెత్తాల్తో పనిలేదు. మన చేతులందు ఖడ్గములే తళతళ లాడగలవు " అని మొలనుండి యొక నిశితఖడ్గమును వెలికి దూసెను.

భార్య ఆశ్చర్యముతో " మన మంత్రులింకను పదవిని స్వీకరించకుండగనే ఆయుధ శాసనము రద్దయినదా ? " అని అడిగెను.

భ ర్త : " రద్దుకానక్కఱలేదు. రద్దు కావలెనని కోర నవసరములేదు. అరుణోదయములా అహింసాతత్వము మన దేశమందు వ్యాప్తినెంది ఖడ్గములును, కత్తులును చేతికఱ్ఱలవలె ఒకగంటనుండి అమ్ముడువోవుచున్నవి. దసరా వీరపూజకైననూ పనికివచ్చునని ఒకఖడ్గం కొన్నాను. "

పిల్లలు : " ఆలా అయితే దీపావళికి మేము స్వేచ్ఛగా తుపాకులే పేలుస్తాము !"

భార్య : " ఆలాగే చేయండి ! కాని ఆకాశంలోకి పేల్చండి ! జాతీయ ప్రభుత్వారుఌడుదయమైనది అహింసా భావారుణరాగ మధ్యమ మందు అన్నమాట మఱువకండి. రండి, ఇదిగో మీ నాన్నగారి , చేతికఱ్ఱకు దీన్నిగట్టి మన స్వరాజ్య పతాకమును నట్టింట అహింసాతత్వసుబుద్ధితో ప్రతిష్ఠించు చున్నాను. " అని హెచ్చరించింది.

భ ర్త : " నేను రేడియోగుండా మన చావడిలో ఈపై నుండి " జవహర్ " కావించెడు ఉపన్యాసములు వినుచున్నాను!" అని రెచ్చెను.

పిల్లలు : " మమ్మల్ని ఏమిచేయమంటారు ? " అని తండ్రికేసి ఒకపర్యాయం, తల్లికేసి ఒక పర్యాయం చూచిరి.

తండ్రి : " అమ్మచేసిన స్వీటూ, సేవరీ, లగాయించండి" అన్నాడు.

భార్య : " ఏంచేశానని మీవూహ ?"

తండ్రి ఆలోచనలోవుంటాడు. ఒక పిల్లవాడు తండ్రి దగ్గరసా వెళ్ళి చెవిలో వూదేడు " తీపి, జహాంగీరూ, అక్బరు పాదుషా, చేసిందండి ! మఱి మొహం మొత్తకుండా కారపు జంతికలు వేసిందండీ !" అని—

భర్త : " ఏమేవ్ ! జిన్నా కలిసిరాకపోయినా నీవు జహాంగీరును, అక్బరు పాదుషాను అభిమానంతో ఇంకా చూస్తూనే వున్నావు ?"

భార్య : " జిన్నా అంటే కలిసిరాకపోవచ్చునుగాని మేటి జహాంగీర్లు, అక్బరు పాదుషాలు మనకు తప్పరు, మనతోటివారె " ఎల్లకాలం !" అంది.

భర్త : " ఎల్లాకాలం " అన్న ఏస ఎక్కడ పట్టుపడిందే నీకు ? "

పిల్లలు : " ఈవేళ మన యింటిముందు ఇద్దరు ఫకీర్లు వచ్చి నిలబడి అదేదో కిర్రుకిర్రు తిప్పుకొంటూ పాడారులేండి. " ఎల్లాకాలం " అంటూ అని తండ్రికి తెలియబఱిచారు.

తల్లి : " పొద్దమే కాకుండా మనల్ని మన పిల్లల్ని దీవించారు కూడాను. "

భర్త : " మిక్కిలి శుభసూచకం ! తరుణమైనది ! అదిగో ! అఖండ భారతవర్ష స్వాతంత్ర్యోషస్సు ! జాగుచేయక, పిల్లలారా ! మీజనని. నా జాయ, మన నట్టింట నిలిపిన జాతీయ

పతాకను ఆరాధించండి. మాతో కలిసి అర్పించండి. ఆకాశమున కెగరవేయండి. అసలైన, సిసలైన స్వేచ్ఛను అందుకోండి! వందేమాతరం!"

.... .... .... .... ....

## సారమేయమవా? అప్రమేయమవా?

చావడి అంతా సైలెన్సు. సైలెన్సులోనే ఆమె అడుగు లోపలకు పెట్టింది. తెలిసికొన్నదప్పుడే అక్కడ ఆ చావడిలో కూచున్నది తన భర్తే అని—రుసరుస ముఖం అతనూ ఆమె భర్తే! అతను!

"లైఫ్ చూడవద్దటండీ!"

"కాఫీ టైముకు ఏడవవద్దటండీ?"

పై సంభాషణవాక్యాలు రెండూ కూడా అండీలతోచే అంత్యం చూపించడంవల్ల ఎవరేదన్నది, ఎవరు ఎవరిని మన్నించింది, ఎవరు ఎవరిని పలుకరించింది తెలిసికోవడం స్పష్టంగా వివరిస్తేనే గాని తెలిసికోవడం కష్టమేమో కాగితం మీద. కంఠాన్ని బట్టి తెలిసికోగలిగినా—మొదటి వాక్యం భార్యది. రెండోవాక్యం భర్తదీని. మఱి భార్య, "ఇక్కడ బల్లమీదపెట్టి, తలుపు తీసివుంచే వెళ్ళాను. ఇంకా అంతకంటె వెల్లడిగా ఎవరు చూపించగలరు చేసి? ఈ బల్లమీద పెట్టి వెళ్ళాను. కప్పునిండా పోసి సాసరులో కప్పు వుంచి" అని బల్ల చూపింది. "అవేనా?" దూరాన్ని ఉన్న ఉత్తివాటిని చూపాడు భర్త. "అవే! కాఫీ కాజేసే అల్లా ఇదవుతారు? టౌన్‌లో కూడా ఇంత ఖాయిదా

అవితే కష్టంసుండీ ! కాంత అన్నది బతకడం ! కార్యం నా దేకాంతంగాని కడాపటి దాకా ఏకాంతమే ? ఎందాకా అని ఈ తలుపేసు కూర్చోవడం ? ఇంట్లో పడివుండడమూను ? అయినా ఇంతలోకే ఎవరువచ్చి త్రాగేసేవారు ఉంటారు ? మన సావిట్లోకి వచ్చి ? కుక్కన్నా కావాలి ! పిల్లన్నా కావాలి !" అని అదో సమర్థగా అంది ఆ యిల్లాలు. విమర్శగా భర్త అనేడు "ఆ రెండూ అవితే యంత చక్కగా అంత వొబ్బిడిగా త్రాగిపోతాయూ ?" భార్య: "అయితే పరాయి మగాడే అంటారా వచ్చి తాగేసింది ? భర్త "మగాడే కానక్కరలేదు. ఆడదీ కావచ్చు."—"అవితే మీరు చూశారన్నమాటే ఎవరో ఆపె ?—"నివ్వెంత వొట్టుపెడితే అంత వొట్టు. నేనెవర్నీ చూడలేదు." — "అవి ! మీరే తాగేశారు ! తాగేశే యీ తగు వంతా"—

మగడు మాట్లాడడు. భార్య "అంతా ఐదు నిమిషాలు కాలేదండీ ఆలా వెళ్ళి. అదేదో మేళం తాళం వినిపిస్తే విడ్డూర మేమిటా అని వెళ్ళి చూచాను."

"వెళ్ళకపోతే మునిగిపోయిందా ?"

"ఇన్నాళ్ళూ వెళ్ళానా ? నిజంగా చెప్పండీ ! ఇక్కడ కాఫీ మీరు తాగలేదంటారా ? ఇంకా దాని ఆవిరి యంతరాళంలో యగపిస్తునే వుంది. పరిమళిస్తూనే ఉంది. ఇంతలోకే మాయం చేసే వాళ్లు ఎవళ్లు వచ్చిపోయేరు మన చావడిలోకి ? వా డెవడో ఇంట్లో తెప్పాలా తెడ్డూ ఏమన్నా సంగ్రహించుకుపోలేదుగదా ? చూశారా ఇల్లంతా సరిగా మీరు ? పోయేదాన్ని తలుపాపల గొళ్ళెం పెట్టి తాళం నొక్కుకుపోనన్నా పోయానుగాను. సరిగా

రెండు కావస్తూంది. మీరు టైముకు వచ్చి కాఫీ తాగక మానరు అని ఇలా వుంచి, అలా వెళ్ళాను. ఇంతలోకే ఇంత వింతా? ఫిల్టర్ కాఫీ కూడాను మనది."

భర్త బ్రేక్ "కాదని ఎవరన్నారు?"—ఆమె "అసలు నీలగిరి గుండుగింజల పొడుంతో చేసింది!" తిరిగి బ్రేక్! "నేను లేదన్నానా?" ఆమె "నేనూరికే ఓ చంచాడే చవి చూచాను పంచదార సరిపోయిందో లేదో అని తెలుసుకునేందుకు." మూడో బ్రేక్ "మిగతా దేమైందన్నానా?" ఆమె "ఏదో బుద్ధిగడ్డితిని ఈ రోజునే అవలకు వెళ్ళాను. మరెప్పుడూ వెళ్ళను. రండీ! ఇల్లంతా సరిచూదాం! ఇంట్లో ఎవడన్నా దూరివున్నాడేమో దొంగ?"

అందుమీద భార్యాభర్తలమధ్య మరి కొంత సంవాదానికి అవకాశం చిక్కింది. "దొంగంటే ఎలా వుంటాడో నీకు తెలుసా?" "దొంగంటేనే ఎఱగనంటారా?" "ఎప్పుడు చూశావు?" రోజూ పోలీసులు రోడ్డంట నడిపించుకు వెళుతూ ఉండడం ఎవర్నంటారు దొంగల్ని గాక." "వాళ్లు దొంగలు కారు. దొంగతనం వాళ్ళమీద మోపి ఇతరులు వాళ్ళను దొంగలుగా భావిస్తున్నారు. అసలు దొంగ కనేబడడు ఎవరికీని. ఎవరికీ దొరకనే దొరకడు." "పోనీలేండి దొరక్కపోతే పీడేపోయిరి. మీకాఫీ మాటేమిటి ప్రస్తుతం?" "కాఫీహోటల్లో త్రాగి అలా ఆఫీసుకు పోవడమే! మరి ఆలస్యమెందుకు లేవండి! ఈ మాటైనా తాళం వేసుకు వెడతా?" "ఎక్కడకూ?" "ఆ ప్రొసెషన్‌తో కూడా!" "మళ్ళీ రావడం?" "మీరు ఆఫీసునుంచి వచ్చేసరికి? "ఈవేళ ఒక గంటముందే వచ్చే

స్తున్నాను." "అలా అవితే ఈ తాళం మీవద్దనే వుంచుకుని, కుంప టంటించి, కూర తరుగుతూ వుండండి నేవచ్చేసరికి! 'త్యాగయ్య' సినీమాకు వెడదాం పెందలకడే!" "మరెక్కడకో వెళ్ళవు?" "అక్కడికే వెడతా! ఆమెకూడా భక్తురాలే" "ఆమె?" "ఆమేనండీ!" "ఆడదా?" "ఆడదే! నాలాంటిదే? అయితే నాకంటె లక్షరెట్లెక్కువపెట్టి పుట్టిందేమో! దేవు డామెకు ప్రత్యక్షమయ్యాడు! అంతా భక్తే! అంతా పరవశమే!" అట్లా అవితే ఆఫీసుకు వెళ్ళకుండా నేనూ వస్తాను నీతో!" "మీరు వచ్చేదాకా నేనుండను సుమండీ! భక్తి భక్తే! రక్తి రక్తే! ఇప్పుడు నేను పూర్తిగా భక్తి పరవశురాలనై యున్నాను. మీ రాపినా ఆగబోను." అన్నంతపనీ చేసింది ఆమె. నిమిషం ఆగలేదు ఆమె—భర్త తనను ఎక్కడ వెన్నంటిపోతాడో అని ఒకటే పరుగు. "ఈ తాగేసింది సారమేయమో? అప్రమేయమో? తేల్చకుండానే పోతావుటే కొంపలోంచి?" అంటూ వుత్తి కాఫీకప్పు చేతపుచ్చుకు భర్త నట్టింట చతికిలబడేలా ఆమె అంతలో అదృశ్యం అయింది.

.... .... .... .... ....

## భావుముఱది ఱూం

"ఓ కురూపుల్లారా! ఓ కబోదుల్లారా! రాజబాటను కొంచెం వోరగా నడచి పోలేరుటర్రా!" యని అనేటంత యసహ్యాపుటిదిలోకీ, అనుకోనంత యంటరానితనపు టాక్రమణలోకీ, వచ్చేశాడు భావనాచార్యులు.

భావనాచార్యులు యంటే సంపన్నగృహస్థు; స్ఫటికం లాంటి నైర్మల్యంగల ధోవతి, పచ్చని బంగారంలాంటి శరీరాన్ని ధరించి, ఏవేళా పట్టె నామాలు, బ్రాహ్మణ నియమాలు వదలనివాడు.

ఆవలివాళ్ళ వొళ్లు తనను రాచుకోలేదన్నమాట గాని, తనకళ్లు వాళ్ళను చూడక తప్పిందికాదు. తనచెవులు వాళ్ళబాస వినక తప్పిందికాదు. తన భావం వాళ్ళచేతుల్లోవున్న, నెలపురు డింకావెళ్ళని పాపాయిమీదకు ప్రాకక తప్పిందికాదు. "మీ గ్రుడ్డి తనానికి తోడు మీతోవాక పసిగ్రుడ్డా ?" అన్నాడు గట్టిగా గొంతెత్తి యడిగినట్టు, ఆ అడగడంలోనే యడుగంతదూరం గావించుకున్నాడు, తనముఖం జేవురించుకున్నాడు.

" ఒక డబ్బుంటే పడెయ్యండి బాబులూ ! కసరబోకండి. ఆడిమీదకు విసరండి. నా వొళ్లో బిడ్డ ఉంది " అని మగవాని మోచేతి కొక్కెంలో ఉన్న ఆడది అడుక్కొంది.

భావనాచార్యులకు వొళ్ళు మండిపోయింది. అయినా స్వత హాగా యతనికి ఎముకలేని చేయి కావడంచేత ఒక కానీ గిరాటు వేస్తూ, " మీకేనా శిశువుకూ లేవా కళ్ళు ?" యని అడిగాడు.

ప్రశ్నకు జవాబుగా తల్లి యతి ఉత్సాహంగా " ఈదే మమ్మల్ని నడిపిస్తూవున్నది. ఈదే మాకన్ను !" అంది.

మగ కబోదు " ఓసి ! యడికాదు ఆరడుగుతూ ఉన్నది. ఆడికళ్ళు కనబడుతూవున్నాయా ?" యని.

తల్లి " కాపడు తూన్నాయోలేదో ఆరే చెప్పాలి. మనకేం చూపులా ?" అంది. అంటూ బిడ్డ నక్కడుంచింది నేలమీదనే.

భావనాచార్యులు ముందుకు చన్నవాడు వెనక్కు చటాల్న వచ్చి ఆ పసికందు రెండు నేత్రాలూ, నెన్నొదురూ కనుగొన్నాడు.

శిశువుకు రెండుకళ్ళూ నిక్షేపంలా గగపిస్తూవున్నాయి. వాని కళ్ళల్లో చెట్లచిగురు, ఛిన్నగిత్త. ఇంకా రోడ్డంట నడిచే జనం, నింగిని మసలె మబ్బుతునక యన్నీ ప్రతిఫలిస్తూ వున్నాయి.

"వీడికేం, వీడు దివ్యంగా చూస్తూవున్నాడు; దేదీప్యమానంగా ఉన్నాడు! యని అంటూ భావనాచార్యులు వానిచేతిలో ఒక రూపాయ పెట్టాడు.

శిశువు గుప్పిట్లోని రూపాయి సహజస్పర్శను తెలిసికొంటూ అంధుడు "బాబుల్కూ బిడ్డ పాపలున్నట్టున్నారు. వీడు నాకు మేనల్లుడవుతాడు మా బావుమఅది ప్రేమ వొట్ఠి గ్రుడ్డి ప్రేమ. దీని దగ్గఱకూరికే వస్తూపోతూ వయ్యారం వొలికించి వెళ్ళేడు, పిల్లాజెల్లా దీనికిల్లా తయారు. కనేబాధ్యతేకాని పోషించే బాధ్యత లేదంటాడు. ఆడిదుత్తి గ్రుడ్డిప్రేమ" అన్నాడు.

భావనాచార్యులు: ఇంకా మీరిద్దరూ భార్యా భర్తలనుకున్నాను దీని మగనికి కళ్ళున్నాయా?" అని అడిగాడు.

"అదీ మారాజులు మీరేచూచి చెప్పాలి" అన్నాడు అంధుడు.

అంధురాలు "లేకేమండీ! ఆడికళ్ళు నా మగని కళ్ళు అంతంతకళ్లు, చేరదేసికళ్ళు! అని కళ్ళు కొలిచి చూపించింది. దానిలో వెలుగెంత విస్తరించిందో! బిడ్డని తన బొమ్మలకల్లా అద్దుకుంది!

భావనాచార్యులు అప్రయత్నంగా కళ్లుమూసుకున్నాడు, ఆమె తన కట్టెదుట ఆరుబయట సత్తెగోపులా బిడ్డడికి పాలిచ్చుకుంటూంటే.

అంధుడేమీ కనుగోకుండానే ఇలా అనేడు. "లోకం గ్రుడ్డిది. మమ్మల్నిద్దర్నూ మగడూ పెళ్ళా లనుకుంటుంది!

కాని నన్ను ప్రేమించే గ్రుడ్డిది ఇప్పటి కెక్కడా పుట్టివున్నట్టు కాపడదు. మళ్ళీ మాబాబు గ్రుడ్డోడు. మా అమ్మ గ్రుడ్డిది. ఆళ్ళిద్దరూ తనువులు చాలించేశారు. ఈ గుడ్డివాళ్ళను మమ్మల్నిద్దర్నీ విడిపోకుండా వుండండంటూ లోకానికి వొప్పజెప్పి వెళ్ళిపోయినారు బాబులూ ?" అన్నాడు.

భావనాచార్యులు "అయితే మీ భావుమఱదికి కళ్ళు కనబడతాయి ?" అని ఆశ్చర్యపోయినాడు.

అంధు డంటాడు "కనబడ్డాంలోనూ ! సరాయి మగవాడెవరన్నా భార్యవంకచూస్తే పుచ్చెగరేసేస్తాను !" అనేటంత బూం మా భావుమఱదిబూం " అన్నాడు.

భావనాచార్యులు మరొక్కనిమిష మక్కడ నిలబడితే వొట్టు !

.... .... .... .... ....

## నిరుత్తరుని పెళ్లి !

" వెంకట్రాజు, వీర్రాజు, బుచ్చిరాజు "

ఈలాంటి పేర్లకుమల్లే, విరాట్రాజు అనే పేరు కలియుగ ప్పేరుగా దోచదు. అది కేవలం ద్వాపర యుగ సంబోధనంగా వుండిపోయి భారతం చదువుతూంటే వినరావడమేగాని, వేరేవరుసను, కీర్తిమోసినట్టు నాకెక్కడా పొడగట్టదు.

చూదొస్తే విరాట్రాజు విగ్రహం గొప్ప విగ్రహంగాను దర్జావంతంగాను ధర్మరాజులుంగారంత ఘనంగాను తోలుబొమ్మల తెరమీద తేటగా కానవస్తుంది.

మరేంచేత పెట్టుకోరో ఈ కలియుగంలో మానవులు ఆ మహారాజు పేరు? అయినా పిలిచి చూస్తాను కథలోగానీ ఏమైనా పలుకుతుందేమో!

"విరాట్రాజుగారూ! విరాట్రాజుగారూ!"

"ఓయి ఎందుకు పిల్చారు నన్ను?"—

మరి పచ్చివెలక్కాల గొంతుక పడ్డట్టయింది. "ఎందుకు పిల్చానురా దేవుడా?" యని అనుకుంటూ ధైర్యం తెచ్చుకుని— "అయ్యా! తమకు కుమాళ్ళు వున్నారా?" యని అడిగాను.

"లేకేం? లేకలేక కలిగిన వొక్కడూ లక్షమందిలా సలక్షణంగా వున్నాడు" అన్నాడు అతి గర్వంగా.

"అయితే వాని పేరు?"

"నిరుత్తరుడండీ!" అన్నాడు.

"ఏమండీ! తమ పేరు విరాట్రాజుగారై యున్నప్పుడు మీ అబ్బాయిగారి పేరు ఉత్తరుడని పెట్టక నిరుత్తరుడని పెట్టారేం?" యని అడిగాను.

"మాట్లాడితే అందరు ఉత్తరకుమారప్రజ్ఞ లనిపోతారు. ఉత్త చవటైపోతాడేమోనని నిరుత్తర నామధేయునిగా జేశాను" అని నిదానంగా జవాబు చెప్పాడు ఆ వ్యక్తి.

ఒక్కపట్టాను పకాల్న నవ్వుతూ—"మూగవాడు కాదు గదా కొంపతీసి!" అన్నాను.

"కాదులేండి! వాడికి ఎంతో అవగాహనవుంది. అవులిస్తే పేగులు లెక్కెడుతాడు! అష్టవర్షాదపి!" అన్నాడు.

"బుద్ధిమంతుడేనా?"

"ఆఁ! మగపిల్లవాడు కాబట్టి అష్టవర్షాలున్నా అష్టాదశ వర్షాలున్నా బుద్ధిగానే వుంటాడు. చూడండి! అయినా ఇంత

తికమకగా నన్నెందుకు ప్రశ్నిస్తున్నారో బోధపడకుండావుంది. మీవద్ద ఏమైనా కన్యవుందా ?" అన్నారు విరాట్రాజుగారు నావంక అట్టే చూస్తూ.

" నావద్ద కన్యాలేదు గిన్యాలేదు ! అన్యాపేక్ష లేకుండానే మిమ్మల్ని ఆహ్వానించాను. అయితే మీవాడు ' నార్మ ' లేనా?" అన్నాను.

" ఆ ! శుద్ధ నార్మల్ ! దచ్చాలు కొట్టనే కొట్టడు. అసలు ' నార్మల్ ' అన్న పదమైనా ఈ రోజున నేర్చాను. వానికి, ఇదివఱకు అదికూడా తెలీదు. అంత నిరుద్రేకుడు. రోజూ తన ఉష్ణం కొలుచుకుంటూ వుండవలసిందని చెప్పి ఒక థెర్మామీటరు, దాని మర్మమంతా చాల భాగం చెప్పి, నార్మ ంటే ఇదిరా యన్ని ఆ దాని నల్లని V లాంటి సంకేతాన్ని చూపించాను. తండ్రి కుమారునియెడల చూపించవలసిన బాధ్య తంతా చూపించాను నేటి వుదయం ! ఇప్పుడే చూపించి ఇలా వీధిలోకి వచ్చాను ! ఎబ్ నార్మలవితే వాడి ఖర్మం " అన్నాడు.

అంటే నేను చిరునవు నవ్వాను.

విరాట్రాజు వెంటనే—" ఏమండోయి ! మీనవ్వు పరాసికపు నవ్వుగానూ తోచడంలేదు. పరకాయింపు నవ్వుగానూ తోచడంలేదు. మీవద్ద పెళ్ళికాని అమ్మాయివుంటే మాఅబ్బాయికి చేసుకోవలెనని నాకు ఘట్టిగావుంది అభిప్రాయం. మీరు ఒక పర్యాయం మాయింటికి దయచేసి మాపిల్లవాణ్ణి చూచుకో వచ్చును. వానిలో ఎట్టి ఎబ్నార్మాలిటీస్ లేవు !" అన్నాడు.

విరాట్రాజుగార్కి వెంటనే నాకృతజ్ఞతా పూర్వక వంద నాలుచెప్పి అంతసేపు నించోబెట్టినందుకు క్షమించమంటూ సెలవు పుచ్చుకున్నాను.

ఆయన్ను నేను అంతగా ఎందుకు మన్నించవలసి వచ్చిందో పాఠకు లీసరికి గ్రహించేవుంటారు. నాదగ్గఱ వొక్క మూడేళ్ళ ఆడపిల్ల వుంది. ఎప్పటికైనా విరాట్రాజుగారు మాకు మగపెళ్ళివారు అయ్యే అవకాశంవుంది. మరిన్నీ విరాట్రాజు గారు! అందుచేత ఆయన అన్నివిధాలా మన్నింపబడవలసిన పెద్దమనిషిగా తోచారు!

మామూడేళ్ళ ఆడపిల్ల కొంతకాలానికి ఇరవై మూడే ళ్ళొచ్చి, ఎల్. ఐ. ఎమ్. లేడీ డాక్టరు అయింది. ప్రైవేట్ ప్రాక్టీసు పెట్టింది. పెళ్ళాడనంటూ వచ్చింది ఎవర్నిని.

"పోనీ నిరుత్తరుడుగార్ని ఓతూరి చూసిరా! అమ్మాయీ!" యని కోరాను.

కోరిన వేళావిశేషం ఎలాంటిదో-వెళ్ళింది! కాదనకుండా!

వెళ్ళీవెళ్ళడంలోనే చూసిందట. నిరుత్తరుడుగారు ఇంకా ఆ యీడునకూడా ఉష్ణం కొలకాచ ఊచ అస్తమానం నోట బెట్టుకు నార్మల్ గమనించుకుంటూ స్తబ్ధుగా వుండడం, పరుండి వుండడంన్నూ.

వెడుతూనే ఆ థెర్మామీటరు తీసివేసి నేలనేసి కొట్టిందట! మాఅమ్మాయి.

ఉలిక్కిపడిలేచి యువకుడు నేలమీద చిందులు త్రొక్కే పాదరసం పలుకుల్ని పలికించాట్ట! "ఇది గంతులేస్తూందే? ఏమిటి చిత్రంగా వుంది!" అని అడిగాట్ట.

"ఇది పాదరసం! గాజుగొట్టంలో కణికగా వున్నంత సేపూ—మంచంమీద మనిషి కాళ్లు ముడిచి సాచుకునే పొసిషన్ తప్ప మఱో పొసిషన్ చూపించడు. బద్దలకొట్టి ఇవతల

పదేశామూ ఇల్లంతా గంతులేస్తుంది! అసలు ఇది స్ట్రైట్ లైన్ కోలమ్‌గాదు " అని చూపించిందిట.

" మరి మానాన్న దీన్ని పాదరసంగా వర్ణించేదేలేదు. దీని కింత గంతూ వింతా వుంటేను!" అంటూ వంగివున్న నిరుత్తరుడు, గెంతి వురికినట్టుగా మంచంమీదినుంచి కిందికి వురికి——

" నేలను పాదరసం - నీలోను సరసం. "

అంటూ పాడుతూ మా ఎల్. ఐ. ఎమ్. లేడీ డాక్టరమ్మాయిని అమాంతంగా ప్రేమించి వూరుకున్నాట్ట! వానిలోని ఆ ' ఎబ్ నార్మలిటీ ' వల్ల ఈమె తత్వంకూడా వెంటనే మారిపోయిందట.

మరి వ్రాయడానికేముంది? విరాట్రాజుగారి కోరిక నెరవేరింది. నాపాచిక పారింది,

.... .... .... .... ....

## సారీలో బద్దాడు గార్డు

తెనుగువాళ్ళకు ఇతరభాషలు అబ్బవు కాని, ఇతరులకు తెనుగుభాష సులువుగా యబ్బేటట్టు కనబడుతుంది.

అయినా తెనుగువాళ్ళు పక్కా తెనుగు మాట్లాడ్డంగాని వ్రాయడంగాని యరుదు. ఏదో ఇతరభాషల సాంకర్యం వుండక తప్పదు.

* * * * *

వానికి " ట్రేడ్‌లో బలే నేక్ " వుంది యన్నాడు బస్సులో కూర్చుని వొక కోమటి.

చూడండి : ఇంగ్లీషుమాటలు రెండు ఆ కోమటి గొంతు గ్గుండా గాలిలోకి దొర్లింపబడ్డాయి.

ఇలాగ్గానే హిందీపదాలు ప్రతీనిత్యం కిస్మత్, ఔర, దున్యా ఇత్యాదులు గుండెలు చీల్చుకు వచ్చేస్తుంటాయి ఆంధ్రుని నోట.

అరవం యరచేతిలోని ఉసిరిక ఆంధ్రులకు, ఎన్న, ఇల్లె, కత్తిరికాయ, ములహాప్వాడి ఇత్యాదులు కొల్లలు ఉభయ గోదావరీ మండలాల్లోనూ.

మఱి హిందూస్థానీ మాట్లాడ్డానికి తెనుగువాండ్లే మిన్న గాండ్లు. కబడ్దార్, ఖడేరావ్, ఇవన్నీ ఎప్పటికప్పుడు రోడ్డు దుమ్ములా ఎగిరి ఎదరవాణ్ణి దుమ్మెత్తి పోస్తూనే ఉంటాయి.

కాని వొక్క భాషలోనూ యచ్చంగా స్వచ్ఛంగా 'జటి లంగా శాస్త్రకట్టుగా సంపూర్ణప్రజ్ఞ యలవరచుకొన్నది కానరాదు. అలవరుచుకోడు ఆంధ్రుడు.

తన భాషే తనకు రానివాడు మరోభాషలో మాత్రం ప్రవీణుడు కాగలడా ? కాలేడు సరిగదా ఎవరైనా ఎదురైన జాను తెనుగు మాట్లాడేవాణ్ణి చూస్తే ఈసడింపు కూడాను, ఈ రోజుల్లో కూడా ఇంకా వెధవ తెనుగేనా అని.

అంచేత ఈ కథయొక్క మకుటంలోనే రెండు ఇంగ్లీషు మాటలు వాడేశాను. “ సారీ ” అని, “గార్డు” అని.

“గార్డు” యన్నది పూర్తిగా తెనుగుపదం అయిపోయింది యని యనుకోవచ్చు. లోగడ వదినె పాటల్లో “ గార్డు దొర ” శృంగార నాయకునిగా ప్రవర్తించిన జ్ఞాపకం. అయితే “ క్విట్ ఇండియా ” వచ్చాక “దొర” శబ్దం పోకతప్పదు. కాబట్టి కథలో “గార్డు” అనే వాడాను. సింపిల్ గార్డు !

దొర—గార్డు అయినా దొర—కాని—గార్డు అయినా ప్రతీ రైలు గార్డూ స్యూట్ మీద ట్రిమ్‌గా ఉండక తప్పదు. అందులోనూ మెయిల్ గాడీ గార్డు ఈ "వరల్డు" మనిషిలా కనబడడు.

ప్లాట్‌ఫారమ్ సిమెంటుదైనా రబ్బర్ మీద నడచినట్టుగా ఎగిరెగిరిపడుతూ నడుస్తాడు. బండి ఆగిన పదినిమిషాలు డైనింగుకార్ నుండి కోలింగు ప్లాంకుదాకా, కోలింగుప్లాంకునుండి డైనింగుకార్ దాకా!

మధ్యేమధ్యే తేనీరుచ్చుకుంటాడు.

మరిన్నీ స్టేషన్ మాస్టర్ను మన్నిస్తూ మన్నన లందుకుంటాడు. గడియారం ముళ్లూ కనురెప్పలూ ఏకమయ్యేటట్టు రిస్టువాచ్ గమనిస్తూయుంటాడు.

పచ్చజండా విప్పుతూ ఉంటాడు. చుడుతూయుంటాడు. అంతా ఎక్కారో లేదో కంటూవుంటాడు.

బ్రేక్‌వాన్‌లో సామాను లెక్క చూచుకుంటాడు. సహవాసుల్ని చిరునవ్వుతో పలకరిస్తూ ఉంటాడు. వాళ్ళ సౌకర్యాలను గురించి సెంట్ పెర్సెంట్ యోజిస్తాడు.

ఒక్క "వర్డులో" మెయిల్‌గాడీ గార్డు ఫుట్‌బాల్ గేమ్‌లోని "ఫార్వార్డు" అనుకోండి.

* * * * *

గంట కొట్టారు ఎంజిన్ వాటరుతాగి కోల్ తిని తయారీలో విసిల్ వేసింది. మరి గార్డు పచ్చజండా ఊపడమే తరువాయి. అవితే గార్డు ఎవరికోసమో యన్నట్టు ఇటూ యటూ త్రచ్చాడుతూ పచ్చజండా ఊపడాయిరి. అంతా కిటికీలగుండా గుమ్మాలగుండా బండీనుండి తొంగి చూస్తూ వున్నారు.

ఒక ప్రయాణీకురాలు-చక్కని చీర కట్టుకు రెండోతరగతి లేడీస్ కంపార్టుమెంటువద్ద ఎక్కకుండా నిలబడివుంది, ప్లాట్ ఫారమ్ మీదనే—గార్డు తన హడావిడిలో ఆమెను చూశాడో లేదో, ఆమె చీర తగిలాడు. తగుల్తూ వెంటనే "సారీ" అన్నాడు.

ప్రేక్షకుల్లో కొందఱు "మరి గార్డు 'సారీ'లో బడ్డాడు. మెయిలు వెళ్ళినట్లే !" అన్నారు.

కొందరు "గార్డు లోబడ్డాక 'సారీ' ఏం ? జోలీ గుడ్ కంపెనీ" అన్నారు.

ఇంగ్లీషు "సారీ"కి తెనుగులో రెండర్థాలు. 'చీర' అని వొకటి. విచారకరమని వొకటి. కాని ఆ భాషలో వర్ణక్రమం వేఱు—వ్రాయడమంటూ వస్తే.

ఆమె—ఆ స్త్రీ—"నో మేటర్ ! ఇందులోనేనా కూర్చునేది" యని అడిగింది.

గార్డు "మీ కోసమే చూస్తూయున్నది అని ఆమెను నఖశిఖపర్యంతం చూస్తూ "చీర కట్టేరే ! పోల్చలేకపోయినాను గెట్ ఇన్ ప్లీజ్ ! గెట్ ఇన్ !" అన్నాడు.

గట్టిగా ఈలేశాడు. పచ్చజండా రుంయింని విప్పి వూపాడు బండీ నడుస్తూయుంటేనే గార్డు తన రేక్‌లోకి, ఎగిరి ఎక్కినట్టు ఎక్కేశాడు.

మహాచెడ్డ నవ్వు నవ్వేశాడు.

*　*　*　*　*

అయితే వొక సందేహంలో పడ్డాడు. "ఆ దొరసాని చీరకట్టి తల్లో పువ్వులుకూడా పెట్టుకుందా ? లేదా ?" అని.

అందుకోసం ఆమె తలకట్టెన్నిమాట్లు చూదామన్నా గార్డుతో ఆమె ముఖాముఖి మాట్లాడ్డమేగాని తలకట్టు చూపింది కాదు.

"చీర కట్టుకుంటే ఈ భారతీయులు మమ్మల్ని ఉండనిస్తారనుకుంటాను ఇండియాలో" యంది ఓచోట గార్డుతో.

"చీర కట్టుకుంటే చాలదు. పువ్వులుకూడ పెట్టుకోవాలి" అన్నాడు గార్డు.

ఆమె "అవీ పెట్టుకున్నాను. అదిగో చూడు నా తలకట్టు" యని చూపించింది తల్లో పువ్వులు.

"సారీ" అన్నాడు గార్డు.

"ఏం" అంది ఆమె.

"పువ్వులు డాఫోడిల్సులాగున్నాయి. డాఫోడిల్సు బిలాంగ్ టు ఇంగ్లండు" అన్నాడు గార్డు.

"ఐ కాంట్ హెల్ప్ ఇట్. ఆఫ్టరాల్ వి ఆర్ ఏంగ్లో ఇండియన్సు. అవీ పెట్టుకుంటాం. ఇవీ పెట్టుకుంటాం. అన్నీ పెట్టుకుంటాం" యంది ఆమె. "సారీలో గౌను లేదుకదా?" యని అడిగాడు గార్డు.

ఆమె చిరునవ్వు నవ్వింది.

"ఇండీడ్. ఎవెరీ సారీ ప్రోబ్లెమ్. దిస్ క్వైట్ ఇండియా ప్రోబ్లెమ్. యు. సి. బ్లడ్ ఈస్ థిక్కర్ దాన్ వాటర్. బట్ వాటర్ ఈస్ ఎస్సెన్షియల్ ఫర్ మై ఇంజన్. ఐ కాంట్ లీవ్ దిస్ ఎంజిన్. ది ఇంగ్లీష్‌మన్ కాంట్ లీవ్‌యూ" యన్నాడు గార్డు. అంటూ ఆమె సారీకేసి మరోసారి చూచాడు.

ఆమె 'సారీ' అంది.

..... ..... ..... ..... .....

# రణగౌణ తిక్కన్న - వీధిగోడమీద

ఆ యింటి యజమాని పేరు రణ గౌణ తిక్కన్న. "రణ" కు "గౌణ" కూడా చేర్చియుండడంచే, యది ఆయన "నిక్‌నేమ్" యని మనం యనుకోవాలి. మఱీన్నీ యసలుపేరు ఈ లోకం మఱచిపోయింది యనికూడా మనం తలపోయాలి. కాకపోతే ఒక మనిషి. ఒకమనిషి కాకపోతే అయినా యసలు పేరుతో పిలువరూ ? "నా" యన్నవాడు కూడా ఆయనగార్ని "రణగౌణ తిక్కన్న" యని సంబోధించడమే. అలా పిలిచారని ఆయనకు యభిమానం లేదు, ఆగ్రహం లేదు.

ఏంచేతా యంటే, పూర్వకాలమందు యుద్ధరంగంలో రణతిక్కన్న ఎంతటి కీర్తిగాంచి చన్నాడో, ప్రస్తుతం సాంఘిక వేదికమీద ఈ రణగౌణ తిక్కన యంతటి కలుపుగోలుతనం సంపాదించుకు మననేర్చేడు.

మర్యాదకు మర్యాద, మంచికి మంచి ఇచ్చి, చూపడంలో ఆయన తరువాతనే ఎవర్ని చెప్ప దొరకన్నా: కొందరను కుంటారు గాక, ఆయనకు ఈ పరిచయ ప్రస్తావన యంతా ఆయన భార్యవల్లను అనీ, మఱి కొందఱనుకొందురు గాక, ఆయన ఎడపాదడపా పోసే తేనీరు ఇత్యాది పానీయాల వల్లా, వేసే మెత్త కుర్చీలవల్లా, ఎడతెరపి లేకుండా వ్రాసే ఉత్తరాల వల్లా యని నేనంటాను. అవేమీ కావంటారు.

"వాలైన జడ ఉన్న—మేలైన నడవడి" ఆయన ఇల్లాలిది. మఱీన్నీ చోరుల్నే కాకుండా జారుల్నికూడా పసికట్టి, అరికట్టే స్వభావం వారి యింటి కుక్కపిల్లది. ఆలాంటి

సందర్భంలో మనం రూఢిపఱచుకు తీరవలసిందే. రణగొణ తిక్కన్నగారి యిల్లు, సాంఘిక వ్యవహారాలకు సుతరాం పనికి రాదని. అయితే ఆయన మహా భాగ్యం అది! ఆయన చేసుకున్న పూర్వజన్మ సుకృతమది! మిక్కిలి సాంఘిక వ్యవహర్త యని గణ్యత గాంచేడు.

అందఱికీ వాంఛనీయమే ఆయన్ను ముందుబెట్టుకు, అమెతో అనగా ఆయన భార్యతో మాట్లాడుతూ ఉండడం. ఇంత ఇలా సాంఘిక రాయుడూ అయి రణగొణ తిక్కన ప్రవర్తిస్తూ తన యిల్లాలిని ప్రవర్తింపజేస్తూవున్నా ఎందుకో? అతనికీ తప్పిందికాదు, ఒకనాటి వింతచర్య! అయినా ఎంతకాలమని ఉండబట్టుకూరుకోగలడు? మనిషి అయినవాడు? తానెంత సాంఘికవాది అయినా?——

రోజూ సాయంకాలం వాహ్యాళి వెడలి రణగొణ తిక్కన్న తనయింటికి సరిగా 7.30 గంటలకు రాత్రి తిరిగివస్తూ వుండడం పరిపాటి. ఆ వస్తూవుండే సమయానికి ఇంట్లో రేడియో ఏదో ప్లేట్‌పాట పాడుతూ యతగాడికి స్వాగతమివ్వడం, వీధిలో రోడ్డుమీదనుండి ఒకానొక పురుషవ్యక్తి నిశ్శబ్దంగా వీడ్కోలు గొనడం——అనగా చల్లగా జారిపోతూవుండడం. పైకి చూస్తే డాబామీద ఆవిడ, ఇంకా ఆకాశంలోకి చూస్తే కొన్ని చుక్కలూ అవీని!

ఒకరోజున ఈ దృశ్యం అంతా సహించలేక, అవతల వ్యక్తిని ఏమని యనుకోడానికి వల్లగాక, భార్యను పిలచి, "చూచావుటే? ఈ దాకాను మనవీధి గోడమీద, తెల్లటి గోడ మీద?" అన్నాడు.

"ఏం ఎవరైనా కిట్టనివాళ్లు ఏమైనా వ్రాశారా? మరకలు గావించారా? మసిపూశారా? ఈ వేళే అవన్నీ గోకించి, తెల్లగా వెల్లవేయించాను కూడాను" యని అంది. "మరకలు మన్ను మశానం అవితే ఫరవాలేదు. మళ్ళీ వెల్ల వేస్తే పోతాయి. నే చూచింది మనిషినీడ" అన్నాడు. మరి ఆ మనిషి ముందుకు నడిచేలో మాయం గాలే ఆ నీడ?" యని అడిగింది ఇల్లాలు. తెల్లబోతూ "మాయమైంది అంటావా?" అంటూ వెంటనే భార్యా సమేతంగా వీధిలోకి వచ్చి నిలిచి దృశ్యం చూచేడు.

ఆవల పురుషుడు ముందుకు సాగి మతో ఇంటి గుమ్మం ముందు నిలుచుండి, తన నీడచేతను ఆ యింటి తెల్లటిగోడను నలుపు గావిస్తున్నాడు.

"చూచావుటే! నా అడుగుల సవ్వడిలో ముందుకు సాగి ఆ యింటిగోడను పాడుచేస్తూ వున్నాడు. వీణ్ణి తగలెయ్య! వీణ్ణి ఈ వీధిలోకే రాకుండా చేయాలి. వీడికి బొత్తిగా సంఘమర్యాద తెలియదనుకుంటాను" అన్నాడు రణగొణ తిక్కన్న. భార్య "పోనీ, పిల్చి కనుగోండి యతని తాత్పర్య మేమిటో! నిజమే ఇల్లా నీడలు నిలుపుకుంటూ పోతే తెల్లనిగోడల ప్రయోజనం ఏమిటి కనుక, లైట్లు ఉపయోగమేమిటి కనుక" అంది.

ఆవల వ్యక్తిని వెనక్కు పిలవడమా తాము నడచివెళ్ళి ఆవల వ్యక్తిని కలుసుకోవడమా యనే సమస్యలో పడ్డారు భార్యా భర్తలు.

అంతలో ఎవడో దారే పోయేవాడు రణగొణ తిక్కన్న దంపతుల్ని ఇద్దర్నీ బాగా ఎఱిగున్నవాడు "ఏమిటండో! మీ రిద్దఱూ ఇంటితలుపులు ఆలా బారెట్టేసుకు వీధిలో నిలబడి

వున్నారు. లోపల ఎవరైనా కొత్తగా ప్రవేశపెట్టారా ?" యని అడిగాడు. "లేదు. పాతరేడియో పౌరాణికుడేనండి" అని సమాధానం చెప్పారే కాని ఆ యిద్దఱుకూడా అసలు సంగతి చెప్పలేదు.

ముందు సాగిన వ్యక్తి వెనక్కి ఒకడుగు వేసి ఈ నూతన వ్యక్తిని కలుసుకుని—ఆ వీధిలో కాపురం ఉండే వాళ్లు యందఱూ వినేలా ఇలా అన్నాడు: "ఇప్పటికి కొన్నాళ్ళ నుంచి వింటూయున్నాను. ఈ వీధిలోని ప్రతియింటా ప్రతియింటి గుమ్మం ముందూ ఈ గంటప్పుడు అన్ని యిళ్ళల్లోనూ ఒకటే పాట ఒకటేపాట వెరైటీ లేదు "మైజానీవాలా"యే! దాని కోసం ఇంటింటా రేడియో ఎందుకు ? అందఱూ ఈ గంటప్పుడు ఓ చోట కూర్చుని వింటే చాలదూ ? సాంఘికపు వంటిళ్ళూ, సాంఘికపు పిల్లలబళ్ళూ, అనే ఈ రోజుల్లో ఈ రేడియో గూడుపుఠాణి లేమిటి చెప్పండి: ఎందుకు చెప్పండీ! వట్టి దూబరా యింటివారికి. పైవాడికి నా బోటివాడికి ఎక్కడలేని గాబరా! ఇంట్లోకి దూరి వినడమా ? వీధిలో దారే వినడమా ? అని మీరూ వినేవుంటారు. అక్కడా "మైజానీవాలా" పాటే! ఇక్కడా "మైజానీవాలా" పాటే. ముందింట్లో అంతె. మళ్ళీ ఇంట్లోవాళ్లు వింటున్నారా అంటే—ఆడాళ్ళు డాబాలమీద పొరుగిళ్ళ అరుగులమీద, మగాళ్లు "కార్డు ప్లే" కలాపంలోనూ "నో ప్లే" ప్రలాపంలోనూ యని విమర్శించాడు కూడాను యతి ప్రశాంతంగా.

మర్నాటినుంచి రణగొణ తిక్కన్న దంపతులు తమ యింట్లో రేడియో కట్టేశారు, మఱి వారి వీధిగోడమీద నీడలకి నిలుపులూ లేవు—నలుపులూ లేవు.

.... .... .... .... ....

# మనస్సు చిగర్పటమా - మానం చిగర్పటమా

జగ జిగీష్ శరదమ్మకు ఏకైక పుత్రుడు, ఆపె పేరు శరదమ్మ. "శారదమ్మ" అనుకునేరు గనుక పాఠకులు. ఈ పరాకు ఎందుకు సూచిస్తూ వున్నానూ అంటే ఒక పేరుకు ఒక పేరు తారుమారుగా గొన్నారా యంటే మనుష్యులే మారిపోగలరు మీ దృష్టి పథంలో. మరిన్నీ శరదమ్మ వితంతువు. శారదమ్మ లందరూ సౌభాగ్యవతులై యుండవచ్చును ఈ లోకంలో. వితంతువైనా పునర్వివాహం చేసికోరాదా ఆవిడ యని అనుకో బోయినప్పుడల్లా ప్రజా వాక్యాని కడ్డంగా నిలుచున్నట్టు నిలబడి పోయి కనబడేవాడు జగజిగీష్.

తండ్రి పోయేసరికి జగజిగీష్‌కు మూడేండ్లో నాలుగేండ్లో ఆ పిల్లణ్ణి పెట్టుకు వాడి చదువు కోసంగాను, వాడి అయిదో ఏటే శరదమ్మ ఒక పట్నవాసంలో ఇల్లు అద్దెకు తీసుకుని కాపురం ఉంటూవచ్చింది. ఏది ఏర్పాటు చేసినా, ఏమి కొన్నా ఏమి వండుకున్నా జగజిగీష్‌ను సంతృప్తిపఱచడానికి, సమాధా పఱచడానికీ చేసేదికాని, తనకోసం ఒక్కటీ చేసుకునేదికాదు శరదమ్మ. ఆమెకు భర్త పోయినప్పటినుంచి మఱి పబ్బం లేదు పండగా లేదు.

అయినా పిల్లవాడికొఱకు రేడియో కొంది. కుర్చీలు మేజా బల్లలు అవీ చావడిలో అమర్చి వుంచింది. పెద్ద రెండంతస్థుల యిల్లు అద్దెకు తీసుకుంది. విశాలమైంది చావటి, రెండో అంతస్థు మీద్ది టెర్రేసు! కాని టెర్రేసు ఎప్పుడూ ఆమె ఎక్కిందిలేదు. అసలు రేడియో అమర్చిన ఆసామీలే రేడియో గడకర్రకూడా

పెర్వేసు మీద నిలిపారు. పిల్లడు మాత్రం రోజూ ఇల్లంతా తిరుగుతూ, పెరేసు ఎక్కుతూ అతి స్వేచ్ఛగా అతి అప్-టు-డేట్ ఊహల్తో "మాంటుసోరీ" ఛాత్రుడిలా అయిదో ఏటనుంచి పెరుగుతూ వచ్చాడు. వాడి కేవేవో కథలు వినిపించేది శరదమ్మ. కబుర్లు చెప్పేది.

ఒకనాడడిగాడు జగజిగీష్ "అమ్మా! ఉగాది ఎప్పుడు అని—అప్పటి కింకా వాడికి పదేళ్ళైనా లేవు. చైత్రశుద్ధ పాడ్యమికి అంటే వాడికి తెలుస్తుందా?....

"మోళ్లు చిగిరించాలిరా!" అంది. అంటే పిల్లడు "మోడంటే?" అన్నాడు. "తనలాంటిది" అని శరదమ్మ తొల్త అనబోయి, పిల్లడి కది విచారకారణం కావచ్చునని వెన కాడి, "మన పెరేసుమీది గడకర్రలాంటిది" అంది.

నాటినుంచీ జగజిగీష్ ఆ గడకర్రకేసిచూస్తూ,

అదెప్పుడు చిగిరిస్తుందో అని కాసుకూర్చునేవాడు. అయితే రేడియో వాగే నిమిత్తం నెలకొల్పిన గడకర్ర ఎన్నడైనా చిగిరిస్తుందా? ఆ గడకర్రల వాలకం, దిష్టిబొమ్మలకు బదులు మంచి మంచి మేడలమీద ఉంచినవేమో అన్నట్టు, పీలగా, పేలవంగా, వాలిపోతూ, బ్రహ్మాండమైన హర్మ్యాల అందంకూడా చెడగొడుతూ దండెపు కర్రలకంటె అన్యాయంగా కనిపిస్తాయి. అవి చిగిర్చేదేమిటీ—ఎదో మాటవరసకు అంది కాని శరదమ్మ.

ఎట్టకేలకు నిజంగా ఉగాది ఉదయం వచ్చింది. జగజిగీష్‌కు నాడు తలంటి, కొత్తబట్టలు తొడిగి, చీకటితోనే తినీ ఆహారంగా వేపపువ్వు పచ్చడి నవకాయ రుచుల్తోటీ తినిపించింది తల్లి.

తింటూ తింటూ వున్న జగదీష్‌కు ఏమిజ్ఞాపకం వచ్చిందో - చటక్కున పై చష్టా మీదకు పరుగెత్తుకెళ్ళి క్రిందికి తిరిగివచ్చి "అమ్మా! తెప్రేసు మీద గడకర్ర చిగిరించలేదేం? ఉగాది పండగ వచ్చినా?" యని అడిగాడు.

ఆలోచించి, కంట తడిపెట్టుకుంటూ—"మనస్సు చిగిరించడమే యుగాది. మాను చిగిరించడమనేదికాదు. ఇది ఇంత చిన్న బిడ్డకు బోధించే దేలా?" యని అనుకుంది శరదమ్మ. మోడు వారిన ఆమె మనస్సు ఆమె కన్నీటి తడికి చిగిరించినట్టయి ఆమె భర్త రూపాన్ని కళ్ళెదుట చెట్టు చిగురుకంటె అప్రయత్నంగా ప్రదర్శించింది.

జగజిగీషుకుకూడా కన్నీళ్లొడ్లో కారసాగినై. కాని ఆబుద్ధిమంతుడు తన కన్నీటిని తల్లికి కాపరచకుండా తెప్రేసుమీదకు వెళ్ళిపోయి, ఊరకే "ఏరియల్" మీదకు విదురుస్తూన్నాడు. తల్లి వాని వెనకాతలే పరుగెత్తుకెళ్ళి—"అదేం పనిరా" అంటే "యాజ్ఞవల్క్య మహర్షి ప్రాణం లేని కర్రపీఠాన్ని చిగిర్చేటట్టు చేయలే?—మొన్న చెప్పావు కథ: నేనూ నా కన్నీటితో ఈ ఎండుకర్ర చిగిరించాలని కోరుతూ వున్నాను" అన్నాడు జగజిగీష్.

"నాయనా? మఱి నీ మనస్సు నేడు క్రొంగ్రొత్త చిగిరించిందోయి! నేడే నిజమైన ఉగాది మనకు" యని కుమారుని తల్లి మూర్కొంది.—

.... .... .... .... ....

# ఒరే...! ఓ బిత్తిలీ...

పిల్లకాయ లిద్దరు ఒక చోట కూర్చుని,
"వొరే, ఇదేం ఖర్మంరా. బజార్లో కెళ్ళి బెల్లం యడిగితే బెల్లం లేదంట, పంచదార యడిగితే పంచదార లేదంట! మఱి మనం చావవలసిందే?" యని అనుకుంటూ యున్నారు.

పిల్లాళ్ళల్లో కూడా ఈ అసంతృప్తి, ఆకలితీఱమి, ఆర్థిక పరిక్లిష్ట పరిస్థితిని గురించిన ఆందోళన, ఆర్తనాదం, నే వినడం ఇదే మొదటిసారి! బియ్యం లేవన్నా, ఉప్పులేదన్నా, కొబ్బరి నూనె లేదన్నా, ఎల్లాగో వోలాగు సర్దుకుపోయేవారు. మఱి ఉః ఉః! మధురం మానలేరు ఈ కుఱ్ఱకుంకలు!" అని చాలా జాలిపడ్డాను.

ఎందుకు? సుజలాం సుఫలాం సస్యశ్యామలాం:" తియ్యని తేనెగూన మన మాతృదేశం "అని యనుకోవడం? ఎటువంటి దేశంలో పుట్టారు వీళ్ళు ఈ కుఱ్ఱవాళ్ళు. "వీళ్ళనోటా శనే? ఇలాంటి ఎటామెటీ మాట వచ్చాక ఏం ప్రసిద్ధి? ఏం ప్రఖ్యాతి?"

ఇలాగ్గా నాలో నేను మహాసమస్యగా అధునాతన ఆహార సామగ్రి సమగ్ర జరుపుతూ వుంటే ఆ పిల్లకాయల్లో వొకడు "వొరే వెంకట్రాయుడూ వో బిత్తిలీ చేస్తే దొరుకుద్దిరా— బ్లాక్‌మార్కెట్లు-లో-బెల్లం" అన్నాడు.

వెంకట్రాయుడు వెంటనే "ఏమిటా బిత్తిలీ?" యని అడిగాడు, నేను పొంచుండి వినసాగాను.

వెంకట్రాయుడుతో చెబుతున్నాడు స్నేహితుడు : "ఏమీ లేదు, వీశెడు బెల్లంతో ఏబులం బెల్లప్పండుకూడా కొనుక్కోంటే ఎంత బెల్లం కావలిస్తే అంతబెల్లం ఇస్తాట్ట షాహుకారు."

"బెల్లప్పండు ! బెల్లప్పండు ! అంటూ ఊ ఇదయ్యాడు వెంకట్రాయుడు.

నేనూ ఇదయ్యాను ! ఎంచేతా యంటే పెద్దాళ్ళ కృషి అయినా, ఎలాగో వోలాగు, తిను-తినుబండారపు సరుకు ఇంట్లో పడేసుకోవలసిందేగా ! వీశెడు బెల్లం చేకూడేటప్పుడు కూడా మరే పదార్థం కొన్నా కూడికే, అసలు ఒక అణావో బేడవో అదనంగా రొక్కం పారేస్తే మఱీ కూడిక, " యని అనుకుంటూ ఆ పిల్లకాయల వెనకాలే, లోగడ ఏలా ప్రచ్ఛన్నంగా వున్నానో ఆ ప్రచ్ఛన్న మార్గాన్నే వుండి నడచి షాహుకారిగ్గాని, పిల్ల వాళ్ళగ్గాని, కనబడకుండా కొట్టుదగ్గరసాలో నిలబడ్డాను సంగ తేమిటో తెలిసికొందామని.

వెంకట్రాయుడు వీశెడు బెల్లం ఇమ్మన్నాడు. అని కంట్రోల్ ధర రు 0-10-0 లు చేతబెట్టాడు. దీనితోబాటు ఏబులం బెల్లప్పండుకూడా రు 0-5-0 ల ఖరీద్ది కొనుక్కోవాలి" అన్నాడు షాహుకారు.

ఈ బెల్లప్పండు అన్నాది అప్పటి కప్పుడే కట్టి పడేసి వున్నాయి ఏబులం ఏబులం తూకంగా—ఆ వఱకు ఎన్నివీశెల బెల్లంమీద ఎన్ని ఏబులాల బెల్లప్పండు పొట్లాలు ఖర్చు అయ్యాయో ఆ షాహుకారుకు !

వెంకట్రాయుడు బెల్లప్పండు పొట్లమూ తోడనే కొన్నాడు, బెల్లంమీద ప్రేమకొద్దీ ! కొనకపోతే బెల్లం అమ్మడుగా షాహుకారు !

పొట్లం విప్పకుండానే పొట్లంవంక చూడకుండానే పట్టుకున్నాడు వెంకట్రాయుడు. విప్పితే స్నేహితుడు కాజేస్తాడేమో అకాస్త పండూను ?

రెండోవాణ్ణి అడిగాడు షాహుకారు "నీక్కావాలా అబ్బాయీ ?" అని. "నాకు అక్కలేదు."—అన్నాడు వాడు.

అప్పుడు నేను షాహుకారు ఎదరపడి "ఓయీ ! ఇవ్వవోయి ! నాక్కావాలి ! ఒక వీశె బెల్లం ఒక ఏబులం బెల్లప్పండూను. "అయినా చూణ్ణియ్యి" అన్నాను అనడంతోనే షాహుకారుకు ఏం చేయడానికీ తోచలేదు. లేదంటాడా బెల్లం ? చూపిస్తాడా సరుకు ?

"చూచుకోండి దేని నాణెం దాందే, పండు పండే, బెల్లం బెల్లమే ! మానోళ్ళ మాటలల్లా కలోసివచ్చేస్తాయి ! రేగు పుక్కీ రేగుపండుకూ ఎంత సంబంధముందో అంతే సంబంధం ఇక్కడాను. బాగుంటేనే పుచ్చుకోండి పండు." అంటూ బొంగురు గొంతుకు లేవనెత్తి పొట్లం ఒకటి నాచేత బెట్టాడు.

విప్పిచూస్తినిగందా పొట్లంనిండా పురుగులూ పుచ్చు ఖరూరప్పండూను !

కుఱ్ఱవాళ్ళచేత వాళ్ళు కొన్న పాడు సరుకు తిరిగి వాపసు చేయించి అణా తక్కువ రూపాయ కాకుండా షాహుకారుచేత యతడు చేసిన పనికి యతనిచేత రూపాయ పూర్తిగా వాళ్ళకు తిరిగి ఇప్పించివేదామని తలపోశాను.

ఏరీ వాళ్ళు ? అంతలోనే వెళ్ళిపోయినారు పరుగెత్తుకుంటూ—బెల్లం వీశె, బెల్లప్పండు ఏబులం తింటూ గింజలూసుకుంటూ. "షాహుకారూ ! మఱెప్పుడూ ఇలాంటి సరుకు అమ్మ

పిల్లల్ని మోసంచేయకు " యని అతని ముఖం చూశాను పోనీ రూపాయి ముఖంగానైనా మారతాడేమో అని, లేందే.

" గింజలుమాత్రం సరుక్కాదటండీ ? ఈ రోజుల్లో పిల్లలాడుకునే చింతగింజలకు ధరుంది. జీగురు పురుగు మూగికూకునే కుంకుడిక్కాల కెక్కాళ్ళేని గిరాకీని ! ఖర్జూరపువిత్తులు మాత్రం సామాన్యపువా ? పిల్ల లూసారో మఱీ విరివిగా బయల్దేరతాయి మొక్కలు అయిన చోట కానిచోట, కరువుదీఱ చెప్పన్న దేశాల, ఒక మేక హిమాచలంమీద కే త్తేస్తుంది. ఒక కాకి హిందూమహాసముద్రంలో మునగేస్తుంది. ఒక గద్ద సహారాలో ఒగ్గేసొస్తుంది. పుచ్చుఖర్జూరం మాత్రం ఆవల పారేస్తే అప్రయోజన మనుకున్నారా " అన్నాడు బలే ముదలకింపుగా.

ఎండుపొట్టి మిరపకాయ వొకటి తక్కెడ దగ్గఱ నేలపడివుంటే పయికెత్తి, ఇంకా అన్నాడు " ఇలాంటి మిర్చి బజార్లోంచి మఱేకొట్టు మీదైనా తేండి. చూస్తాను. ఇది మొన్నను ఎగ్జిబిషన్‌లో పతకం అందుకొన్న బాపతుది !" అంటూ.

మఱి మాటకు మాట తెగులు తప్ప ఈ రోజుల్లో నీతి లేదు నియతి లేదు." అని నా దారిని నే వెళ్ళిపోయాను.

నాకు అక్కఱలేదు బెల్లప్పండు నేతీసికెళ్ళినా మా అమ్మమ్మ కరుస్తుంది. " మనింటిదగ్గఱ లేదట్రా బెల్లప్పండు " అని. మా అమ్మమ్మ మా బుల్లితమ్ముణ్ణి అస్తమానం బెల్లప్పండు అంటూనే ముద్దెట్టుకొంటూంది. నాకొద్దు బెల్లప్పండు ఏబులం వద్దు పంపువద్దు" అన్నాడు వాడు.

దాంతో నేను నవ్వు ఆపుకోలేక షాహుకారి ఎదరపడి—
" ఓయీ ! ఇవ్వవోయి ! నాక్కావాలి.—

.... .... .... .... ....

# సత్యం సర్కస్ జంప్

సత్యం అనే పేరుగలవాళ్లు ప్రతీ ఇంట్లోను వుంటారు సర్వసాధారణంగా! అందులోనూ ఈ కలికాలంలో శ్రీ సత్యనారాయణ మూర్తిని మించిన వేల్పు కానరాకపోవడంవల్లా, ఒకవేళ వేల్పుల్లో వేంకటేశ్వరుడు సమాన ఫాయీలో వున్నానన్నా, ప్రసాదాల్లో, సత్యనారాయణ ప్రసాదంతో తత్తుల్యమైంది ఈ జగత్తులో లేని కారణంవల్లా, ఇంటింటా ఆ పేరుగల వాళ్ళు, ఒకళ్లో ఇద్దరో ఉండకమానరు. సత్యనారాయణమూర్తి అనో, రావు యనో, శర్మ యనో, శాస్త్రి యనో ఏదోవిధమైన సత్యనారాయణ తోక గలవాళ్లు వుండితీరుతారు. ఆలా మీమీ ఇళ్ళల్లో వుండే ఏ సత్యం కాడు. ఈ సత్యం మా సత్యం! "మా" అన్నానని మా మాఁవ సత్యం యని అనుకునేరు గనక, కాడు. మా కథలో సత్యం!

ఈ సత్యం తండ్రిపేరు "పత్యం" అసలా పేరే పత్యమో, అది పరిహాసపు పేరో తెలియదుగాని యందరూ సత్యాన్ని గుర్తించేటప్పుడు మాత్రం పత్యంగారి సత్యం యని గుర్తిస్తూవుంటారు. ఈ పత్యం అన్న ఆయన, ఆయన కొడుకు సత్యాన్ని మిక్కిలీ సత్యసంధుణ్ణిచేసి మరీ లోకంలో విడిచి పెట్టాలని సంకల్పించుకున్నవాడై, రోజూ ఏదో ఆ బిడ్డడికి పని చెప్పి, ఆతని తప్పు లస్తమానం తాను దిద్దుతూ, తన పెద్దరికం నిలబెట్టుకుంటూ వుండడం పరిపాటి,

తెల్లారగట్లే తా లేస్తూ "పత్యం" అన్న ఆయన, సత్యాన్ని లేపి ఏదో పద్యం "కొఱగాని కొడుకు బుట్టిన"

అన్నది తీసికొని, వానిచేత వర్లింపించి, దానికి పద విభాగం, అర్థం, తాత్పర్యం యన్నీ పక్కమీదనే పఠింపించి, మళీ లేవ నెత్తి, ముఖం కడిగించి, బజారుకు అణా, బేడా, పరకా పావు ఇలా ఇచ్చి వానియొక్క సత్యపరాయణత్వ తత్వాన్ని నిత్యం పరీక్ష చేయడం తన ప్రజ్ఞగా చాటుకొంటూవుంటాడు.

ఓనాడు సత్యం చేతికి పత్యంగారు నాలుగు పావులా కాసులు ఇచ్చి వీశెడు పంచదార పట్టుకు రమ్మన్నారు. సత్యం ఏంచేశాడు ? నాలుగు పావలాకాసులూ తన అఫ్‌షారమ్‌జేబులో పడేసుకొని బాటంటే పోతూపోతూ ఎక్కడ గెంతాడో—కొంత దూరం వెళ్ళాక జేబు చూసుకున్నాడు. చూసుకుంటే ఒక పావలా కాసు జేబులో కొఱతగా కనబడింది. “ అరెరే ! ఎక్కడ జారి పోయిందో పావులా ?” యని అటూ ఇటూ కాస్సేపు వెమకి, కానక, కళ్ళమ్మట నీళ్లెట్టుకుంటూ తిరిగి తండ్రిదగ్గఱకు చక్కా వచ్చి “ నాన్నా ! పావులా ఎక్కడో పడిపోయింది ” అన్నాడు. పత్యం “ అన్నీనా ? ఒకటేనా ?” యని అడిగేడు. “ ఒకటే ” అన్నాడు సత్యం. “ ఒరేవు ! నిజం చెప్పు ” అన్నాడు పత్యం. “ నిజంగా నేను ” అన్నాడు సత్యం. “ నీవేం కొనుక్కు తిన లేదు కదా ” యని అడిగాడు పత్యం. “ లేదన్నా ” డు సత్యం. ఇలాగ్గా సత్యానికి పత్యంగారికి పావుగంట, ప్రశ్న జవాబు, జవాబు ప్రశ్నగా సంభాషణ జరిగాక, తండ్రి పత్యంగారు కొడుకు సత్యాన్ని “ ఒరేవు ! నీవు ఏలా నడుచుకుంటూ, ఏదారిని వెళ్ళావో ఆ దారిని అదేమాదిరిగా మళ్ళీ నడువు ! చూస్తాను. ఎక్కడ గెంతావో ! తెలుస్తుంది ! ఎక్కడ పడి వుంటుందో ఆ పావులా బోధపడుతుంది. నీ పేరెంతవఱకూ సార్థకపరుస్తావో చూస్తాను ” అన్నాడు పత్యం.

"గెంతలేదు! నేనెక్కడా ఏమి గెంతలేదు నాన్నా!" అని సత్యం అన్నా వొప్పుకోలేదు పత్యం. సత్యంముందు పత్యం గారు ఆ వెనక నడవసాగారు. "మటి మూడుపావులాలే వున్నాయి నాలుగో పావులా లేదు పడడానికి" అన్నాడు సత్యం కొంతదూరం వెళ్ళి. "ఇదిగో అంటూ వేతె మతో పావులాకాసు తాజాగా పడేశాడు సత్యం జేబులో! పత్యం.

సత్యం సత్యంగా నడిబజారులో నడుస్తూ నడుస్తూ, అప్రయత్నంగా ఒకచోట గబుక్కున గెంతాడు. కాని పడలే పావులా కాసు ఒకటిన్నీ!

"గెంతలేదన్నావు! అసలే గెంతలేదన్నావు! గెంతు! వెధవా! ఇంకా గెంతు! పడేదాకా గెంతు! పావులా పడేదాకా గెంతు?" యని అదేతన్నడం తన్నాడు సత్యాన్ని పత్యం. "ఏమిటాకోపం?" అని బజారు జనం మూగినకొద్దీ హద్దుమీటి ఒకటే తాడనం ఒకటే తన్నడం—సత్యానికి కడుపుబ్బి కళ్ళు వాచిపోయినాయి!

"ఏమిటండీ పత్యంగారూ! అంతకోపం కూడదండీ!" అని పదిమంది పట్టుకు ప్రశ్నిస్తే "ఈ వెధవ, దారంట సర్కసు జంపులుమీద వెడితే పావులాకాసు లుంటాయా? జేబులో?" యని అడిగాడు. ప్రజలు "మీరు చూసింది! అసలు సర్కసు జంపు కానేకాదు. అసలు సర్కసు జంపు ఇందాకా మీరు లేనప్పుడు మీరు అడగనప్పుడు గెంతిందే! ఆ గెంతు మళ్ళీ మీ అబ్బాయికి రానూరాదు! మళ్ళీ పావులా పోనూపోదు! ఎందుకు శ్రమపడతారు మీరు? ఆ పిల్లణ్ణి ఎందుకు శ్రమ పెడతారు?" యని అడిగారు. పత్యం అన్నాడు: "సత్యంకోసం!

పరమపవిత్రమైన సత్యంకోసం!" అన్నాడు వాగురుస్తూ.
"సత్యంకోసం అయితే మీరలా బాదనే బాదరు పిల్లాణ్ణి! సత్యం కోసం కానే కాదు" యని సత్యంగారిని అడ్డమైన చీవాట్లూ పెట్టారు అందఱూను.

సత్యం అపాళంగా వొక్క ఎగురు ఎగిరాడు. నాలుగు పావులా కాసులూకూడా ఒక్కసారి తన జేబులోంచి పడేలా: బాటనే దొర్లేలా!

"ఓరి! ఎంత "జంప్" జంపావురా! యని అందఱూ ఆశ్చర్యపోయారు. తండ్రి సత్యంగారు నిశ్చేష్టుడై చూచేడు!

.... .... .... .... ....

## అమ్మగారి రయిక

"కులాలన్నీ కలిసిపోయి తీరాలి!
పొలాలన్నీ ఉమ్మడిగా జరగాలి!
మఱి కుబేరులకు తావుల్లేవు
కోటి పడగలకు కోఅలు సున్నా!
కోటలు పేటలు కూలివారివి
ఐశ్వర్యం అనాది వాండ్లది!
కొన్నాళ్లలో 'గోల్డెన్ ఏజ్'—
కూడూ గుడ్డా కారుగెరాజ్
కొందఱి కేకా దండఱికీ."

ఇలా పాట పాడుకుంటూ కేకలు
వేసికొంటూ పెద్ద ప్రొసెషన్!

ఇసకేస్తే రాలనంత పెద్ద ప్రొసెషన్ ఎఱ్ఱ జండాలతో చిఱ్ఱు బుఱ్ఱుమంటూ, కొడవళ్ళ గొడ్డళ్ళ గునపాల చిత్రాల 'కో' అని పిస్తూ, సాగిస్తున్నారు ఒక రెండువేల జనం.

జమీందార్ సామినేని పిళ్ళ జగ్రున ఆ ప్రొసెషన్ మధ్య నుంచి జగ్రిగొడ్డులా తన కారును నడిపించుకు పోయాడు. అత దొకళ్ళమీదకు కారు పోనియ్యలేదు. అతని కారుమీద వొకళ్లు చెయ్యేయ్యలేదు. ఆ కారు నిగారింపులో రెండువేల జనం బొమ్మల్లా ఆగిపోయినారు. అతని కళ్ళద్దాల లోతట్టుకూడా వాళ్ళల్లో కొందఱు కొందఱు ప్రతిబింబా లూనిన వాళ్ళయినారు. అతని మనస్సులో ఇంతకూ నిల్చినవారెవ్వరో ఆ రెండువేల మందిలోనూ ?

ఎవళ్ళూ నిలిచినట్టు కనబడదు, యతని కళ్ళల్లో—అతని మనః కేంద్రీకరణమంతా చెవుల ద్వారానే జరిగింది ఆ పొద్దు.

తిన్నగా కారును రస్తా చివరకు గొంపోయి అక్కడ కారుదిగి, ఒంటిగా ఒక ఏరు ప్రక్కనే నడక తీసికొంటూ, నాటి ప్రొసెషన్‌లో విన్న నాలుగు ముక్కలు పునశ్చరణ గావించుకో దొడగాడు. పునశ్చరణతో ఇలా బుద్ధిపూర్వకమైన ఆలోచనలో పడ్డాడు, "పాటకపు జనమే చెమటో డ్తారని ప్రభువులు చెమ టోడ్చరని వాళ్ళెందు కనుకోవాలి? నామట్టుకు నేను బంతాట ఆడు తోనో గుఱ్ఱపు సవారిచేస్తూనో మితిలేని చెమట రోజూ వోడుస్తాను. కూలిపని చేసేవాళ్ళే చెమటోడుస్తారని వాళ్లెందు కనుకోవాలి? పాల కులు కూడా పనిముట్లతో పనిచేస్తారే ? నా మట్టుకు నేను రోజూ నా పూలతోటలోని మొక్కల మొదళ్లు త్రవ్వి వాటి కేతమెత్తి నీరు తోడుతాను. ఆ మాటకొస్తే నే నెటువంటి మెత్తని సీటు మీద కూర్చుంటానో యంతకంటె మెత్తని సీటుమీద నా డ్రైవరు కూర్చుంటాడు. ఒక్కొక్కప్పు డతగాణ్ణి విశాలమైన వెనక సీటుమీద కూర్చోపెట్టి నేనే చోదన చక్రంచేత ద్రిప్పి కారు

నడుపుతో వుంటాను" అని యిలా సామినేనిపిళ్ళ, దిజమిం దార్, అనుకుంటూ ఒక ఆరమైలు ఏటి యొద్దే నడవడంలో, అతని కాలు చటాల్న ఒక రాతిని తప్పించుకోవలసి వచ్చింది.

రాయి చాకిరేవు రాయి, ఏరు కొంచెం వెనక్కి వెళ్ళ డంచేతే దారిలో కొచ్చింది అది. దాన్ని తప్పుకు కొంచెం ఎగు వుకు మెట్టేలో, ఒక చాకెత, ఎక్కణ్ణుంచి వచ్చిందా దాని కా సొగసు యని అందఱూ యనుకునేటంతటి కుఱ్ఱయందకత్తె! రయిక తొడుక్కుంటూ అయ్యగారికి కనిపించింది.

సామినేని పిళ్ళ రజకరాగిణి వంక యదోలా చూశాడు. అది, ఆ అంగన, సగ మెక్కించుకున్న రయికతోనే "అంత అలాసూణ్ణక్కర్లేదు తమరు. ఇది అమ్మగారి రయికేనండి!" అంది అమాయక మందహాసంతో.

జమీందారు చింతాకంత ముఖం చేసుకుని ఏటివంక చూశాడు. ఏటిలో చాకలివాడు తన ముఖం కందగడ్డ గావించుకు బల్ల ఎత్తి, కొత్త రేవుకై కుదేసుకుంటూ వున్నాడు.

జమీందారు "ఆ రాయి ఎక్కడిదిరా?" యని అడిగాడు వాణ్ణి, తన యింటి చాకలిగా గుర్తించి, వాడు "మన కొండ దండి!" అన్నాడు కోటి పిడుగు లుఱిమినట్లు.

దాని సామ్యవాద సుందర మందహాసానికీ, వీని సామ్య వాద దుర్భర మహా క్రోధానికీ జమాఖర్చు తేల్చుకుంటూ సామి నేని పిళ్ళ నాటి సాయంకాలం ఇంకా సరిగా పూర్తి సంధ్య పడకమునుపే చఱచఱా తన కారు దగ్గఱకు చక్కాపోయాడు.

సమాప్తము.

# ఇందులో కధలు